

# యుద్ధ కాండ
## (ప్రథమ భాగము)

కరుటూరి సత్యనారాయణ



నా యుద్ధకాండ ప్రథమ భాగమును

సాక్షిన్నారాయణ స్వరూపుఁడు,

ధర్మ తత్పరుఁడునగు శ్రీరామచంద్రప్రభువు వారికి

పూజాప్రసూనముగా సభక్తికముగా

సమర్పింపబడినది.

కేరుటూరి సత్యనారాయణ



# వక్తవ్యం

హనుమంతుఁడు అంబర మార్గమున శతయోజనాయత దక్షిణ సముద్రమునుదాఁటి లంకలో సీతాదేవి రావణుని అశోకవనములో నిర్బంధములో నున్నదని తెలియజేయగా రాముఁడు తమ్ముఁడు లక్ష్మణునితోను, వానరేశ్వరుడగు సుగ్రీవునితోను, ప్లవగ భల్లూక సేనతో బయలుదేఱి దక్షిణ సముద్రతీరమునకు చేరెను. అప్పుడు లంకలో దశగ్రీవునకు విభీషణుఁడు రామునితో వైరము పనికిరాదనియు రామునికి సీతను సమర్పింపుమని కోరగా అతనిపై కోపించి దేశనిష్కాసితుని గావింప నతడు శ్రీరాముని శరణు పొందెను. రాముఁడు సముద్రము దాఁటుటకు సముద్రుని ప్రార్థింపగా నతఁడు మయకుమారుఁడగు నళునితో సముద్రమునకు సేతువు కట్టించుమని సలహాయివ్వగా నళుడు కట్టిన వారధి మీదుగా రామలక్ష్మణులు, సుగ్రీవుడు ప్లవగభల్లూకసైన్యముతో లంకాప్రవేశము గావించెను. రావణుడు రాముని జైత్రయాత్రకు భయపడి శుకసారణులు, శార్దూలుఁడునను వేగరులనుబంపి సైన్యవివరములను సేకరింపగా వారు సైన్యవిస్తృతిని గుఱించి రావణునకు తెలిపి సీతను రాముని కొసంగుమని చెప్పిరి కాని అతఁడంగీకొనబడలేదు. రాముఁడు లంకలో సువేలాచలమునుండి రావణుని తిలకించుచుండగా ప్రక్కనుగల సుగ్రీవుఁడు కోపముతో ఆకాశమార్గమునబోయి రావణునితో ద్వంద్వయుద్ధముచేసి వచ్చెను. రాముఁడు విభీషణునకు శరణు నొసంగి అతనిని లంకాధీశునొనర్ప వాగ్దానము చేసెను. రావణుడు తన సౌధాగ్రము నుండి సైన్యవిస్తృతిని పరికించెను. రామలక్ష్మణుల, సుగ్రీవుని ప్లవగభల్లూక వీరుల బలాబలముల పైనము నెఱింగి భీతచేతస్కుఁడయ్యెను. కాని సీతను రాముని కర్పింప నొడబడలేదు. ఒకసారి సీతతో రాముని తన సేనానాయకు

డగు ప్రహస్తుడు వధించెనని చెప్పి ఆమెకు రాముని మాయాబాణాసనము, కృత్రిమ శిరము, బాణములుచూపి భయపెట్టెను కాని సీత అందుకు దుఃఖించియు రావణునకు స్వాధీనమగుట కంగీకరించలేదు. లంకలో రావణున కెన్నియో దుర్నిమిత్తములు కనబడెను. యుద్ధప్రారంభమునకు ముందు రాముడు దశగ్రీవునికి అంగదునితో రాయబారము పంపి తనకు సీత నర్పించుమని తెలిపెను. అతడు రావణునకు బుద్ధిఁ గఱపివచ్చెను. అతనిని బంధించినను అతడు విడిపించుకొని రామునికడకు వచ్చి చేరెను. రామాజ్ఞపై వివిధ యూథపులు లంకాద్వారములను ముట్టడించిరి. యుద్ధము ప్రారంభమయ్యెను. ఇంద్రజిత్తు యుద్ధములో రామలక్ష్మణులను నాగబంధ మోహితులను గావింప గరుత్మంతుడు వచ్చి వారిని నాగబంధవిముక్తుల గావించెను. రావణుడు రామలక్ష్మణులు మరణించిరని సీతకు కబురు పంపి ఆమెను విమానముపై యుద్ధభూమికి పంపెను. కాని త్రిజట వారు మరణింపలేదు. మూర్ఛపోయినట్లున్నారని చెప్పగా సీత మరల అశోకవనమునకు వెడలెను. ఆ పరిస్థితిలో విభీషణుఁడు రామ లక్ష్మణులకు సైన్యమునకు సుగ్రీవునకు అండయై నిలిచెను. తరువాత రావణుడు ధూమ్రాక్షుఁడు, వజ్రదంష్ట్రుఁడు, అకంపనుఁడు ప్రహస్తాదులను యుద్ధమునకు బంపెను. వారెల్లరు వానరులచే వధింపబడిరి. ప్రహస్తుని నీలుడు సంహరింపగా రావణుడు స్వయంగా మందిమార్బలముతో రణభూమికి వెడలి రామునిచే ఓడింపబడి లంకకుపోయి నిద్రలోనున్న కుంభకర్ణుని లేపించి యుద్ధమునకుపంప అతడు సైన్యముతో చాలమందిని మ్రింగివైచెను. తరువాత రామునిచేతిలో చిత్రవధ కావింపబడి మరణించెను. తరువాత రావణకుమారులు, తమ్ములు యుద్ధమునకు వెడలిరి. కుమారులగు త్రిశిరుడు, నరాంతకుడు, దేవాంతకుఁడు, అతికాయుఁడు, తమ్ములు మహాపార్శ్వుఁడు, మహోదరుడు యుదము

నకుపోయి హనుమంతుడు. అంగదుడు, లక్ష్మణుఁడు మొదలగు వారి చేతిలో వధింపబడిరి. మరల ఇంద్రజిత్తు యుద్ధమునకు వచ్చి బ్రహ్మాస్త్ర మును ప్రయోగింప దాశరథులు, సైన్యము మూర్ఛనునటింప అతడు లంక లోనికి తిరిగిపోయెను. తరువాత సుగ్రీవుని యాజ్ఞపై కొఱవులతో లంకను దహించిరి, చాలమంది రాక్షసులు మరణించిరి. రావణుడు కుంభకర్ణుని సుతులు కుంభనికుంభులను, వ్రజంఘుఁడు, శోణితాక్షుఁడు. యూపాక్షులను పంపగా వారు వధింపబడిరి.

ఇది యుద్ధకాండ ప్రథమ భాగములోని కథాంశము. నేను రామా యణ గాథను వేరు వేరు శీర్షికలు అనగా బాలకాండ, సత్యదర్శనము (కైక), పంచవటి. మైత్రీబంధము, సీతాన్వేషణ, సుందరవిజయం (సుందర కాండ) ప్రథమ, ద్వితీయ భాగములు, యుద్ధకాండ ప్రథమభాగము రచించి తిరుమల తిరుపతి దేవస్థానములవారికి ఆర్థికసహాయము కొరకు నివేదింపగా వారు దయతో నాకు యీపైగ్రంథము లన్నింటికి ఆర్థికసహాయముగావించి యున్నారు, అందుకు నేను తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహ ణాధికారులకు, పౌరసంబంధాలఆఫీసరుగారికి, ఎడిటరుగారికి బహుధా సర్వదా కృతజ్ఞుఁడనై నావినమ్రనమస్కారములర్పించుచున్నాను. యుద్ధకాండ ప్రథమభాగమును చక్కగా ముద్రించిన సరస్వతీపవర్ ప్రెస్ వారికి ముఖ్య ముగా మేనేజరు K. బుచ్చిరాజుగారికి కృతజ్ఞుఁడను. గ్రంథమునకు ముఖపత్రచిత్రమునందించిన శ్రీ బుద్ధా సత్యనారాయణగారికి నా కృతజ్ఞతలు.

బుధజన విధేయుఁడు

కరుటూరి సత్యనారాయణ



# యుద్ధకాండ

ధరణీనందన లంకలో నిలుచు వృత్తాంతమ్ము శ్రీరామునకో
నెఱిగింపం బవమాననందనుఁడు నెంతే తృప్తి నా పావనిన్
బరువున్ నిల్పితి వంచుఁబేర్కొనుచుఁదా వ్యాహారముంజేసె భా
స్కరపుత్రున్ గనుగొంచుఁ బ్రీతిపడుచున్ సార్ద్రమ్ముగా నివ్విధిన్ 1

ఏ సుపర్ణుఁడో, పవనుఁడో, యితఁడో తప్ప
నింత దుస్తర కార్యమ్ము నింత నేర్పు
తోడ నిర్వహించునె లాతి? ధూర్వహుఁడయి
దీని నెంతో తేలికగను దీర్చె నితఁడు 2

వీరలుతప్ప యన్యులకు విన్ననఁబోవగ సాధ్యమా? చొరం
బాఱెను లంకలో-తిరిగివచ్చెను నీ సచివుండు భానుజా!
వీరునివోలె ధైర్యమున విక్రమమెంతయొచూపి వైరులన్
మారణహోమమున్ జరిపె మామక సైన్యబలమ్ముఁదెల్పఁగన్ 3

వనధిఁదరించి రాక్షస నివాసములోఁబదమూని జానకిన్
గనుగొని, మాటలాడి తన కార్యము చక్కగ నిర్వహించెగా
వనమునుగూడ నొంటిమెయి భంజనమున్ బొనరించి, రావణున్
దనుకుచు బుద్ధిఁజెప్పి, పురి దావమొనర్చెఁగుశాగ్రబుద్ధియై 4

లంకలోఁజొరుట యొకటి లావు మిగుల
నుత్కటుల రూపుమాపుట యొకటి మఱియు
తన బలపరాక్రమమ్ముల దానవులకుఁ
దెలిపి రావణు సభలోనఁదెగడుటొకటి 5

సురగరుడోరగవిద్యా
ధరకిన్నరసిద్ధసాధ్యదానవు లెవరున్
చొరరాని లంకనీతఁడు
పరాక్రమమునఁబ్రవేశించి వచ్చెను మరలన్ 6

ఇతరు లిద్దాని మదిని నూహింపరాని
దుర్లభము, దుస్తరమ్మును, దుశ్శకమగు
కార్యమీతఁడొక్కఁడె చేయఁగలిగె సఖుఁడ !
ప్రభువునాజ్ఞను పాలించె పట్టుదలగ 7

క్షితిపతి కోరిన క్లిష్టకార్యముఁగూడ
భక్తితోఁజతురిమ, యుక్తిఁజూపి
యేతండు నెరవేర్చు, నాతఁడుత్తమ పురు
షుండగు తా సమర్థుండుగ ప్రభు
వెంతచెప్పిన నతఁడంతమాత్రమె నేయు
భృత్యుండు మధ్యమప్రేష్యుఁడగును
తాను సమర్థుండుఁదగిన వాడయ్యు నే
లిక కార్యమొనరింపలేని భృత్యుఁ

డధముఁడందురు హనుమంతుఁడందులోన
నుత్తముఁడు చేయవలసిన దోర్పుతోడ
నిర్వహించెను దనుజుల నిగ్రహించి
తా నసాధ్యుఁడ ననిపించి ధన్యుఁడయ్యె 8

పొడగాంచి లంకలో భూమిజ తద్వార్త
వినిపించి మారుతి తనివి నిచ్చె
నను. మహాబలుని లక్ష్మణు, రఘువంశము
రక్షించె ధర్మబలమ్ము పేర్మి
తప్పిన నాత్మహత్యాదోషము, నధర్మ
మునకును బాల్పడఁబోవ నగును
పావనికేను విశ్వాసమ్ముఁదెలిపెడి
సమయము వచ్చె భాస్కర తనూజ !

ఇతనికేను నా సర్వస్వమీయఁదగుసు
దీనుఁడను గాన నాపరిస్థితికి వగచి
కౌఁగిలి నొసంగఁజాలుదు - కనుక నదియె
నేను సర్వస్వమిచ్చుచేయౌను హితుఁడ ! 9

నీవొనర్చిన యుపకృతి నెలవు కొనుచు
జీర్ణమగుగాక ! నాలోన చిన్మయముగ
ప్రత్యుపకృతి నరుండు నాపదలయందుఁ
బొందగా నర్హుఁడగునుసుమ్మొ కపివర ! 10

ఉపకారమ్మను స్వీకరించితిని నీ యుద్యోగముంజేసి, ప్ర
త్యుపకారమ్మనొనర్ప నిర్ధనుఁడనై యుంటిన్ గదున్ దీనుఁడన్
కపివీరా ! యుపగూహనమ్మొసగి సత్కారమ్ముఁగావింతు నీ
విపుడద్దానిని స్వీకరించినను నానృణ్యుండుగాఁజేయుమా ! 11

ఇదె నా సర్వస్వముగా
మదిలోఁదలపోసి హనుమ ! మన్నింపవలెన్
సదయాంతరంగమున నని
ముదమారగఁగౌఁగిలించె భూవిభుఁడుఁ గపిన్ 12

డోలాయమానమానసుఁ
డై లలిసుగ్రీవుఁబిలిచి యనుజా ! సైన్యం
బేలీలఁగడలి దాఁటుచు
నా లంకకుఁజేరగలుగు ననుమానమగున్ 13

రవిజుఁడందుకొని వీరాధివీరా ! రామ !
ప్రాకృతునట్టుల పరితపింతు
పవనిజ పొలకువ లన్నియుఁదెలిసెను
శత్రు నివాసము జాడతెలిసెఁ
జెనఁటి కృతఘ్నుఁడు స్నేహమ్ము విడిచిన
పగిది నీదుఃఖము వదలమేలు
కాన శోకింప నగత్యమే లేదింక
బుద్ధిమంతుఁడవు, విబుధుఁడవగుదు
సకల శాస్త్రముల్ చదివిన చతురుఁడవును
ప్రాజ్ఞుఁడవు–నిరుత్సాహము వదలు మింక
తిమితిమింగిలమకరవితీర్ణమైన
సాగరము దాఁటి వైరులఁ జంపగలము 14

భగ్నమైపోవు శోకించువాఁడు తాను
కడు నిరుత్సాహియైనచో, కడకు మతియు
కూడను చలించు కనుక రఘుప్రవరుఁడ!
దూరముంజేయుమయ్య నీ దుఃఖమింక 15

వానరవీరులు బహు సమర్థులు, మహా
శూరులు నీకోర్కె తీరు-వార

లగ్నిలో దుముకుదు రమరారిపురముఁజొ
చ్చెదరు శత్రువుల ఛ్ఛేదరు తెగువ

దేవర! దేవేరిఁదెత్తురు తమచేవఁ
జూపి నీ శోకముఁబాపఁగలరు

నేనిది దృఢముగా నిష్కర్షగాఁజెప్ప
వాఁడను నాయూహ వ్యర్థమెపుడు

కాదు-మము నడిపించెడి ఘనతనీది!
సేతువును గట్టగావలె సింధువునకు
దానిమీఁదుగ మనమంత దానవేంద్రు
లంకలోఁబ్రవేశింతము రామభూప! 16

ఆ త్రికూట పర్వతముపై నలరులంక
మనము చూచిన దశకంఠదనుజుఁడీల్గి
నటులె-సందియమేలేదు పటుతరమగు
వారధినిఁ గట్టకుండఁబోవంగఁ గదిఁది 17

సేతువును వినిర్మించినఁ జేవయున్న
నమరులకు నింద్రునకుఁగూడ నలవికాని
లంకఁబట్టుట సాధ్యము రామనృపతి !
అబ్ధిఁదరియింప వచ్చు జయమ్ము మనకు

ఉడుగును సర్వశక్తులు మహోదయ ! శోకముతోడ నిల్చినన్
చెడును సమస్తకార్యములు చిందిలిఁజెందుచునుండుచో నిపుం
డెదరునఁగ్రుంగుచేలను మహీక్షిత ! యెంతటి ధైర్యశాలియున్
గడమపడున్ విచారమునఁ గార్యములన్నియు సన్నవాఱగా

ఏదియేమైన నీయట్టిఁడెపుడు ధైర్య
సాహసము లవలంబింప జరుగు జయము
మహిత ! బుద్ధిమంతుల శిరోమణివి నీవు
సకలశాస్త్రకోవిదుఁడవు-శాస్త్రవగుదు

నీవివుడు శత్రువీరుల నిగ్రహింప
వలయు ధనువెక్కు పెట్టిన నిలిచియుండ
డెవఁడు నీ యెదుటఁబరాక్రమించి మూఁడు
లోకముల సాటియెవ్వఁడు నీకు ప్రభువ !

వానరుల బాధ్యులంజేయ వచ్చు, జయము
కార్యలేశముఁజెడదు సాగరము దాఁటి
లంకలో సీతఁ గనెదవు రామభూప !
విడుము శోకము గుండెల బెగ్గడిలక

కఱకుగా నుండకుండిన క్షతియె కలుగు
క్షత్రియున కెల్ల వేళల - సవితృకులుఁడ !
మందముగనున్నఁజెడిపోవు-నందఱు జడి
యుదురు-కఱకుగ నుండిన బెదరు పడుచు 23

కడలిఁగడచినవాలు లంకను జయించి
నటులె-వానరుల్ శూరులు పటిమఁగలరు
ఱాలు, రప్పలు వర్షించి రాక్షసులను
కూల్చివేయ సమర్థులు-క్షుణ్ణులు సుమి ! 24

తోఁచు శుభనిమిత్తమ్ములు తోయజాక్ష !
నీవు తప్పక గెలుతువు-చేవఁగలుగు
దోర్బలుండవు-దుర్జాతి దురమునందు
గ్రమందు తప్పక-లభియించు మహిజనీకు 25

హేతుబద్ధమ్మైన యినవందనుని మాట
వినుచును బరమార్థవేత్తయైన
రాముఁడు హనుమంతు రమ్మని చెంతకుఁ
బిలిచి వాకొనె కపివీర ! నేను
తపమొనరించియో తపియించి నీ రింకఁ
జేసియో సేతువు చేత నెటులొ
యీసముద్రము దాఁటు యేర్పాటుఁగావింతు
సందేహమేమియు నిందులేదు

లంకలోనున్న కోటలు, రావణు బల
మెంతయుండెనో ? ద్వారము లెన్నికలవో.
యచటి యేర్పాటులెట్టివో, యసుర భవన
ములును నెట్టివో రక్షణ భూతి తెలుపు ! 26

అనిలనందన ! యింతకు మునుపు నీవు
చూచి వచ్చిన కతమున శుద్ధముగను
కనులకుంగట్టు విధముగఁ గపివరేణ్య !
నాకు వివరింపుమనగ వానరుఁడుపలికె 27

రామ మహీక్షిత ! లంక విశాలము
సుందరమైనది-సోఁకులెల్ల
నుల్లాసముగ నుందు రెల్లకాలమ్మును
లంకలో వాజులు, రథము, లేన్గు
లుండె లెక్కకుమించి యూర్జిత రాక్షస
వీరులతో నిండు వీథులన్ని
దానికి నాలుగు ద్వారమ్ములుండెను
దృఢముగా నవియెల్ల దృష్టమగును

వాని తలుపులు భేదింపరానివి సుమి
వాని గడియలు దిటవుగా వరలుచుండు
ద్వారములు చాలపెద్దవి వాని యందు
జాలు, బాణముల్ విసరు యంత్రములు కలవు 28

శత్రుపృతన సమీపింప క్షణములోన
నాళ మగును వాకిళ్లఁగీనాళు లినుప
గుదియలందాల్చి వైరులఁగూల్చఁగలరు
ధర్మ ప్రాకారముండె నా పట్నమునకు 29

పురిప్రాకారము హేమరత్నమయమై పొల్పొందు నద్దాన నె
వ్వరికిన్ సాధ్యముకాదు దాఁటుటకు దుర్వారమ్ముగా నుండుటన్
పరిఖన్‌జూడ గభీరమైచెలఁగు భూపాలాగ్రణీ ! నీరమున్
బరిపూర్ణమ్ముగనుండి జివ్వుమను సంస్పర్శింపఁగాఁ జేతులన్ 30

మత్స్యములె కాదు పరిఖలో మకరములును
లెక్కలేనన్ని యుండెను రెక్కొనుచును
నాల్గు వాకిళ్లకడ వంతెనలు కలుగును
పరిఖ దాఁటుట కెత్తగ వాల్చుటకును 31

ఎన్నొ యంత్రముల్ వంతెన లెత్తుటకును
వాల్చుటకు నవసరము వెంబడిని కలవు
అచటి రక్షకభటుల గేహములలోన
యంత్రములను బిగించి రాయతపడగను 32

వరిమఁద్రికూటభూధరముపై దశకంతు
నగరము లంకఁజెన్నారుచుండు
స్నిగ్ధమ్ముగా గిరి చెక్కుట వలన ని
లింపులుఁబురి ప్రవేశింపలేరు

అదియొక గిరిదుర్గ మదియొక జలదుర్గ
మదియొక వనదుర్గ మనగఁజెల్లు
దక్షిణోదధి కవతలనుండె నాపురి
నౌకలు చేర వానగరమునకు

పట్టణము గిరిశిఖరాన ప్రబలుచుండి
సామజమ్ములు, వాజుల స్యందనముల
తోడ స్వర్గపట్నము మించి తురఁగలించు
వార్తలందవు లంకకు బైటి నుండి    33

లోతగునగడ్త, యంత్రముల్ కేతనములు
క్రూరకర్ముని పురి కలంకారములగు
దుస్సహులు, భీకరాసురుల్ తూర్పుద్వార
మందు నెలకొనియుందు రహర్నిశమ్ము    34

ఆహవమ్ముల ముమ్మొన యందునిలిచి
యుద్ధము నొనర్పఁగలిగిన యోధులంత
శూలఖడ్గముద్గరభిండివాలములఁ బ్ర
యోగముం జేయవలఁతులు యుక్తిపరులు    35

దక్షిణద్వారమున లక్షదనుజులుందు
రచటఁ జతురంగ బలముండు ప్రచురముగను
వారసాధ్యులు-పశ్చిమ ద్వారమందు
కలరు పదివేలమంది ముష్కర దితిజులు    36

చర్మ ఖడ్గధారులు వారు సతము నస్త్ర
శస్త్రములగూర్చి తెలిసిన చతురులంత
ఉత్తరమ్మున న్యర్బుద యోధులుంద
రందఱుఁగులీనులును గొప్ప యాశ్వికులును

పట్టణమ్మంతఁ గోట్లాది పాలసులకు
స్థావరమ్ముగ నుండె నసాధ్యులంత
నగరముననున్న వంతెనల్ నాశనమ్ముఁ
జేసితి, నగర్తఁబూడ్చితి క్షితిప నేను

ప్రాకారముఁ బడఁగొట్టితిఁ
దోఁకను బురమెల్లఁగాల్చి దుర్మదుల ననిన్
బోకార్చినాఁడ గడిమిని
కాకుత్థ్స కులాబ్ధిసోమ ! ఖలుఁడు నిహతుఁడౌ

కాన లంక జయించుట కష్టమేమి
కాదిపుడు సాగరము దాఁటగా మహేచ్ఛ !
చూడదగినది యని వాయుజుండు పలికి
చేయవలసిన కార్యమ్ముఁజెప్పె నతఁడు

దేవర యెట్టులైన నుదధిన్ దరియింపగఁ జేయుచోఁదమిన్
చావు ధ్రువమ్ము భూవర ! నిశాచరనేతకు నేలమట్టమై
పోవును లంక సర్వము విభూతినిఁగోల్పడు సుమ్ము జానకీ
దేవినిఁబొందఁగల్గుదువు తీరు ప్రతిజ్ఞ ప్రచండ వైఖరిన్

వాలితనూజుఁడు, పనసుఁడు, జాంబవం
తుఁడు ద్వివిదుండు మైందుండు, నళుఁడు
సేనాధిపతియగు శిక్షితుఁడగు నీలుఁ
డుండిన చాలును మెండు బలము
మన కగత్యములేదు-చని వీరు వినువీధి
లంక సర్వమ్మును లావుమిగుల
నీపాదముల కడ నెమ్మి నర్పింతురు
ప్రాకారకేతన భవనముల య

థాస్థితినిఁ దెచ్చియుంతురు ధరముతోడ
కనుక వారి నాజ్ఞాపింపఁగలుగు సుఖము
క్షణములో జైత్రయాత్ర ప్రచక్రముగను
బయలుదేఱుము కమలాప్త వంశభూప ! 42

రావణుఁడు స్వస్థచిత్తుఁడై రణములకును
సర్వసన్నద్ధుఁడగుచును జాగరూకుఁ
డై స్వయమ్ముగ స్వీయసైన్యమును సుపరి
శోధనముఁ జేయుచుండు ప్రస్ఫోటనముగ 43

హనుమంతు వచనములాలించి రాముఁడు
నిగదించె "మారుతి ! నీవుచెప్పి
నట్టి లంకాపురినంత నిమేష మా
త్రన నాశముంజేతు-తపనసూతి !

మనము ప్రయాణమై చనవలె భానుఁడు
గగనమధ్యగతుఁడుఁగాఁ గనఁబడు
అభిజిన్ముహూర్తము నందలి పయనము
కార్యసాఫల్యముఁ గలుగఁజేయు

సీతను హరించు ములుఁచ నశించితీఱు
గరళమును ద్రావి మరణించు కాలమందు
నమృతముం గ్రోలి జీవించునటుల సీత
బ్రదుకు తప్పక నారాక వార్తవినిన

నేఁడ ఉత్తరఫల్గుని నిండు తార
హస్తవచ్చును రేపది యశుభమగును
నాకు సకల సైన్యము తోడఁ బ్రాకటముగ
పయన మొనరింప జయము నిశ్చయము మిత్ర !

అన్ని శుభనిమిత్తమ్ములే యలరునేఁడు
కాన దశకంఠు నిర్జించి కాంత సీతఁ
బొందఁగలుగుదు-కుడికన్ను స్ఫురణమొందు
నిద్ది బలమైన సూచనయే కపీశ !

నీలసేనాధిపా ! నీవు ముందుగఁ బొమ్ము
లక్ష వానరవీరులను గొనుచును
మార్గమ్ము సరిచేయుమా ! బలములు సాగ
ఫలములు, మూలముల్ జలము, మధువు

తోరహత్తుగ నుండి దొరకు మార్గము నెన్ను
కొనుము-నిశాచరుల్ చనెడి త్రోవ
లోవిసమ్ముగను నీటిలోఁగల్పుచుందురు
పండ్లు, దుంపలను చూపఱగఁజేతు
రిద్ది గమనించుచుంబోవు మింగితమ్ముఁ
గలిగి వర్తింపవలెనుసుమ్మ-కపులలోన
మెరికలగు వారిఁజేకొని యరుగమేలు
వందలుగ వేలుగా నుండవలెను కపులు 47

పల్లపు ప్రదేశములలోన వనములందు
జలసమీపస్థలమ్ముల శత్రుగణము
నక్కియుండును గాన వానరులు నడుమ
పైకెగిరి శాత్రవులజాడ పట్టవచ్చు 48

క్ష్మాధరాభుండగు గజుఁడు మహాబల
శాలియౌగవయుఁడు సమరనిపుణుఁ
డైన గవాక్షుఁడు సేన కంతటికిని
ముందు మహోక్షముల్ పోల్కి నడవ
వలె, ఋషభుఁడుఁ గుడిప్రక్కను, గంధమా
దనవీరుఁ డెడమవైపునను నిలిచి
సేనను గాపాడఁబూనుఁడు హనుమంతు
భుజములపై నెక్కి పోవువాఁడ

నింద్రుఁడైరావతము నెక్కి యేఁగునటుల
సార్వభౌమము నెక్కి లక్ష్మణుఁడు ధనదు
చందమున వాలిపుత్త్రు భుజములపైన
నెక్కి సేనకు నడుమ మే మిముడగలము

ఋక్షపతి జాంబవంతుఁడు శిక్షితుఁడును
వేగదర్శి సుషేణుఁడు పృతన కుక్షి
భాగమును రక్షసేయుచు పయనమగుచు
పోవుదురటంచు రామ భూపుఁడు వచించె

క్ష్మాపుఁడిటువల్క నా మహాసత్త్వుఁడైన
భానుజుఁడుఁ గపివీరులఁ బనుపుఁజేసె
నంత వారు రణోత్సాహవంతులగుచు
బయలుదేఱిరి సాగర ప్రాంతమునకు

తమతమ సైన్యములతో బరవసము సేయు నెలుంగులఁ జెలంగుచు లక్షలు
కోట్ల వానరులు సర్వాభిసారముగా నడవ దొడంగి రయ్యవసరమున

ద్రుమముల నెక్కుచున్ దిగుచు దూయుచు పర్ణములన్ ఫలమ్ములన్
నమలుచుఁ బూవలన్ దులిచి నర్తనమాడుచుఁ గ్రేళ్ళదాఁటుచున్
భ్రమణము సేయుచున్ శిలలఁబట్టుక చేతులఁబాఱఁ జిమ్ముచున్
దుముకుచు దూఁటుచున్ రివుల దూఱుచుఁ గేరుచుఁ జెంగలించుచున్

అంబరమ్మున కెగురుచు నవనిధరపు
శృంగములఁ గూలఁద్రోయుచుఁ జిఱ్ఱుమిగుల
నొకరిపై నొకరింద్రోతు రొక్కరొకరి
మూఁపు లెక్కుచుఁ గుదియింతు రేపురేఁగి 54

ఒకఁడు ఫలమును దినుచుండ నూడలాగి
యొకఁడు తినబోవుచుండ వేఱొకఁడువచ్చి
దానిమ్రింగును నడుమను తమకపడుచు
హేళనంజేసి పండ్లికిలించి గిఱుపు 55

తరువులఁ బ్రాఁకుచున్ మధువుఁ ద్రావుచు, వ్రేలుచుఁ దల్లక్రిందుగా
నురుకులు వెట్టుచున్ ఫలములొయ్యన మ్రింగుచు, గెంటు బొండొరున్
గిరులను దూఁకి శృంగములఁ గీడ్పడఁజేయుచుఁ గేకరించుచున్
గిఱికొని జబ్బలన్ జఱచి కీచకముల్ పెకలించి నవ్వుచున్ 56

కతిపయ మర్కట చేష్టల
కుతుకము గల్గించి రథ్వగుల కెల్లరకున్
మతిమంతుఁడు రాముని కీ
నుతిమెత్తని హాస్యమెంతో చోద్యముఁ గొలిపెన్ 57

దంతనఖములుఁ దమ యాయుధముల వోలె
తనర వానరభల్లూకధ్వజిని పుడమి
సర్వమాక్రమించుచు బిట్టుసాగె వారి
చరణకరఘట్టనలతో రజమ్ము లేచె 58

దారిలో ఝురములు తారసిల్లిన వేళ
క్రిందికి దిగుచు సాగిరి క్రమముగ
నందుచే నదులకు నానకట్టలు కట్టి
నటులాగి పోవగనయ్యె-సేన
దాఁటుట పూర్తియౌ తరుణమ్మునను విప
రీత వేగమ్ముతో రెచ్చుచుండి
కొలఁకులు వచ్చిన బిలబిల నడచిరి
పాదపమ్ములతోడి పర్వతముల
నెక్కి- వెడలిరి సమతల మిరవుకొనిన
నంతటను నాక్రమించి ప్రయాణమందు
మెసవి ఫలముల తృప్తిగా మెండుకొనుచు
చెట్ల క్రిందుగా నడచుచు చెలఁగె పృతన 59

వాయువేగులగు ప్లవంగ వీరులు విక్ర
మస్ఫూర్తి శ్రీరామ మహితు కార్య
సాధనకై నుల్లసముతోడ వెడలిరి
తమ తమ దర్పముల్ ద్రఢిమ, కడిమి
చెప్పుచు యౌవనోచిత క్రీడలన్ సల్పు
కొంచును-వారిలో కొంతమంది
పరుగులఁదీసిరి వడివడిగా కొంద
ఱానంద పరవశులై కిచకిచ

లాడి, తోఁకలు జాడించి యంఘ్రులెత్తి
వేసి కొంచును బిరబిర వెడలిపోవ
దండఁజఱచుచు పెరికి పాదపముల మఱి
కొండలను పిండి చేసిరి కొంతమంది 60

కొండశిఖరము లెక్కుచు కొంతమంది
సింహనాదముల్ చేసిరి చిగురు తీవ
లెన్నొ త్రెంపి ప్రోవులు పేట్టి రీరసమున
నట ప్రయాణించి రనఘుకార్యమ్ముఁదీర్ప 61

దాశరథులతోపాటుగఁ దరణిసూతి
ధ్వజిని మధ్యమునందుండి తరలుచుండ
గాఢ ప్రతిభుఁడు వేగ లక్ష్మణుఁడు రాము
తోడ నిగదించె నతనిఁ బ్రస్తుతి యొనర్చి 62

నీవు మహాత్మ ! సాగరము నెమ్మిఁదరించుచు లంకలో దశ
గ్రీవునిఁజంపి జాయఁగొని కేరుచుఁ బోదు వయోధ్యకున్ పరీ
భావము పోవు, పృథ్విని, నభమ్మన నీ విజయంపు సూచనల్
పావనమూర్తి ! తోఁచును శుభమ్ములఁ గూర్చు నిమిత్తముల్ వెసన్ 63

పిల్లవాయువుల్ చల్లగా వీచుచుండె
పృతనకు సుఖమ్ముఁగూర్చుచు-వికిరములు, మృ
గమ్ములును ధ్వని సేయును-క్రమఫణితి
దిక్కులన్నియు నెంతయో తేటలయ్యె 64

దినమణియు వ్యోమ మందునఁదేజరిల్లు
శుక్రుఁడును ప్రసన్నార్చియై శోభఁగూర్చు
మన విశాఖ నక్షత్రము మహిత ! వెలుఁగు
చక్కఁగ, వసిష్ఠుతోడఁ ద్రిశంకువలరు 65

పొలసుదిండుల తారయౌ మూల ధూమ
కేతువెంతొ పీడించుచుఁ గీడుఁదెచ్చు
కాలమాసన్నమైన నక్షత్ర వితతి
దుష్టగ్రహ పీడితములుగాఁ గ్లిష్టిఁగూర్చు 66

దారి నెచ్చటఁజూచిన నీరు స్వాదు
వగుచు నిర్మలమ్ముగనుండె నడవులంచు
విఱుగగాసి చక్కఁగనుండె వృక్షచయము
పూచి ఘుమఘుమలాడును ముమ్మరముగ 67

తీరి వ్యూహములుగ వరూధినియుఁబోలు
తారకాసుర రణమునఁ దరలుచున్న
దేవసేనను-దీని గుర్తించి నీవు
ఊఱడిలుమన్న మనమున నుత్సహించి 68

వ. వానర భల్లూకపృతన నడచి, నడచి సహ్యా మలయాచలముల గడచి, మహేంద్ర మహీధరమును చేరెను. రాముఁడు మహేంద్ర పర్వత శిఖరము నెక్కి సముద్రమువైపు తిలకించెను. 69

అటనుండి రాఘవుఁడభ్రంకషతరంగ
భంగఘట్టిత ఫేన పంక్తితోడ
తిమితిమింగలనక్రద్విరసనపృథురోమ
కచ్ఛప సహిత సాగరముఁగాంచ
నాభీలమై బధిరీభూత రోదోంత
రమ్ముగా దోచఁగ నెమ్మనమున
కాశ్చర్యమగ్నుఁడై యచలమ్ముపైనుండి
క్రింది కేతెంచి సుగ్రీవుఁ బిలిచి
పరమసఖ! సముద్రము చేరవచ్చినాము
కనఁబడదు చూడు మవ్వలి గట్టు మనకు
ఈ సముద్రము దాఁటుట యెట్లు పృతన
లంకఁజేర్చుట యెటులో యర్థమ్ముకాదు 70

సీతాదర్శనముంబొనర్చి చనుదెంచెన్ వాయుపుత్త్రుండు నేఁ
బ్రీతుండై తిని దాన భీకర మహాబ్ధిన్ జూడనే నెంతయో
భీతింబొందుచునుంటి నామదిని నిర్వేదింప సూర్యాత్మజా!
భ్రాఁతిన్ దీనిఁదరించు మార్గమును జూపన్ వేఁడెదన్ గ్రన్ననన్ 71

సేనను విడియింపు మిటన్
వానరుఁడెవ్వండు బైటపడరాదు సుమీ!
దానవు లెటిగిన మన పొడ
హాని జరుగవచ్చు దాన ననుఁగు మిత్రమా! 72




మనగుట్టుఁ దెలిసికొనుటకు [illegible]
దనుజులిటందిరుగుదురు ప్రతారణబుద్ధిఁ
కనుకలి వారల కొఱకై
కనిపెట్టగవలయు మనము కపిరాజన్యా ! 73

వ. రామజనపతి అటులపల్క సుగ్రీవుఁడు, సౌమిత్రి సైన్యస్కంధావారమును నానావృక్షలతాగుల్మసమన్వితమగు తత్సముద్ర తీరమున విడియించిరి. 74

తేనె రంగుతో వానరసేన యచట
కానిపించెను రెండవ కడలి వోలె
రేఁగు ఘోషణతోడ సరిత్పతినిన
దమును మించెను రణగొణ ధ్వని మిగులుచు 75

వివిధ వాహినీ స్థానమై వెలయు రవిజు
నాజ్ఞ చెలయలికట్టగా నడర ప్లవగ
బలసముద్రము వార్ధితో పాటియాచు
రఘుపతికి నేత్రపర్వమై రహిఁజెలంగె 76

అంతఁజంద్రోదయంబయ్యె నమృతకరుఁడు
ప్రతి తరంగ భంగములోన ప్రతిఫలించు
చుండె సొగసుగ వార్ధిలో నుండె పెక్కు
పర్వతమ్ములు జలజంతుప్రకరము వలె 77

ఎగసిపడు జలజంతువు లేపు మీఱ
వెన్నెలలు ప్రసరింపగఁ బ్రన్నఁదనము
తో నెగయు జలబిందువుల్ తురఁగలించు
నగ్ని కణముల భాతిఁజయ్యాన మెఱయుచు 78

నభమునందున గల్గు నాగులు సాగర
మందుండు నాగము లంబరమున
అర్ణవమ్మున నుందు రసురులు-సంద్రము
గగనము గంభీరముగఁ గనఁబడు
అందుచే నంబుధి యాకాశమటులుండె
వ్యోమ మంబోధిని పోలియుండె
నుదధిలో జలముండె నుప్పరమ్మునఁగల్గు
సలిలమ్ము-రత్నముల్ జలధినుండ
దివములో కూడ రత్నముల్ తవులుచుండు
నభ్రమున మేఘమాలిక లంబునిధి త
రంగమాలిక లుండును-భంగములొక
దానిపై నొకటి పడుచు ధ్వనియొనర్చు 79

రేఁగి రణభూమిలోన భేరీలు మ్రోగు
చందమున ఘోష పెట్టెడు సాగరమును
గాంచి యాశ్చర్యచకితమై కపిసమూహ
మెల్ల కనులప్పగించుచు నుల్లసిలెను 80

ఊర్మిమాలికి నీలుఁడుత్తర తటమున
కట్టుదిట్టమ్ములు కలుగఁజేసి
విడియించె వానర పృతనను మైందుఁడు
ద్వివిదుఁడు చుట్టును దిరిగి తఱచు
నగచరవీరుల నదుపాజ్ఞలందుంచ
రామచంద్ర విభుఁడు లక్ష్మణుఁగని
వచియించె సోదరా ! వనట దినమ్ములు
గడచిన తగ్గును కాదె-నాకు
పడఁతి కన్పింపకుండుట వలన శోక
మినుమడించుచు నున్నది దినదినమ్ము
వనిత దూరాన నుండుట వలన కాదు
నాకు దుఃఖము పెరుగుట నయవిచార ! 81

ముదిత యౌవనమ్ము పదటబుచ్చుచె యగు
రావణుండు సతిని లంకఁజేర్ప
దాని వలన దుఃఖ దావములో నుంటి
నమృతకరుని వెన్నెలార్తిఁబెంచె 82

నాసతి ప్రుచ్చలించు తరుణమ్మున ధూర్తుఁడు నిస్పృహాయయై
గాసిలి ప్రాణనాథ ! ననుఁగావగఁ రమ్మని నన్ దలంచె సం
త్రాసముతోడ నా యెడఁద దాన విషాదవిషమ్ము జీర్ణమై
దోసము కీలు కీలునఁ బ్రతున్నముగా నలయించు పెల్లునన్ 83

అసురుఁడపహరించు నవసరమ్మున సీత
అంగలార్చె నాథ యని స్మరించి
అద్ది నా యెడంద నంకితమై పోయి
యెపుడు జ్ఞప్తితో దహించుననుజ ! 84

సీతావియోగము జీర్ణించు విషమటు
కీలు కీలున నగ్నికీలఁగాల్చు
కాంతావియోగమే కట్టెలుగా నామె
కై నా విచారము కాల్చు మంట

లై మన్మథాగ్నియే రాత్రింబవళ్లను
నను దహించుచు నుండె ననుజ ! సతము
కావున లక్ష్మణా ! కడలిలో మునుఁగుచు
నచటనే శయనింతు నగ్నియపుడు

నన్ను బాధింపఁబోవదు-నాతి నేను
నొక్క-భూమిపై శయనించు చుంటిమి కద !
ఇట్టి హేతువు వలన జీవించు చుంటి
నామె జీవించి యుండెన న్వార్తఁదెలిసి 85

అంబరమున వెల్గు నమృతాంశుఁడామెను
చూచు దానను నేను చూచినటులె
తలఁచి సంతసింతు తమ్ముఁడా ! నా సీత
నెపుడు చూడఁగలనొ యెఱుక పడదు 86

ఎపుడు నేను శత్రువుల జయించి లక్ష్మి
వంటి సీతఁజూతునొ ; దొండపండుఁబోలు
పెదవులంగల్గు సుందరవదనపద్మ
మెత్తి యధరపానముఁ జేయుటెపుడొ సహజ ! 87

తాళఫలసమానములు సీతా స్తనములు
నిఱియకౌఁగిటఁజేర్తునో యెపుడొకాని
నేను జీవించి యుండ నా నెలఁత తాన
నాథ వోలె జీవించుఁ గినాశులకడ 88

తాను జనకరాజతనయయై దశరథు
కోడలై యుండియు కుములుచుండె
దనుజాంగనలమధ్య తరుణీలలామము
యమయాతనలతో నహర్నిశమ్ము
తడగాల్లపడి శరత్కాలమేఘమ్ములఁ
దప్పించుకొను నేణధరుని వోలె
చెలఁగుచు నాశరస్త్రీలుఁ గలఁత పెట్ట
వచ్చు నాపాలికి మచ్చె కంటి

సహజముగ సీత యెంతొ కృశాంగి, దేశ
కాలవైపరీత్యమున శోకమ్ము సంభ
వించి మఱి యెంతొ సన్నమై విక్లబముగ
మాఱి యుండునొ తెలియదు మహిజ రీతి 89

సునిశితబాణప్రయోగ
మ్మున దశముఖు పేరుటురము పోరున భగ్నం
బొనరించి సీత నెన్నడు
గొనివత్తునొ యంత వఱకు క్రోధముడుగునే? 90

దేవకన్యల మించిన తెఱవ సీత
నన్నెపుడు కౌఁగిలించి యానందబాష్ప
ములను దనివారి విడుచునొ పొక్కుమాని
నాకుమోదము కలుగునెన్నడొ తెలియదు! 91

రాముఁడటుల శోకింపగ లక్ష్మణుండు
ధాత్రితనూరార్చె నెంతయో ప్రతిభఁజూపి
తామరసనేత్ర వైదేహిఁ దలచుకొనుచు
తాను సంధ్యనుపాసింపఁ బూనె విభుఁడు 92

X X X X X X

నిండోలగమ్మునను గూ
ర్చుండి దశాస్యుండు విగతరోషుండగుచున్
బెండుపడుచు దనుజసచివ
మండలిఁగని పలికె నిటుల మంద్రాటముతో 93

వానరమాత్రుఁడొక్కరుఁడు వార్ధిఁదరించి యభేద్యమైన లం
కానగరమ్మునఁజొచ్చి ప్రభు కాంతను జూచి యశోక సుందరో
ద్యానముఁబాడుచేసి పలు దానవ వీరుల నుక్కడంచి నా
సూను వధించి నా మనసు క్షోభిలఁజేసెను దోర్బలమ్ముతో 94

లంకాపురిఁ గాల్చెను ని
శ్శంకమ్ముగ నిరాతంక సరణిని నా
శంకరుఁడై నాకెంతయొ
సంకటమున్ గూర్చె రాము సంఘర్షణతో 95

రాముని సేవక మాత్రుం
డాము కొనుచు నద్భుతమ్ములన్ని సలుప నా
రాముని విషయములో మన
కామోదము కలుగు మార్గ మాలోచ్య మగున్ 96

ఇట్టి పరిస్థితిలో చే
పట్ట దగిన మార్గమొండు పలుకుఁడు మీరల్
జెట్టులు కద రణములచే
పట్టదగినమార్గమేదొ వచియింపు డనెన్ 97

ఖిన్నవదనుఁడై యతఁడా
పన్నుండై పలుక వినుచుఁబాలస వీరుల్
మన్నిని పొగడి తదుపరి
యెన్నొ ప్రతాపములఁగొట్టి రిబ్బడి పెలుచన్ 98

ఆలింపమె విజయమునకు
మూలము మంత్రం బటంచు పౌలయ హితులతో
నాలోచన సేయుచుఁ బరి
శీలించిన సకల కార్యసిద్ధి ప్రదమౌ 99

ఆలోచించుచు దైవము
పై లలిభారమ్ము నుంచి పరఁగు పురుషునిన్
లీల నుత్తముఁడని యను
కూలమ్ముగ నుడువుచుంద్రు గొప్ప సేయుచున్ 100

తానొకఁడె తన ప్రయోజన
మానీతిగ ప్రకృతి ధర్మమాకళించుచున్
తానొక్కడె కార్యములను
పూని సేయువాఁడు మధ్యముండనబరఁగున్ 101

మంచియు చెడ్డఁదలంపక
నంచితముగ ధర్మపథమునట్టె విడిచి తా
నెంచిన దానిఁ బొనర్చెద
నంచు పూని వదలువాఁడె యధముఁ డనబడున్ 102

నీతిశాస్త్రము మీరెల్ల నియతినెఱిఁగి
యైకమత్యముతో నిర్వహణ మొనర్ప
మంత్ర ముత్తమమగు గాన మంత్రులార !
అర్థ నిర్ణయముంజేయ నవసరమిది 103

అందఱు బుద్ధిమంతులెకదా ! సచివోత్తములార ! మన్ననన్
పొందెడి నిర్ణయమ్మొకటి పొల్పెసలారగఁజేయుడయ్య నా
కొందలపాటు దీర్పవలె క్రోఁతులదండును దోడుకొంచుఁదా
బందెముఁబూని రాముఁడు నపాంపతి దావుననుండె భ్రాతతో 104

మెండుకొనుచును సాగర మెండఁగట్టి
యో మతొకరీతినొ జలధి నుత్తరించి
యో సహజుఁగూడి కసితోడ యుద్ధమునకు
వచ్చుచున్నాఁడటంచును వార్తలందె 105

లంకకే యపాయమ్మును రానిరీతి
దైత్యజాతి వినాశము తప్పునటుల
మంచి యాలోచనముఁజేసి మంత్రులార !
రండు మీరిప్పుడొక యభిప్రాయమునకు 106

సభను గలిగిన రాక్షస సచివులంత
సహజముగ మందబుద్ధులె శత్రుబలము
లంతగా నేమితెలియని భ్రాంతిపరులె
మొదలుపెట్టిరి రావణు పొటుపొగడ 107

మన సేనలన్ని సమర్థముల్ రాజేంద్ర !
వివిధాయుధములతో విరివిఁగలిగి
భస్మాంగరాగుని పరమ మిత్రుఁడు యక్ష
రాజు నిర్జించితి వాజియందు
విశ్వకర్మ మయుండు వెఱచి స్నేహమ్మున
తన పుత్రి నీకిచ్చె దానవేంద్ర !
భగిని కుంభీనసి భర్తయైన మధుండు
దాసోహమని నీకు వాసిఁబెంచె

భోగవతి పట్టణమ్మున నాగులను జ
యించినాఁడవు సుతుఁడు దేవేంద్రుఁబట్టి
తెచ్చి నీముందు నిలబెట్టె దేవసేన
ఒక మహాసముద్రమైన వికలమయ్యె 108

నందనుండగు మేఘనాదుండును మహేశ్వ
రంబను యాగము రహి నొనర్చి
లబ్ధవరుండయి లానొప్ప దేవసే
నార్ణవమ్ము మధించె నమితశక్తి
అనితరసాధ్య మాయాజాలమున రిపు
ధ్వజిని గెల్చెడి యసాధారణుండు
వరుణుని చతురంగ బలముల నోడింప
లొంగిపోయెను నీకు భంగపడుచు
యముని సైన్యాబ్ధిలోఁజొచ్చి తుములయుద్ధ
మాచరించి మృత్యువుగెల్చి తబ్బురముగ
కాలకేయులు బహు పరాక్రములు ధాత
వరములనుబొంద వారి గెల్వరి వగుదువు 109

మేఘనాదుఁడొక్కఁడె చాలు-మేటరి కద
వానరుల నాశనముసేయు వలఁతి యతఁడు
జంభవైరి సమానులు క్షత్రియనృప
లందఱిని గెల్చితివి రాముఁడెంత బలుఁడు ? 110

మును హనుమంతుఁడొనర్చిన
పని నెంచుచుఁ బ్రాకృతుబలె భయపడనేలా ?
దనుజాధిప ! వధియింతువు
రణమున నా రామచంద్రు-రావడ ఘనమే ? 111

మానవు లిద్దఱు కొందఱు
వానరులంగూడి వచ్చి పలలాశులపై
దీనులు రణమొనరింపగఁ
బూనుటఁగడు చోద్యమగు సముద్ధతి కాదే 112

అసురసేనాని ప్రహస్తుఁడుపల్కె మ
హాప్రభు ! నిర్జర యక్ష నాగ
దానవ గంధర్వ దైత్య పిశాచ చా
రణ సిద్ధ సాధ్య వారమ్ము నిన్ను
మార్కొని నిలిచెనే ? మనల నెవ్వరును నె
దురుచలేరనితలంపఁదురఁ గవించె
నా నిశీధమునందు హనుమంతు చేతిలో
మోసపోయితి మంతె-పుత్త్రుఁడక్షుఁ
డీల్గె దానను నేను జీవించి యుండ
బ్రదికి యుండునె హనుమ నా యెదుట నిలిచి
దండిమగఁడ సమస్త భూమండలమున
క్రోఁతి పురుగైన కూఁడ లేకుండఁజేతు 113

లంక రక్షణమునకు నేర్పాటొనర్తు
రాజ ! నీ వొనర్చిన యపరాధమునకు
చింతపడరాదు నీవు కించిత్తు కూడ
నాకు సెలవిమ్ము వధియింతు నరులిరువుర 114

ముల్లోకముల నల్లకల్లోల మొనరించి
అష్టదిక్పతుల దిగంతములకుఁ
బోవఁజేసితివి యబ్బురముగ కైలాస
నగము కదల్చితి-నరులు ప్లవగు
లన నీకు లెక్కయే ఆత్మజుండౌ మేఘ
నాదుడొకండె నిన్నాదుకొనును
శంబర వృత్త రాక్షసుల నోర్చిన స్వర్గ
పతిని నీముందు నిల్పంగలేదె ?

ఇంద్రజిత్తుండగా భయమేల నీకు
నేను నిర్వానర మొనర్తు నిజము నమ్ము
మసుర నాయక ! నా బలమగ్గలమ్ము
నిర్వహించెద సర్వము నేనొకఁడనె ! 115

పర్వతాభుండగు వజ్రహనుమ నిశా
చరుఁడు వెంటనె నాల్కఁజాపి కరము
చప్పరించుకొనుచుఁ జప్పుడు సేయుచు
నిగదించె మీరింక నిబ్బరముగ

నిలువుఁడు నేనేఁగి నిశ్చయమ్ముగ వారి
　　　నందఱిఁదినివైచి యరుగుదెంతు
నర్కజు, లక్ష్మణు నంగదు హనుమంతుఁ
　　　దెగటార్చి వచ్చెదఁ దెగువరియగు
రాము నేలకుఁ బడగొట్టి రాచివైచి
సంహరించెద దానవేశ్వర ! నవయకు
మంచుఁబరవళ్లుత్రొక్కి నమ్మించ నెంతొ
యత్నమొనరించె సభలో నహంకృతిమెయి 116

అందుపై దుర్ముఖుఁడను నిశిచరుఁడు క్రో
　　　ధోన్మత్తుఁడై పల్కె నొరపు మిగుల
మనకింత యవమాన మొనరించినట్టి యా
　　　హనుమంతుని క్షమింప నవధికాదు
వానర మాత్రుఁడు వచ్చి కావించిన
　　　పని మన ప్రభువుకు పట్నమునకు
నంతఃపురమ్మున కవమానమే క్రోఁతి
　　　మూఁకలభూమిన సముద్రమందు
లేద పాతాళమున దాఁగ రేఁగి నేను
వాని నాశముఁజేసెద దానవేంద్ర !
యనుచు గప్పాలు కొట్టె నా యసురుఁడపుడు
నిర్జరారాతిఁ బరికించి నెనరుఁజూపి 117

అంత మహాబలుఁడగు వజ్రదంష్ట్రుఁడు
మండిపడి వచించె మాంసరుధిర
కలిత పరిఘను చక్రము వోలె గిరగిరఁ
ద్రిప్పి సౌమిత్రి సుగ్రీవ సహిత
రాముఁడచ్చట నుండ ప్లవగుఁడు హనుమంతు
తోడను చనియేమి-తోన నేను
వెడలి వానరసేనఁ బిలుకు మార్చెదను నా
పరిఘతో వానరవతి యినజుని
లక్ష్మణుని రాముఁగూడ దురాసదుఁడుగ
సంహరింతు నేనొకఁడనె శపథమిదియె
నమ్మెదనుజేశ్వరా ! సెలవిమ్ము నాకు
నా ప్రతాపముఁ జూపింతు నసుకులేదు 118

కుంభకర్ణుని కొడుకు నికుంభుఁడనియె
రామలక్ష్మణ సుగ్రీవులను బృతనను
నేనొకఁడపోయి వధియింతు నిబ్బరముగ
మీరు సుఖులుగ నుండుఁడీ మిన్నక యిట 119

పెక్కు రాక్షస వీరులు వెడఁగు పడుచు
తమ ప్రతాపముఁ దెలుపుచు దానవపతి
మన్ననలఁబొంద యత్నించి రెన్నొ గతుల
నవ్వి వినుచు విభీషణుఁడన్న కనియె 120

సామదానభేదమ్ముల సాధ్యపడని
పనులు దండప్రయోగము వలన నెపుడు
కార్యసాధనఁ గావింప కలుగు సుఖమ
టంచు పెద్దలు పలికెద రగ్రజాత ! 121

మన రాజు రాముదేవిని
గొనివచ్చెను వంచనమెయి కుపితుఁడగుచు నా
తని యెడల వైరభావము
చనునే ? మీకందఱకు నిశాచర వీరుల్ 122

రాము మోహించి శూర్పణఖ సీతాదేవి
మ్రింగఁ బోవగ నల్గిమేటరి యగు
లక్ష్మణుఁడామె కర్ణమ్ములు నాసిక
ఛేదింప రాముండు చేసె నాజ్ఞ
నంతియేకాని వా రలుగరు మొదటనే
మడిసెను ఖరుఁడేఁగి నుడువ భగిని
దానికై ప్రభువు సీతాదేవి హరియించె
అంతయు మన దోషమగును సుండు
రాముఁడే తెంచి యబ్ధితీరమున విడిసె
ప్లవగ భల్లుక సేనతో వచ్చు నేఁడొ
రేపొ లంకకుఁ గడలిఁదరించి తాను
గొప్పలకుఁబోవకుఁడు లేని తప్పునకును 123

అగచరుఁడు వచ్చి లంకా
నగరమ్మును గాల్చువేళ, నక్తంచరులన్
దెగఁగోయునపుడు. వనమును
దెగవేయగ నూరుకొనిరి తెలనోరులతో 124

తప్పు మనపైన నుండగ
తెప్పున జని శత్రువులను ద్రెంచెద మనగా
ముప్పుఘటిల్లును సుమి మీ
పప్పులుడకఁబోవు వైరిబలము ముందటన్ 125

అని వారించుచు వీరుల
పనివడుచు విభీషణుండు భ్రాతన్ గనుచున్
వినయమున నంజలించుచు
మనవి చేసె తెలుప ధర్మమార్గమతనికిన్ 126

మత్తుఁడై యున్న, వైరిచే నొత్తబడిన,
దుర్బలుండైనఁజెల్లు సూ! తుదియుపాయ
మైన దండము-రాముఁడహీనబలుఁడు
పైగ విజిగీషువుగ వచ్చెఁబడఁతి కొఱకు 127

ధర్మమచ్చట నుండ వృథాశ్రమ యగు
విక్రమించుట వ్యర్థము భేదనమ్మ
సాధ్యమగునని పల్కి యంజలి ఘటించి
పలికెను విభీషణుండు రావణునిఁగాంచి 128

దానవసార్వభౌమ ! అవధారు ! మమున్ సచివాళి, సైన్యమున్
మావితమైన లంకను. విమానముఁగావగ నుత్సహించినన్
జానకి రామచంద్రునకుఁ జయ్యన నీవిపుడప్పగించినన్
మానము దక్కు, గౌరవము, మన్నన వచ్చు జగమ్ములన్నిటన్ 129

పరసతిఁ జెరవట్టినచో
పరపతిపోవును యశమ్ము పాడఱు సీతా
తరుణి వలన నాపదయున్
బరాభూతి వచ్చు మఱియు పాపము పెఱుగున్ 130

ఒక్క వానరుఁడే తెంచి యుత్కటుఁడయి
లంకనంత విదారించి రగడఁజేసె
ఉక్కడంచెను రాఘవుఁడొంటిచేతి
మీఁదుగా ఖరుఁబృతన సోమించి మించె 131

అతని నయనిష్ఠురోక్తులు నసురనాథు
కింపు గూర్పమి వెస నేవగింపు తోడ
దిగ్గనన్ సభవీడి యంతిపురిఁజేరె
నందఱరిగిరి నెలవుల కంతమగుడి 132

ప్రాతః కాలమునన్ విభీషణుఁడు ధర్మజ్ఞుండు, సంస్కారిగా
ప్రీతున్ జేయ హితోపదేశమును గావింపంగ నుత్సాహియై
భ్రాతన్ జూడగ బోయె కోటకును దుర్వాదమ్ముఁ దప్పింపగన్
శ్రోతవ్యమగు భాషణమ్ములను శ్రేష్ఠుం జేయ యత్నించుచున్ 133

పర్వతశిఖరము వలె నుండి రమ్యమై
　　యున్నత స్థానమందొప్పును దశ
కంఠు ప్రాసాద మాకాశమ్మునంటుచు
　　బహువృక్ష లతలతోఁ బరిఢవిలుచు
అప్పటికపుడె మహామాత్యులును బౌర
　　ప్రముఖులక్కడఁజేరి ప్రస్తరింప
అచ్చటి పవనము హస్తుల దీర్ఘ ని
　　శ్వాస మిశితముగ సవదరించు

యువతులెందఱో యుండిరి-యూర్జితముగ
తూర్యనాదముల్ చెలరేఁగు-తోఁచె స్వర్గ
పట్టణముతేవ సూర్యుఁడంబర పథమును
జేరునటు విభీషణుఁడు చొచ్చెను నగరున　　134

వేద వేత్తలు రావణు విజయమునకు
పలుకుచుండిరి పుణ్యాహవాచనములు
ప్రముఖులొనరించు గౌరవ వందనమ్ము
లందుకొనుచు రావణుఁజేరి ప్రాంజలియయి　　135

జయము : జయము ! దశగ్రీవ సార్వభౌమ !
పేర్మిమై జయోక్తులాడి విభీషణుండు
చెన్ను పఱుచు నాసన మధిష్ఠించి, దేశ
కాల పాత్రల నెఱిఁగి పల్కఁగఁ దొడఁగెను　　136

రాక్షస రాజేంద్ర ! లంకకు సీత వ
చ్చిన దాదిగా తోఁచు చెడు నిమిత్త
ములనేకములు హోమములు చేయు చుండిన
ప్రజ్వరిల్లుట లేదు వహ్ని సరిగ
ధూమ కలుషముగఁదోఁచు నగ్ని శరణ
ములలో సరీసృపములు తిరుగును
చీమలు ప్రాకు విచిత్రమ్ముగా హవి
స్సులఁ బాలుతగ్గె నావుల పొదుగుల
ఏనుగులఁజూడగా మదహీనములగు
దీనముగ సకిలించును తేజులిపుడు
గడ్డి గాదము మేయవు గార్ధభమ్ము
లేడ్చుచున్నవి స్వాస్థ్యము హీనమగుడు 137

గగనమున బిండుకట్టుచు గ్రద్దలెగురు
నుభయ సంధ్యలలో నక్కలూళపెట్టు
నఱచు పెల్లుగ శునకము లహరహమ్ము
పట్టణద్వారములఁ జేరి భయదముగను 138

అందులకుఁ దగినట్లుగ నన్న ! జరిగె
కాదె మునుపు లంకా దహనాదికములు
దీనికిపుడు ప్రాయశ్చిత్తమేను తలతు
సీత రాముని కర్పింప క్షేమమగుసు 139

నచ్చునో, లేదొ చూడుమీ-నయము కలుగు
తెలివి తక్కువ వలనొ భీతి వలనొ యిటు
పలుకుచుంటి నటంచు భావమున నెంచ
వలదు-దుర్నిమిత్తమ్ములు తెలియు ప్రజకు 140

సచివు లెఱుఁగుదురిది యంత సాహసించి
నీకు జడిసి చెప్పుట లేదు ప్రాకటముగ
తెలిసినేఁజెప్పకుండుట తీరుకాదు
చూచినది విన్నదియుఁ జెప్పఁజూచు చుంటి 141

నీవు సరిగ నాలోచింప నెరతనమ్ము
ధర్మమార్గమునం బోవఁదగును నీకు
అన విభీషణు హితమున కసురనేత
యెంతొ కోపించి నిగదించె నీ విధముగ 142

అనుజ ! నాకేరి వల్ల భయమ్ము లేదు
నా యధీనములో నున్న నాతి సీత
రాముఁడెన్నడు పొందలేడాముకొనిన
నమర గణములుఁగూడ సాయమ్మొనర్ప 143

రాముఁడెవ్వండు సుత్రాముఁడా ! వరుణుఁడా
శమనుఁడా ! వేద వైశ్రణుఁడగునొ
వారందఱును కూడ వచ్చిన యెడల రా
ఘవులు నా యెదుట సంగ్రామమందు

నిలువఁజాలరు కాన నెలఁత నే నర్పింప
నీకొాన నని చెప్పి యింక నీవు
వెడలిపోవగ వచ్చు వెడఁగు మాటలు మాని
విడువనే వై దేహి నుడువఁబోకు
మిద్దినాస్వ విషయము మై యిరవుకొానును
చిన్నవాఁడవు నాకేమి చెప్పవల ద
టంచు నాగ్రహోదగ్రుడై యనుజునెంతొ
మందలించెను మనసును మార్చుకొానక 144

సీతను గుఱించి విరహముచే దపించి
ఇష్ట బంధువు లెల్లఱు సేవగింప
ప్రథితులేతెంచి రాముని బలముఁదెలుప
ప్రధనమిఁక తప్పదనుచు రావణుఁడు తలఁచె 145

చింతాకులుండయి చెచ్చెర సభఁజేసి
సచివులతోడను సంప్రదింపఁ
దలఁచి రావణుఁడరదము నెక్కి పయనమై
వెడలెను-వీరులు పెక్కుమంది
సకలాయుధములతో వికృత వేషములతో
వివిధ భూషలఁదాల్చి వెంట నడవ
అతిరథులై నట్టి యసురవీరులు కొంద
ఱరదమ్ములందున కరుల పైని

వారువమ్ములపై నెక్కి వచ్చుచుండ
శంఖభేరీనినాదముల్ చక్రనేమి
నిస్వనమ్ముల దిక్కులు నిబిడమయ్యె
రథముచొచ్చెను రాజమార్గమ్మునందు 146

ధవళ వింజామరలను హస్తముల దాల్చి
ఉభయ పార్శ్వములును వెలుగొందుచుండ
పరిజనులు వెల్ల గొడుగును పట్టి నిలువ
నద్ది పూర్ణచంద్ర సమానమై యలరెనెంతొ 147

స్యందనము రాజమార్గమునందుఁ జొరగ
నచట నుండిన రాక్షసులంత తలలు
వంచి రావణ విభునకు వందనములు
చేసి జయవెట్ట కొలువుకుఁజేరె నృపుఁడు 148

విశ్వకర్మమయుండు విన్నాణి తత్సభా
భవనమ్ము నిర్మించె ప్రముఖముగను
రజతజాంబూనదరమణీయ స్తంభముల్
సంతరింపబడెను-స్ఫటిక శిలలు
క్రింద తాపడముగా కీలింపఁబడెనందు
ఆరునూర్ల పిశాచవీరులుండి
రచట రక్షణముం జేయ నహరహమ్ము
అచట వైడూర్య రత్నసింహాసనమ్ము
కలదు-మృదువైన తలగడల్ కలవు దాని
పైని కూర్చుండె దనుజాధిపతి బిగువుగ 149

రావణుఁడు పిల్చి నిగదించె లఘు పరాక్ర
ములగు దూతలఁబరికించి "పోయి మీరు
దనుజ వీరులఁగొనిరండు మనకు నేఁడు
గొప్పపని యొండు వచ్చెను గుండుకొనుచు 150

వెంటనే వచ్చి రాక్షస వీరులంత
దనుజనాథుని దరిసి పాదమ్ములంటి
మ్రొక్కి నిలువ యథోచితముగ నృపుండు
వారలను గౌరవించె నబ్బురము చూపి 151

వారలుచితాసమ్ములపై వసించి
రాపయి విభీషణుఁడు వచ్చి యర్హపీఠ
మందు దనుజేంద్రునాజ్ఞపై నధివసించె
నందఱపుడు కార్యోన్ముఖులై నిలచిరి 152

వివిధ భూషలు ధరియించి విలువయైన
వసనముల దాల్చి గంధముల్ వపువులకును
బూసికొని పూలమాలలు పొందుకొనగ
సురభిళమ్ములఁ జిమ్ముచు శూరవరులు 153

సభకు వచ్చిన వారిలో చతురమతులు
కార్యనిర్వాహకులును ప్రఖ్యాతులైన
పండితులు, జ్ఞాన విదులును, దండిమగలు
పెక్కురుండిరి దశముఖు నెక్కుడింప 154

అంతరావణుఁడు సైన్యాధిపుడగు ప్రహ
స్తునిఁబిల్చి నిగదించె శూరవర్య !
సర్వసమర్థులౌ చతురంగబలయోధు
లెందఱో నీకడ నుందురుకద
అందులోన సమర్థులైన వారిని గూర్చి
రక్షణ కొఱకు నేర్పాటొనర్పు
మనగ నాతండును వినతుఁడై దుర్గమ్ము
నకును శుద్ధాంతమునకును పురిని
కలుగు ముఖ్య స్థలమ్ముల కాపుపెట్టి
నేను నీ యాజ్ఞ మన్నించినాను ప్రభువ !
ఇంక నీవేమి చేయగ నెంచినావొ
దాని జరిగింపుమని వేఁడెద దనుజపతిని 155

దాని కానందించి దానవేశ్వరుఁడనె
రాక్షసప్రముఖులారా ! సకలము
మీరెఱుంగుదురు మీ మీఁదనే బాధ్యత
సర్వము నిలిపితి సాహసించి
లోగడ మీదుయాలోచన లెప్పుడు
ఫలవంతమయ్యెను-భగ్న మెపుడు
కాలేదు-విజయము కలిగెనెప్పుడు నాకు
వాసవుఁడెపుడు దేవతలు సూర్య

చంద్ర గ్రహముల వలన నక్షత్రముల స
హాయమున విజయము పొందునటుల నేను
మీ వలన విజయము పొందుతేవ కలదు
ఇంత వరకు జరిగినది యెల్లఁదెలియు 156

కుంభకర్ణుఁడెఱుంగఁడు కూర్కు నుండి
ఆరు మాసముల్ నిద్రలో నమరుకతన
అతని కెఱిఁగింతు నీ కథనంత నేను
నేఁడె వచ్చుట వలనఁదానిద్రవీడి 157

అనుజ ! కుంభకర్ణ ! జనకుని పుత్రిక
రాము పట్టమహిషి రమణి సీత
దండకవని నుండి మొండిగా లంకకుఁ
దెచ్చినాడ నేను దీమసమున 158

ముజ్జగమ్ములందు ముదిత సీతసు బోలు
సుందరాంగి లేదు చూడ నెచట
కాని–దానిఁగలియు కాంక్ష నుండిన నన్ను
నేవగించు చుండెనేమొ కాని 159

సీత తనుమధ్య పృథుశ్రోణి స్థిరకుమారి
చంద్రవదన బంగరుబొమ్మ చంచలాక్షి
మయుఁడు నిర్మించు మాయగా మదికిఁదోఁచు
ఆమె చరణముల్ స్నిగ్ధము లంబుజములు 160

చరణ నఖములు సెజ్జనై చక్కనగును
వనిత పాదముల్ కాంచిన ప్రసవచాణు
తాప మగ్గలమైపోవు తపను తేజ
మగ్నికీలలుతోఁచు దేహమ్ము నిండ 161

ఆమె మొగమున్నతమ్ముగ నలరు నేత్ర
ములు విశాలమై రమణీయముగఁ జెలంగు
ఆననముఁజూచినను కూడ నంగజార్తి
ననుభవించుచు నుందునే ననుజ ! సతము 162

క్రోధమున గాని లేదేని కుతుకమందు
మదన తాపము నాకు తప్పదు-స్మరుండు
శోకమున గాని సంతోష చూషకమున
విడిచిపెట్టుట లేదు నిర్విణ్ణుఁజేయు 163

ఆమె తన పతి రాముండు నరుగుదెంచు
నన్న పేరాస నొక వర్షమడిగె గడువు
నేను నంగీకరించితి దాని కనుజ !
శ్రాంతుఁడై తినలసిన వార్వమ్ము పగిది 164

భీకర జలజంతువితతితో నుండు సా
గరము వానరులెటుఁగడవ గలరు ?
రాజకుమారులు రామలక్ష్మణులకు
నర్ణవమ్మును దాఁటనలవి యగునె ?

ఒక వానరుఁడు వచ్చి యుద్ధమ్ముఁ గావించి
వీరుల వధియించి వెడలె కాదె !
కార్యగతులెఱుంగ కష్టము-నీ బుద్ధి
కేమని తోఁచు-నాకేమి భయము
నరుని వలనను లేదైన తఱచి చూడు
వెనుక దేవదానవులకు రణము జరుగు
నపుడు నీ వల్ల నాకు జయమ్ము కలిగె
అప్పటికి నిప్పటికి నీవయటులె కలవు 165

సీత యుండిన తావుఁజెలువుఁ దెఱుంగుచు
భానుజుతో గొప్ప ప్లవగ సేన
తో నరుదెంచుచు తోయధి కుత్తర
తీరమందున నుండె-దేవి సీత
నేనెప్పుడీయను నా నిర్ణయంబదె
రామలక్ష్మణులను బ్రధనమందుఁ
బరిమార్చవలె నద్ది నెరవేర్చుటకు నపా
యము లేని యొక యుపాయమ్ముఁ దెలుపు
వానరులఁ దోడుకొనుచు నెవ్వండు కడలి
దాఁటి రాలేఁడు-విజయము తప్పదు సుమి
యనుచు వచియించు రావణు నరసి యెంతొ
రోషముగఁబల్కె కుంభకర్ణుండిటులను 166

మొదట మాతోడఁ దెలిపియా ముదిత సీతఁ
దెచ్చి యుండవలసినది-తెచ్చినావు
కనుక గతజలసేతుబంధనమె యయ్యె
మొదపె యోజింప పరితాప మొదవునె యిటు 167

ముందుగ నాలోచించుచు
క్రందుకొనుచు పనులు సేయు రాజు నీ వలెన్
కొందలపడి పరితాపము
నందఁడుసూ ! రాక్షసేశ ! యాక్రోశముతో 168

వాసిగ నాలోచింపక
ఓగు సేయఁదలప నెంత యోజిస్వియుఁదా
సాఁగియాతుఁదప్పక పని
సాగదు-పరిభూతి వచ్చు శత్రుల వలనన్ 169

ఏమియు నాలోచింపక
భూమిజఁగొని తెచ్చినావు-పోనఁగదు రాముం
డాము కొని నిన్ను నిహతుని
సేముండగఁ జేయనేఁడు మిన్నక యెపుడున్ 170

మునుపు చేయంగవలసిన పనులు వెనుక
వెనుకఁ గావింపవలసిన పనులు ముందు
ఎవఁడు సేయునో యట్టిఁడు కేమి నీతి
తెలియదను మాట తథ్యము దితిజ విభుఁడ : 171

చపలుఁడై తలపోయక సలుపు పనుల
నెట్టి బలవంతుఁడైనను నట్టివాఁడు
సొరపడిన కాచియుండుచు నరులు వాని
పరిభవింతురు దానవపతి! తెలియవె? 172

మంచి పనులైన గాని సమంచితముగ
నేర్పుమెయి నిర్వహించిన నెరతనమ్ము
కాని యెడ నపాత్రునకును బోనమొసఁగు
పగిదిగ నిరర్థకముగ రూపఱును పనులు 173

ఐనను ముందుకేఁగుటకు నారట మొందగ లాభమున్నె? నే
మానవులిద్దఱిన్ నిమిషమాత్ర వధింతును నమ్ము మగ్రజా!
వానరసేన నే నమలివైచెదనింక భయమ్ము లేదు నీ
మానముఁ గాచెదన్ రిపుల మారణహోమముఁజేసి వైచెదన్ 174

ఎంతో యెత్తైన క్రౌంచమహీధరమ్ము
రుటము పక్షుల మార్గ నిరోధకమ్ము
దానికి షడాననుండు రంధ్రమ్ము సేయ
ద్విజములా రంధ్రమున పోవు తేలికగను 175

హరిహయుఁడు, వాయుదేవుఁడు, యక్షరాట్టు
వరుణుఁడును దిగ్మకరుఁడు వైశ్వానరుఁడు
వచ్చినను నేను వారిని వ్రచ్చువాఁడ
ప్రధనమందున దానవాగ్రణి! తెలియుము 176

ఏమి తలపక నీ విటు లీయసాధ్య
కార్యమొనరించినాఁడ వగ్రజ ! నయమ్ము
విషము కలియు నోగిరమటు విభుఁడ ! మాకు
తెలియకే రాముఁడు నిను వధింపలేఁడు 177

పర్వతాభుఁడనయి వాఁడి దంష్ట్రల తోడ
పరిఘను బూనుచు ప్రధనమందు
కనిపింప నింద్రుఁడు కాలికి బుద్ధి చె
ప్పును నన్నుఁజూడగ పోరుమాని
రాముఁడు మొదటి శరమ్ముఁ బ్రయోగించి
రెండవ తూపు సారించు సరికి
త్రావెదనతని రక్తమ్మను-రామునిఁ
జంపి చేకూర్చెద జయము నీకు
నరుల నిద్దఱి కూల్చి వానరుల మ్రింగి
గెలుపు నిచ్చెద నీకు-సుగ్రీవు, జాంబ
వంతులను గూడఁ బరిమార్చి వారి తలల
బంతులాడింతునవలీల భయము లేదు 178

కనుక నీవు యథేచ్ఛగ కాలమును గ
మింప వచ్చును-రామునిఁజంపి వైవ
నీకు వశమయిపోవును నెలఁత సీత
ఇచ్ఛ వచ్చిన పనిచేయ వచ్చునపుడు 179

తరుణితోడ క్రీడాపరతంత్రుఁడవయి
స్వేచ్ఛగా మద్యపానము చేయుమింక
నిర్భయమ్ముగ మెలఁగుము నిరతమీవు
భార్యమంతనేఁ బూనెద భ్రాత ! వినుము ꠰꠰ 180

వ꠰ కుంభకర్ణుని నీతిబోధ విని క్రూరకర్ముండగు దశగ్రీవుఁడు క్రోధ పరవశుఁడగుట గుర్తించి చెంతనుగల మహా బలశాలియగు మహాపార్శ్వుండు చేతులు జోడించి వినీతుఁడై యిట్లు నిగదించెను. 181

అవధారు ! నక్తంచరాధీశ ! క్రూర మృ
గములతో విషధర కలితమైన
కానన సీమలోఁ గొల్వెట్టి చేతికం
దిన తేనెత్రావని జనుఁడు మూఢుఁ
డేయగు - మాకు నీవే యీశ్వరుఁడవు నీ
కిఁక నీశ్వరుడెవండు ? కినుకయేల ?
శత్రుల నెల్ల నాశముఁజేసి సీతతో
స్వేచ్ఛగాఁ గ్రీడింపవచ్చు నీవు
కోడివలె బల్మిఁగూడుము కుంభినిసుత
వాసవుఁడు వజ్రపాణియై వచ్చిన సరె
ఇంద్రజియు, కుంభకర్ణుండు నేను వాని
నిగ్రహింతుము తప్పక నేర్పుతోడ 182



సామదానభేదములను సంగతులను
చేతకాని వారలు చెప్పు నీతులె సుమి
నీవు సర్వసమర్థుడౌ నేతవగుట
దండనీతితో సాధింపఁ దగును నీవు 183

తెగువతో సర్వవాంఛలఁ దీర్చుకొనుము
అచట నీవుండ-మేమంత నిచటనుండి
కాచుకొనెదము శస్త్రాస్త్రకౌశలమున
ననుచు సవినయముగను వాకొనె నతండు 184

అలరుచు వాని పల్కులకు వంత వచించెను రావణుండొగిన్
కలదు రహస్యమొండు - విను కంజజు పాలికిఁబోవు పుంజిక
స్థలియను నప్సరన్ దగవుఁదప్పి రమించితి నొల్లనన్న న
న్నలువ శపించె నన్యలలనన్ వెస పొంద శిరమ్ము బ్రద్దలౌ 185

సీతను బొందిన బల్మిని
నాతలలునుఁ బ్రద్దలౌను నలువ శాపమున్
చేతస్సున నుంచుకొనుచు
భీతిల్లుచు నుంటి సీత ప్రేమకు కఱవై 186

నా గమనమ్ము వాయుగతి - నమ్ముము సాగరమట్టి యా
వేగము నాది - రామునకు వేద్యముకాదిది - అందుచేతనే
బోఁగదె మంచిచెడ్డలను నారయకే చనుదెంచు మార్కొనం
గా - గుహలోని సింగమును కాడ్పడి లేపుట కుద్యమించెడిన్ 187

క్రుద్ధమగు మృత్యువును మేలుకొల్పునట్లు
నా పయికి వచ్చుచుండె మానవుఁడు కడున
లిష్టదాయి నా శక్తి గుర్తించలేక
అనుజుతో కీశసేనతో నరుగుదెంచు 188

కొఱకంచులతో నేనుఁగు
కరణిని మద్బాణశక్తిఁ గాల్చెద రామున్
దురుసుగ వారధి నెటులో
తరియించు ప్రయత్నమందుఁ దవిలి మూర్ఖుఁడై 189

రాముని వానరధ్వజిని లావున మచ్ఛరవహ్నిఁగాల్చినన్
కోమలి సీత లభ్యమగు కోర్కెలుపండును రాము చావుతో
దీమసమైన వాంఛితము తీఱును తప్పక బ్రహ్మశాపమన్
బాముఁదొలంగు నామనికి భవ్యమగున్ కడు ప్రాపణీయమై 190

పురుహూతుఁడు. వరుణుఁడు నా
పరాక్రమము ముందునిలుప భయపడుదురు సో
దరుఁడు కుబేరుఁడు లంకమ
పరాభవము పొంది విడిచి పరువెత్తెకదా 191

అనగ విభీషణుండు మరియాదగ పల్కెను భ్రాత ! రజ్జులున్
ఘనమహె-వీరిపల్కులును గణ్యము లెట్లగు నీటిమూటలే
మనవి యొనస్తు రాఘవుఁడు మానవమాత్రుఁడు కాఁదు వజ్రి మిం
చిన ఘనసత్త్వుఁడాతఁడు-త్రిశీర్షు, ఖరున్ బొలియించె నేనతో 192

ఆ రాము బాణవేగము
వీరత్వము ముందు నిలుచు వీరులు మనలో
వేరొక్కరు-కావున సీ
తారమణిన్ రాముకొసఁగి ధన్యుఁడవగుమీ ! 193

రాముఁడు గొప్ప యోధుఁడు-విరాధు వధించెను తాటకాసురిన్
భీమశరాగ్నితోఁ జిదిమె వీరుఁడు వాలినిఁజంపె వానర
స్తోమము గూడివచ్చునదె సోమముఁ జూపఁగ లంకపైకి నీ
తామసమెల్ల వీడి ముదితన్ రఘురాముని కీయ వేఁడెదన్ 194

నీవు, నిశాచరుల్ పురము నిల్వ దలంచిన హాయిగా పరీ
భావము పొందరానిగతి భ్రాత ! త్వదీయ మనోవికారముల్
పోవగఁజేసినన్ ఫలము పొందగ సాధ్యము కాన వేగ స
ద్భావములోడ రాము సతి భర్త కొసంగిన మేలు కల్గెడిన్ 195

సీత యన కాలసర్పము
సీత చింతయే విషమ్ము సీత హాసమే
ఘాతుకమగు మన లంకకు
సీత మానవియును గాదు నేగిందెచ్చున్ 196

కోరలు, నఖములు క్రూరాయుధములుగా
గలిగెడి పర్వతా కారులైన
వానరవీరులు వనధిఁదరించి లం
కకు రాకముందె రాక్షస మహేచ్ఛ !

సీత రాముని కీయ క్షేమము-రాముని
బాణముల్ తీవ్రముల్ వాయువేగ
ములును బిదురసమంబులును నిశాచర
శిరములు ధరణికిఁజేరు ముందె

జానకిని రాము కర్పింప సఖ్యపడును
అసుర వీరులు గర్వోక్తులాడుచుండ్రి
సాంపరాయములోన నిలింపులకును
రామునెదిరించి గెల్వంగరాదు సుమ్మి 197

అందుపై ప్రహస్తుఁడందుకొంచు పల్కె-
రాజు ముందు దాశరథినిఁ బొగడ
న్యాయమెట్టులగును యక్షనాగవిబుధ
జాతులనిన మాకు భీతిలేదు 198

రోషపడుచు వెస విభీషణుఁడిట్లనె
ఓ ప్రహస్త! రాము యుద్ధరీతి
నీకు తెలియకిటుల నెమ్మి వచించెదు
రాము బలము, శక్తి రహి నెఱుఁగక 199

రాముని బాణముల్ ప్రాణాంతకమ్ములు
పిడుగులఁబోలు నీ యెడలి నెపుడు
చీల్చి యుండవు-అందుచేత నీ విట్టుల
వచియించెదవు గర్వపడుచు పేర్మి

ఈ రావణుండును-యీ కుంభకర్ణుఁడు
మేఘనాదుఁడు నిల్చి మెండుకొనరు
ఇంద్రుని యొడిలోన మృత్యువు యొడిలోన
సూరుని యొడిలోన గూరుచుండ

అంబరమ్మున కెగిరిన నతలమునకు
పోవ మిమ్మల రాముఁడు పోరిలోన
విడిచి పెట్టఁడు నీ శక్తి యుడుఁగు కాని
ఇది శిలాశాసనమ్మగ కుదురఁగలదు 200

వ్యసనములకును నత మలవాటుపడిన
యీ నిశాచరనేత తానెపుడు మిత్ర
రూపమున నున్న శత్రుల రుచిర వాక్య
ములకు నుబ్బుచు మన నాశమునకుఁదొడఁగు 201

మానవుడని వాకొందురు
మీ నోళుల మరల మరల మేకొవి హరియే
మానవునిగ శ్రీరాముఁడు
మానవ దేవునిగఁబుట్టె మహిని ప్రహస్తా! 202

ఎట్టి నిశాచర యోధుఁడు
బెట్టిదుఁడై యున్న గాని భీమ బలుండౌ
జెట్టిని మార్కొన గలఁడే
వట్టి యఱపులేల? ఫలము, వాసి కలుగునే? 203

ధర్మదూరుఁడు స్వర్గముఁదరియలేఁడు
పడవలేకుండ వార్ధినిఁ గడవలేఁడు
నీవు, నేనును, ప్రభువును నిలువఁబోము
రామునెదరించినను గెల్పురాదు మనకు 204

కంకపత్రమ్ములు కట్టినరాముని
తీక్ష్ణబాణములు భేదింపగలవు
నీ శరీరమ్మును నీవందు చేదంభ
ములు పల్కుచుంటివి ములుఁచవగుచు
ప్రభువు రావణుఁడును బలశాలియగు త్రిశీ
ర్షుండును కుంభకర్ణుండు నతని
సుతుఁడు నికుంభుఁడు-శూరుఁడింద్రజి కాని
శక్రతుల్యుఁడు రామచంద్ర విభుని

ప్రధనమున మార్కొనుచును నిల్వంగలేరు
ఇంక నీవంటి పలువలు నెందఱైన
అతనిముందు నిల్చినయెడ నంతమొందు
దురు కనుక బుద్ధిఁగల్గి బ్రదుకు ప్రహస్త! 205

భూధవుఁడు రామునియెడ విరోధమనుమ
హా విషధరము రావణు నాక్రమించె
పడగలెన్నియొ కలవు సర్పమ్మునకును
వేయితలలుండు దానికి భీతిఁగొలుప 206

నేత దుర్మార్గుఁడైన చోనెయ్యురతని
నీడ్చి దారికీ వేగ రప్పింప వలయు
మన దశాస్యుఁడు వీర లక్ష్మణజలధిని
రాముఁడను నౌర్వమునఁబడెఁ గాముకుఁడయి 207

ఉద్ధరించుఁడు మీరు చేయూతనొసఁగి
నేవచించెడి పల్కులు రావణునకు
లంకకునుఁ బంధుకోటికి, రాక్షసులకు
నాపదను మాన్పి యెంతొ శ్రేయమ్ముఁగూర్చు 208

ఇప్పుడైన సీతనిచ్చిన రామున
కతఁడు స్పర్ధమాని హర్షమొందు
మంత్రులైనవారు మన యంతరమ్మును
వైరి యంతరమ్ము నేరఁబోలు 209

రాక్షస యోధుల ముఖ్యుఁడు
శిక్షితుఁడగు నింద్రజిత్తు చేడ్పడి పలికెన్
రూక్షేక్షితుఁడై రాముని
పక్షమునం బల్కుచున్న వానింగనుచున్ 210

పినతండ్రీ! యివి లేకిమాటలు-మహాభీతుండవై పల్కెదే?
మన వంశమ్మునగాని యెయ్యెడల నీ క్ష్మాచక్ర మందెచ్చటన్
జననంబందిన వాఁరు పల్కఁడిటులన్ జల్పాకుఁడై, భీరువై
కనగానయ్యెను ధైర్య శౌర్య బలదక్ష శూన్యునిన్నొక్కఁడన్ 211

రామ లక్ష్మణులను సామాన్య రాక్షస
　　వీరుండు సహితము విశరఘాత
మొనరింప వలఁతియో యుద్ధరంగములోన
　　నింత పిరికితనం బేలనీకు ?
అమరవిభుండగు నా మహేంద్రునినేలఁ
　　బెట్టి రాయంగను విబుధులెల్ల
దిక్కునకొకఁడుగా తెకతెకలాడుచు
　　పరుగెత్తి పోవరే పందలగుచు
దేవవిభు వాహనమ్మ యైరావతమ్మ
దంతములఁ బీకి యమరుల దర్పమడఁచి
నట్టి నేను మానవమాత్రులైన రాజ
నందనుల సంహారించుట సందియమ్మె ! 212

అంత విభీషణుఁ డందుకొని వచించె
　　నాయనా ! నీకు మంత్రాంగమునకు
నర్హతలేదు-బాల్యంబు-కావున వివే
　　కము కలుగదు-వట్టి కైపుతప్పు
దశకంఠునకు నీవు తనయుఁడవేకాని
　　పరమ శత్రుఁడవు నా భ్రాతకీవు
దుర్మదుండవును వధ్యుండవు, బాలుండ
　　వును సాహసికుఁడవు పోఁడిమిఁగల

వాని మంత్రాంగమందునఁ బాలుపుచ్చు
కొనుట కిచటికి పిల్చిన కూళకూడ
వధ్యుఁడగు-మూర్ఖుఁడవు నీవు-ప్రభువురాము
బాణములు బ్రహ్మదండము వంటివిసుమి 213

పండితంమన్యుఁడవు శిక్షకుండగుదువె ?
దుర్మతివి చిన్నతనముచే తోఁచినటుల
మాటలాడుచు నుంటివి మత్తుఁడవయి
ఏమి తెలియును నీకు శ్రీరాము శక్తి 214

ఇప్పటికి మించిపోదు రాజేంద్ర ! వినుము
మణులు, ధనధాన్యకాంచనాంబరములఁగొని
రామునకు సీతనర్పింప లంకలోన
నిర్విచారముగ బ్రదుక నెలవుపడును 215

అనవుడు దశకంఠుఁడనుజుతో నిట్లనె
గర్భశత్రువు తోడఁ గలిసియుండ
వచ్చును-క్రుద్ధసర్పముతోడ సహవాస
ముండగ వచ్చుఁదమ్ముండవగుచు
శత్రు పక్షమ్మున శరువలెఁబల్కఁగ
తగునె? నీ కంటెను పగతుఁడె నయ
మగ్ని భయమ్మును నస్త్రశస్త్రమ్ముల
వలని భయమ్మును కలుగదు మఱి

స్వార్ధపరులగు జ్ఞాతుల వలనఁగలుగు
భయము కడుదారుణమ్మగు భ్రాతనైన
నాకు నీ యునికి లంకలో నయము కాదు
నీ వసూయతో పలుకుట నెఱవు కాదు 216

గోవులందు సంపద నెలకొనును, భూమి
సురులలో దమముండును సుందరాంగు
లందు చాపల్యమున్నది అటులె జ్ఞాతు
లందున భయంకరత్వము పొందుపడును 217

చెలఁగి నేను త్రిలోక పూజితుఁడనగుచు
పరమ భాగ్యవంతునిగను బరఁగుచుంటి
నెంతొ సర్వోత్తముఁడనయి యిటుల నోప
జాలకుంటివి మామకైశ్వర్య గరిమ 218

పద్మపత్రములోబడు వారిబిందు
వొక్క టొక టానితో చేరకుండునెపుడు
తుమ్మెదయు మకరంద పానమ్మొనర్చి
నిలువదచ్చట పువ్వుతో కలిసియుండి 219

జ్ఞాతులందైకమత్యము జాగరిలదు
నా వలన మేలులంది మన్ననలఁబొంది
యుండి నేనన్న పెల్లుగనోకరించి
యిష్టపడకుంటి విటులేల నిరువుకొనెదు? 220

కొలఁదుల్ చూడక ప్రల్లదమ్ములను సంకోచింపకే పల్కెదే ?
ములుఁచా ! యంతరముల్ గణింపకయె రామున్ గొప్ప వీరుండుగా
నిలుపన్ యత్నము సేయు చుంటి విటులున్నిద్రమ్ముగాఁ బెంచుచున్
నలుసుల్ కారు నిశాచర ప్రముఖులానై పుణ్యనిర్వీర్యులే ? 221

మిత్రపక్షములో నుండి శత్రువటు న
టించు వానితో సహవాసమెపుడు చేయ
రాదు-జ్ఞాతుల సంగతి రావుఁదెలియు
జ్ఞాతి కష్టము మెచ్చును జ్ఞాతిసతము 222

జ్ఞాతి తన కులమందున నాయకమణి
కార్యసాధకుఁబండితు, శౌర్యవంతు
ధర్మశీలుని శూరుని దావరీని
చూచి యోర్వఁడు పరిభవమాచరించు 223

సామజము నీటిలో దిగి స్నానమాడి
తొండమెత్తుచు తరువాత దుమ్ముచల్లు
కొనును తన మీద తానె-నేననిన నీకు
నిష్టముండమి మిక్కిలి నష్టమొదవు 224

శరదృతువునందు మేఘము లుఱుముచుండు
రణనమొనరించి యొకచుక్క రాల్పదెపుడు
జ్ఞాతుల యెడంద లోపలి సానుభూతి
యట్టిదే-నీ విచారమునట్టిదె యగు 225

ఇతరుఁ డెవడైన యీ పల్కులిటుల పలుక
వాని తల ఖిన్నమయ్యెడిదే నిజముగ।
విడిచిపెట్టెద-లంకను వీడిపొమ్ము
పొమ్ము-కులపాంసనా ! యేమి మునిగిపోదు 226

నా పెంపుయశముఁ గాంచుచు
చూపోపమితోడ పలుకుచుంటివి కాఱుల్
పో ! పో ! దుర్మార్గా ! నా
చూపులకున్ దూరమగుచు శూరంమన్యా ! 227

వ। అని దశముఖుఁడు కర్ణకఠోరభాషణమ్ముల దన చిన్నతమ్ముని నిందించు సమయమ్మున కర్ణభీషణముగా యచ్చటనే నిలిచి విభీషణుఁడు మిక్కిలి క్రోధముతో నన్నతోనిట్లు వచించెను. 228

అన్నవును. తండ్రిసముడఁవు నధిపుఁడవును
చెల్లు నీవేది పలికిన సీతనొసఁగి
ముందుగా రామునకును గైమోడ్చి మ్రొక్కి
ప్రోవుమంచును బ్రార్థింపఁ బొసఁగునిపుడు 229

జ్యానినాదము పెల్లుగ సమరభూమి
మ్రోగుచుండగ ఘోరాస్త్రములను లంక
సర్వమును ముంచి జరుపు వినశనకాండ
సమసిపోవును రాక్షస జాతియంత 230

వలదు రామునితో పోరు-వలదు రాజ !
చేటుకాలము వచ్చుటచేత నీకు
కలిగె దుర్బుద్ధి నీచులు కావరులగు
వారి మాటలువిన లంక పాడఁగుసుమి 231

సింధువుఁ దరియించి సీతతోమాటాడి
వనము భగ్నముచేసి దనుజవీరు
లను సంహరించుచు లంకనుగాల్చి, ని
ర్భయముగా సభలోన ప్రభువుఁగాంచి
నీతివాక్యమ్ముల నిగదించినప్పు, డీ
వీరముల్ పల్కినవార లప్పు
డేమైరి ? ముడిఁగిరే సోమింపరెందుచే ?
నీచెవిక్రింద నీ నీచులిపుడు
రజ్జులాడుచు స్వీయగౌరవము కొఱకు
చూడుమెన్నియొ గొప్పల నాడుచుండి
రిద్దిగమనింపఁ దెలియుగాదే ? మహేచ్ఛ !
వారినైజము, వీర్యముఁ బ్రజ్ఞయేదొ ! 232

వారి తుచ్ఛవాక్యమ్ముల మూరిఁబోయి
నా హితోక్తు లపథ్యములా- హసాదు !
దుర్మదుండగు చెడువానితో వసింపఁ
జనదటంచు నార్యులు చెప్పవినమె భ్రాత ! 233

అనగ వినుచు తోడ నమరారి సేనాని
యగు ప్రహస్తుఁ బిలిచి యానపెట్టె
వీని కొలువునుండి వెడలఁద్రోవు మటంచు
నంత నతఁడుఁ గదిసి యనియె నిటుల 234

దనుజపతి నిన్ను కోపిం
చెను మిక్కిలి తొలఁగఁజేయు మనుచు విభీ
షణ ! పనిచెఁగాన తోడ్తో
చనుమిచ్చట నీకు నిలువఁజనదనె నతఁడున్ 235

వ॥ అనిన నవ్విభీషణుండు సభా మధ్యమ్మున నిలిచి రావణుఁ
గనుగొని 236

"రామునితో విరోధము కరంబనుమేయము కాదటన్ననా
ప్రేమగణింపకే కొలువు వీడు" మటంచును పల్కుచుంటివే
భామను ముచ్చిలించి నిలుపన్ వనమందు, నధర్మమే కదా !
క్షేమముకాదు నీకు పరికించిన రామ్మని కిమ్ము జానకిన్ 237

నీవొక నీతి బాహ్యుఁడవు నీకు పరాంగనలందునెప్డు స
ద్భావము లేదు కాముకుఁడవై చరియింతువు సర్వవేళలన్
బావు కొనంగలేదిచట బన్నములందుట తప్పకావునన్
పోవుచు నుంటి నేనిదె ప్రమోదము నందుము మానసమ్మునన్ 238

నీ హితము కోరి పలుకగ నిష్ఠురోక్తు
లాడి నొప్పించి నావు క్షమార్హుఁడగుదె ?
కాలవశులు, దురాత్ములు బాలిశులును
వాని పట్టించుకొనరు దుర్భగులగుటను 239

సంతతము నిచ్చకములాడు జాల్ములు సుల
భముగ దొరకుదు, రప్రియంబైన సత్య
వాదులెపుడు లభ్యము కారు-పాదుకొనరు
వినెడివారును యమపాశ వేష్టితుఁడవు: 240

నీవు నాకగ్రజుండవు నీ హితమ్మ
కోరి నే వచియించు పల్కుల క్షమించు
మంచిగా నిన్ను నీవు రక్షించుకొనుము
లంక నాశముఁగానీకు రాక్షస కుల
మంతరించి పోకుండ నీ వాదుకొనుము 241

అగ్నినిభమగు రాము తీవ్రాశుగములు
నిన్ను నాశమొనర్ప నేనెన్నడును స
హింప-నా పరోక్షములో సుఖించు నెడల
హాయిగా నట్టి సుఖము నీకమరుగాక ! 242

వ। అని పలికి వినతుండై తన మంత్రులు అనల, శరభ, సంపాతి, ప్రఘసులతోను తాను గదాపాణులగుచు. నాస్థానము వీడి యఖి నందన పూర్వకముగా జనయిత్రి వీడ్కొని మంత్రీసమేతుఁడై గగన మార్గమ్మున జనియె. 243

మేరుశిఖరమ్ముఁబోలుచు మెఱయుచుండి
ఆకసమ్మున నిలువగ నా విభీష
ణునిని నల్వురు దనుజులఁగనిరి ప్లవగు
లందఱును భూమిపై నుండి చిందిలి పడి 244

వ॥ అక్కడ సుగ్రీవుఁడనతిదూరమునంగనుగొని కపులతో
నిట్లనియె 245

ఒక రాత్రించర పంచకమ్ముఁగనుఁడీ ! ద్యోవీధిలో నాయుధ
ప్రకరమ్మున్ గడు భీకరత్వమును నిష్పాదించుచున్ వచ్చెడిన్
మకుటమ్ముల్ ధరియించి శీర్షముల దుర్మానమ్ముతో సాంపరా
యికముంజేయగ వచ్చు రీతిగను గన్పించున్ సువిద్వేషులై 246

తరుల శిలలఁబూని దైత్యులఁబరి మార్ప
నేకరించుటకును సిద్ధపడెడి
కపులఁగాంచి కుంభకర్ణానుజుఁడు పల్కె
గగనవీధి నుండి పొగులు చిటుల 247

"వానర వీరులార! పగవాఁడనుగాను, మహేష్వుఁడున్ మహా
మానవ దేవుఁగొల్వగ సుమా ! చనుదెంచుచు నుంటి, నొండు కా
దేనుదశాస్యు సోదరుఁడ నిష్టుఁడనౌదు విభీషణాఖ్యుఁడన్
దీనుఁడ, సజ్జనుండను పదేపది వేఁడెద నన్నుఁగావుఁడీ ! 248

పరసతి సీతఁదెచ్చితివి వంచనమై-క్షతమౌనుసూ నిశా
చర కులమంత రాఘవుని క్షాత్త్రమునన్-వెస భూమిజాతఁజె
చ్చెర రఘురామునికిచ్చునెడ చెల్మి ఘటిల్లును రక్షవేయు నీ
దురితములన్ క్షమించునని" తొల్తటి నుండియు చెప్పి చూచితిన్ 249

చావ నుండిన రోగి యౌషధముఁదెగడు
చందమున రావణుండు నీచముగ జూచి
నా హితము నొల్లకుండెఁదామోహియగుట
కఠినముగ మందలించెను కాఱులఱచి 250

ఎంతొ పరిభూతునిగఁజేసె నేవగించి
అందుచే దార బిడ్డలనచట విడిచి
సర్వలోకశరణ్యుఁడు సారసాక్షు
శరణు పొందగ వచ్చితి చతురులార ! 251

ఎంతకు నాహితమ్ము మదినెంచఁడు కర్ణకఠోర వాక్యముల్
పంతముఁబూని పల్కి వెడలన్ బురిపీడగఁజేసె దుష్టుఁడై
అంతట నేను రాము శరణాగతికై మది నిశ్చయించి మీ
చెంతకు వచ్చితిన్ గరుణచే ననుఁజేర్చి యనుగ్రహింపుఁడీ 252

ఆ విభీషణు భాషణ మాలకించి
ప్లవగ విభుఁడు సుగ్రీవుఁడు రామచంద్రుఁ
గాంచి సౌమిత్రి వినుచుండ కైవుమిగుల
మనవి చేసె సుద్రిక్తత మరగు హృదిని 253

ఇతఁడు విభీషణుండు దనుజేశ్వరు సోదరుఁడన్నగారికిన్
హితమును జెప్పఁబూనగ సహింపక క్రోధము మిక్కిలను బహి
ష్కృతు నొనరింప రామ విభుసేవకు సమ్మతి నీయగోరుచున్
జతనము సల్ప వచ్చెను నిజాయితి యుండదు యాతుధానులన్ 254

తనతోపాటుగ నలుగురు
దనుజులతో వచ్చె నితఁడు-దాక్షిణ్యముతో
ననుమతి నిచ్చిన మనలో
మనకు కలఁతలేర్పడదగు మార్గము వచ్చున్ 255

దానవులు, కామరూపులు. దర్పితులును
కపటతంత్రపారీణులు, ఘాతుకులును
మాయకాండ్రును వీరల మాటలెపుడు
నమ్మగా రాదు-ద్రోహమొనర్పఁగలరు 256

రావణుని గూఢచారిగా రామచంద్ర।
ఇతని భావింప వచ్చును హితవరిగను
చతురుఁడుగ సంచరించి నాశమ్మొనర్ప
గలఁడు క్రవ్యాదుఁడగుటచే కలుషమతిగ 257

మిత్రుని వలె నటియించెడి
శాత్రవునిన్ నమ్మిన యెడ క్షతి రావచ్చున్
మిత్రకుల ! కలతెఱంగును
తత్రత్యుల తోడి సంగతమునఁదెలియ వలెన్ 258

ఘూకమ్ము మాయఁజేయుఁచు
కాకి గూటిలోనఁజొచ్చి కాకులఁజంపున్
ఈ కల్మాషుల కథయము
నీ కుండిన క్షేమమగును హేమాద్రినిభా ! 259

ఇతఁడు రావణు సోదరుఁడిందు వలన
శరణు వేడిన మాత్రాన సారసాక్ష !
మంచి చెడ్డల నరయక మాట నీయ
వలదు-సంప్రదించుము మనవారినెల్ల 260

భానుతనయు మాటలు విన్న భానుకులుఁడు
తాను ఏతమరియాటచే దాపున గల
ప్లవగ భల్లుక ప్రముఖుల పాఱఁజూచి
వారి యభిమత మర్థించె దూరదర్శి 261

ఆ విభీషణు విషయమై యర్కజుండు
పలికినది హేతుబద్ధము భావయుక్త
మై వెలంగును మఱి బుద్ధిమంతులైన
మీరు స్పష్టముగాఁ చెప్పమేల" టన్న 262

దానిపై వారలందఱు దశరథ సుత !
త్రిజగముల నీకు తెలియని తెఱగులేదు
పరిచితింగాని నీ గౌరవమున గాని
అడుగుచుంటివి-నీవు సత్యవ్రతుఁడవు 263

శూరుఁడవు-ధార్మికుండవు ధీరుఁడవును
మఱియు దృఢ విక్రముఁడవు రామా ! కుశాగ్ర
బుద్ధివగుదువు ప్రతి కార్యమును సమరస
దృష్టితో నిర్వహింతువు దీక్షతోడ 264

స్నేహపరతంత్రుఁడవు-అందుచేత బుద్ధి
మంతులు సమర్థులైన నీ మంత్రులు తమ
యభిమతము నెఱింగిపుడటంచు మమ్ము
కోరి యుంటివి నిను మించువారులేరు 265

అందుపై నంగదుఁడు పల్కె నసురవిభుని
వద్ద నుండి వచ్చిన యట్టి వాని కూడ
సంశయింపవలయును విచార్యమగును
విశ్వసింపగరాదు విభీషణునృప! 266

వంచకులు జాగరూకులై సంచరింతు
రదను దొరికిన దెబ్బ తీయుదురు-లాభ
నష్టముల, కష్టసుఖముల దృష్టి నుంచి
నడుచుకొనమేలు లేదేని బెదఁద వచ్చు 267

గుణములను గ్రహించుచు దోస,గులను విడిచి
పెట్టవలెను విభీషణు విషయమైన
మనకనుసరించు పద్ధతి మాత్రమదియె
యనుచు నిగదించె రఘురాము ననఘుఁగాంచి 268

శరణుఁడనియె విభీషణు సరణి నెఱుఁగ
ప్రణిధి నొక్కని నియమింపవలెను రామ!
దానిపై నేమితేలునో దానిఁజేయ
వచ్చునని తేల్చి చెప్పెను ఖచ్చితముగ

జాంబవంతుఁడు వచియించె సవితృవంశ్య!
బద్ధవైరి నీ యెడల రావణుఁడు-సహజ
ముగ మహాపాపి యాతని పురము నుండి
వచ్చు కతన సందియపడవలెను మనము

నీతి శాస్త్రమునందు నిపుణుడౌ మైందుండు
వచియించె "రామభూపాల! యొకని
ఆ విభీషణు కడకంపి రావణు హృద
యము నెఱుంగగవలె క్రమముగనని

సామీరి వచియించె రామప్రభూ! బుద్ధి
మంతుఁడవీవు సమర్థుఁడగుదు
మాటకారివి కూడ మాటలలో బృహ
స్పతి సాటిరాడు నావాదకౌశ

లమును చూపింపదలఁచను రసమయమగు
చర్చ చేయనందటి కంటె సమధికుడుగ
నెంచ-నాకు తోచినది వాచించువాడ
నీ వడుగ చెప్పకుండుట నీతికాదు

"కట్టెదుట నున్న వాని దగ్గఱికిఁ బ్రణిధి
పంపనేల ? రాకూడని ప్రాంతమునకు
వచ్చినాడని కొందఱు పలికిరికద
ఉండె నా వివక్షతఁదెల్పుచుంటి రామ 272

సరియైన వేళలో సరియైన చోటికి
వచ్చె విభీషణ సచ్చరితుఁడు
రావణు నిన్నుఁ బరామర్శనముఁ జేసి
విదితముఁజేసుక వెడలి వచ్చె
రావణుకడను దుర్మార్గవృత్తిఁగనుచు
రఘునందనుండుఁ బరాక్రముఁడని
తలఁచియే యాతఁడు ధర్మశీలి యగుట
నీ పరిస్థితిలోన నిటకు వచ్చె
అందులో తప్పులేదు కదా ! యవమతి
పొందు నాతని కాదన్నడిందుపడును
భాషణముఁబట్టి చూచిన వదనమందు
సుముఖతను గాంచనితఁడు దుష్టుండుకాఁడు 273

అతని మాటలు నిర్దోషమగుచుఁజెలఁగు
సత్కుపీనుఁడు నిశ్శంకఁజనును కాని
కుత్సితుండెప్పు రాలేఁడు కుతికలఁబడు
ముఖములో వికారము లేదు ముదమెతోఁచు 274

దేశకాలపాత్రముల గుర్తించి సలుపు
యత్నములు సఫలమగు దశాస్యసోద
రుండు నీ దండయాత్ర పరోక్షముగను
తెలిసికొని యన్న దౌష్ట్యము తెలిసివచ్చె 275

నీవు వాలినిఁ జంపి సుగ్రీవు పట్ట
భద్రు నొనరించు వార్త సంబరము తోడ
వినుచు రాజ్యాశ యధికమై నిను శరణము
కోరె నిశ్శంకగా చేర్చుకొనుము రామ ! 276

నాకు తోఁచినదిద్ది భూనాథ ! యిచ్చ
వచ్చిన విధాన చేయంగ వచ్చు నీవ"
టంచు నిపుణముగా పల్కి యనిలసూతి
ఊరుకొనె-రామచంద్రుని యుల్లమలరె 277



# ద్వితీయాశ్వాసము

ఆ మహాపండితుండు శ్రీరామ విభుఁడు
శ్వసనతనయు మాటలకుఁ బ్రసన్నుఁడగుచు
పలికె "మిత్రభావముతోడ వచ్చువాని
విడిచిపెట్టను శరణని వేఁడుకతన 1

అందులకైన వేతెందులకైనను
చనుదెంచి శరణన్న దనుజుకైన
పొగదు మోసమ్ము సలుపుట కేమాత్ర
మీవానరశ్రేణి కెదురునిలువ

కుటిలుఁడైనను గాని గుణవంతుఁడైనను
గైకొందు నీతనిఁ గరుణఁబూని
అభయ మొసంగుచు నాదరింపగలాత
ననగ సౌమిత్రి తాననియె "నన్న!

రవిజు విన్నపమును మీరలవధరింపుఁ
డసురమాయలు బహుళము-పొసఁగవెట్టి
త్రోవనెంచి యేతెంచెనో రూఢికాదు
పగతుతో నెందులకు సహవాస మిధ్య 2

శరణార్థియగుచు వచ్చిన
పరిపంథిని నమ్మరాదు పావనచరితా!
దురితాత్ముఁడొ, నిర్మలుఁడో
పరిగణింప వలద మనము పరికించివెసన్ 3

అందుపైఁ భానుజుండనె "యనఘ ! యితఁడు
పామరుండైన నెట్టి యిబ్బందిలేదు
పంక్తిముఖుఁడుండె గొప్ప విపత్తులోన
ఇతఁడతని వీడి వచ్చుట పతితముకద 4

ఆపద సమయములో కడు
కోపముతో నన్నవీడి గునగున రాఁగా
పాపము కాదే ? ధర్మం
బేపుమాపు తెలుఁగుకాదె యినకులమౌళీ! 5

అన్న సాధించునన్న భయమ్ముతోడ
వచ్చియుండె విభీషణుఁడిచ్చటికిని
నేను భావింతునందుచే వీనిమనము
చేర్చుకొనినను నేహాని చేయలేఁడు 6

ధరణి సోదరులెల్లరు భరతువంటి
వారె ? నావంటి తనయుడు ప్రతి జనకున
కుం జనింపరు నీవంటి కూర్మిసఖుఁడు
నెచటకూడ నుండఁడనుమ్ము ప్రచురముగను 7

రవిజుఁడంతట మాటాడె "రావణుండె !
యీ విభీషణుఁ బంపినట్లే విదితము!
అతని శిక్షించుటే మంచిదనుచు తోఁచు
నన్ను, నిను, లక్ష్మణునిగూడ మన్నిగొనును 8

కనుక నితనిని, మంత్రుల దనుమమేలు
ఎన్నిచెప్పిన రఘువీర! యితఁడు దుష్ట
బుద్ధియైన రావణుని తమ్ముండె యగు" న
టంచు పలుకుచు నూరక నచటనిలిచె 9

దానిపై రాముఁడిట్లనె "వానరేశ!
ఇతఁడు సజ్జనుఁడైనను, గితవుఁడైన
చెడ్డభావాన నేమియుఁ జేయలేఁడు
దేవతాళినిగూడ వధింపగలను 10

క్రౌర్యమెప్పుడు దండనార్హంబె యౌను
కాని యదినేయు శత్రువు తానెవచ్చి
కాళ్లపైబడ్డ యాతనిఁ గొనవలెను
వాని రక్షింపకుండిన పాపమగును 11

శరణాగతుఁ గావనిచో
దురితము, నపకీర్తికరము, దోషమువచ్చున్
పరమాప్త! యీ విభీషణుఁ
గరుణించితిఁ జేర్చుకొనుము కపిసైన్యములో 12

జ్ఞాతు, లిరుగుపొరుగుల దేశాల వారు
ఆపదలవేళ దెబ్బతీయందలతురు
వారి నే శత్రువులటంచు పలుకుచుందు
రార్యులనఁజెప్ప విందుమో ఆర్క! నిజము 13

ఈ విభీషణుఁడే కాదు యితని యన్న
రావణుఁడె వచ్చి వేఁడినఁ బ్రోవఁగలను
నాకడకు తీసికొని రమ్మ ! నయవిచార !
మిత్రునిగ నాదరించు మా మిత్ర తనయ !" 14

అనుచు సుగ్రీవుఁ బుత్తెంచఁ
జని యాతఁడు విభీషణుని సఖ్యుని వోలెన్
కొని రాఁగ రాము పాలికి
ననురక్తి వెలార్ప రామునభినందించెన్ 15

వనచరనాథుఁడు రఘుపతిఁ
గనుగొని వచియించెనిట్లు కాకుత్థ్సకులా !
మనవి యొనర్చెద తావక
గుణముల యోజింప నిద్ది కొలఁదియె కాదా ! 16

ఇతని ననుగ్రహింప నిప్పుడీతఁడు సర్వ
గుణసమగ్రుండు మా కుంభియ సఖుఁ
డిష్ట బంధుండు నర్హితుఁడును రఘువర !
మీ పదమ్ములఁగొల్వ మిత్రునిగను
భావించి తోడ్కొని వచ్చెద మనుచును
తగిన వానరవీర తతియుఁదాను
నభమున కెగసి దానవులకు నెదురేఁగి
తమ రాకకై చూచు దనుజనేత

సహజుఁగౌఁగిలించి సముచితాలాపముల్
సలిపి యభయమిచ్చె సారసాక్షుఁ
డైన శ్రీరాఘవుడని చెప్ప నాతండు
మంత్రిసహితుఁడగుచు మహికిడిగ్గె 17

రాజపరమేశ్వరుండగు రామునెదుట
బెలఁగి దండ ప్రణామముల్ చేసి నిలిచి
ఆశ్రయించె కృతాంజలియై వినమ్రుఁ
డగుచు వచియించె రాఘవు పొగడి మిగుల 18

"అరుణకులావతంస! శరణాగత వత్సల! రామచంద్ర! యి
త్వరుఁడగు పంక్తికంధరుని తమ్ముఁడనయ్యు భవత్కటాక్ష భా
సురు నొనరించి కిల్బిషము స్రుక్కననుగ్రహబుద్ధిఁజూఁడ, వా
నరులను నొక్కడైతిని, ననర్హుఁగృతార్థునిఁజేయ నాదృతిన్" 19

కరుణాసాగరుఁడైన రాఘవుఁడు వీకన్ గుంభకర్ణానుజున్
పరమ ప్రీతి జనింప నెమ్మదిని సంభావించుచున్ "సద్గుణో
త్తర! లంకేశ్వరు వీర్యకార్యబలకృత్యమ్ముల్ వచింపంగదే!
పరిశుద్ధుండుగ విన్నవింపవలె దౌర్బల్యమ్ముఁ జూపింపకే 20

అనగ శ్రీరాముని కంజలించుచుఁబల్కె
చతురుఁడు దశముఖు సహజుఁడిటుల
"లోకకంటకుఁడగులుబ్ధుఁడు మద్భ్రాత
బ్రహ్మవరముల సురాసురులకు

తాసజేయుండౌను-దానవపతి తమ్ముఁ
డౌ కుంభకర్ణుఁడు నమితబలుఁడు
రావణుమించును-రావణు తనయుఁడు
మేఘనాదుండును మేటరియగు
నతఁడభేద్య కవచుఁడు మాయావిచిత్ర
యుద్ధముల ప్రవీణుండును-యోధులెల్ల
సత్త్వ సంపన్నులగుదురు-సారసాక్ష !
వారి శక్తుల వివరించు వాఁడ ననఘ ! 21

వ॥ రావణుని సేనాధిపతి ప్రహస్తుఁడు. అతడు కైలాస పర్వతముపై కుబే రుని సేనాధిపతి యగు మాణిభద్రుని జయించెను. రావణుని కొడు కింద్రజిత్తు, అతడు గోధాంగుళీత్రాణముల ధరించి, కవచమును దాల్చి ధనువు చేతఁబట్టగనే యదృశ్యుడగును. అటు యుద్ధము జరుగుచుండ యిటు హోమం చేసి, అగ్నిహోత్రుని తృప్తి పఱచి యంతర్ధానుఁడయి శత్రువుల నాశనము చేయును. మహోదరుఁడు, మహా పార్శ్వుఁడు, అకంపనుఁడు మొదలగు సేనాధిపతులు పెక్కు రున్నారు. వారిని లోకపాలురు మాత్రమెదిరించ గలరు. రాక్షస యోధులు లంకలో పదికోట్లున్నారు. వారందఱు మాంసము తిని రక్తము త్రాగెదరు. వారు కామరూపులు వారి సాయముతో రావణుఁడు లోకపాలకులనందఱిని జయించెను. దేవతా యోధులు లోకపాలకులు రావణుని చేతిలో ఘోరముగ పరాభవము పొందిరి. అని సుదుప వీరరసాకృతియగు రాఘవుఁడిట్లనెను. 22

"చక్రవాళముఁగడచుచు విక్రమించి
యాకసమ్మున కెగసిన నంబుధిఁబడి
నాగలోకముఁజేరిన నాశనమ్ముఁ
జేసి తీరెద రావణుఁజీల్చివైచి 23

ఇన్నియెందుకు కసిమీఱ నితని, యాతు
ధానులను జంపి నేనయోధ్యకు వెడలెద
దానికిం దప్పినట్లైన దశరథ నృపు
తనయుఁడనుగాను నే విభీషణ ! ప్రతిజ్ఞ 24

ఆ జగత్కంటకునిఁ జంపి. యాదరించి
లంకకును రాజుఁజేతు నిశ్శంకనిన్ను
మూఁడు లోకాలు ముదమొంద నేడుగడను
ధర్మమార్గావలంబివై తనరుచుండ" 25

అనిన విభీషణుఁడాత్మలో ముదమంది
కైమోడ్పు మౌళిపైఁ గదియఁజేసి
వినయంబుగ వచించె "జనపాల ! నేనును
సమయింతుఁ బెక్కు నిశాచరులను
నా శక్తికొలఁది" యనంగను రఘుపతి
కనుగొని సౌమిత్రిఁ బంచెనలరి
సాగరజలముల సంతరించుచు విభీ
షణుని లంకారాజ్యమునకును నభి

షిక్తుఁ జేయ నియోగించె-చెలఁగి రవిజుఁ
డంత ప్రశ్నింప రాఘవు నసురనేత
శరణు వేఁడిన నేమగు సరసిజాక్ష!
యన, నయోధ్య నొసంగెదననె విభుండు 26

సర్వ వానరసేనలు సంతసించి
రాముఁ గొనియాడి రంతట లక్ష్మణుండు
అధిపునానతిచే రాక్షసాధిపత్య
మునకు నభిషిక్తుః గావించె ఘనుఁబ్రియపడి 27

ఆ విభీషణుఁ గాంచుచు నర్కజ హను
మంతు లిరువురుప్రశ్నింప మనము పృతన
తో నుదధి దాఁటుటెటులన దానవపతి
పలికె సాగరుఁ బ్రార్థింపవలె నటంచు 28

వ॥ విభీషణుఁడు చెప్పినదానికి రాముఁడంగీకరించి వెంటనే సముద్రపు గట్టుమీద దర్భాసనము పఱచుకొని వేదిపై నగ్నిహోత్రునివలె దానిపై నాసీనుఁడై యుండ శార్దూలుండను రాక్షసవేగరి చూచిపోయి రావణున కిట్లనెను. 29

“దేవా ! రాఘవుఁడున్ విభీషణుని నాత్మీయుండుగా నెంచి సం
భావించెన్ రజనీచరాధిపతిగా మన్నించి తోడ్తోడనే
రావచ్చున్ జలధిన్ దరించి యెపుడో లంకజేరు సైన్యమ్ముతో
ఆవేగమ్ము భయమ్మునుప్పతిలె రాజా ! సేన వీక్షింపగన్ 30

వనచరసైన్యము శతయో
జనవిస్తృతమగుచుఁ జెలఁగె సాగరమటులన్
పెనుపారుచు నెటుఁజూచిన
మనసున కాశ్చర్యమగును మనుపరి దృఢమై 31

ప్లవగవీరులెకాదు-రాఘవులుకూడ
నధికతేజోవిరాజితు లసమబాహు
విక్రములు-రణవిజయహంవీరులగుదు
రట్టివారిని మార్కొన నలవికాదు 32

సామదానభేదమ్ముల సత్వరముగ
నొక యుపాయము యోచించి యొద్దికపడు
కార్యమును సల్పవలెను రాక్షస విభుండ!
యనగ శుకుఁడనువాని రావణుఁడు పిలిచి 33

వ॥ రావణుఁడు సుగ్రీవునికడకు శుకుని దూతగా పంపుచు నిట్లు వచింపుమని యాజ్ఞాపించెను. 34

"సుగ్రీవ! కపినాథ! శూరుండవును మహా
రాజవంశమునందు ప్రభవమొంది
నాడవు-రాముఁడు చూడంగఁ దాపసుఁ
డతనికి నీకు సఖ్యంబదేల?
నిను నేను భావింతు నిక్కపు తోఁబుట్టు
వుగసు సఖ్యంబైన పొందుపడును
కావున రాముని నీవు త్యజించి పో
యిన మేలు కిష్కింధకిపుడు వేగ

వెడఁగు మర్త్యుని స్నేహమ్ము విడిచిపెట్టు
మతనితో నున్న క్షేమమ్ము నతనిఁబాయ
వచ్చు నష్టము లేదు నా పలుకు వినిన
నుభయతారకమౌను కాదో! యనుజుఁడ!: 35

అటుల కాదేని వినుము సురాసురులకు
నెపుడు రాలేని లంకపై నిపుడు నరులుఁ
వానరులు వచ్చుటకు సాధ్యపడునె చెపుమ
ఆ నరు సంగతి తదుపరి నరయ వచ్చు" 36

అనవుడు శుకుఁడును తోడనె
తన రూపము కీరమటులఁదాలిచి గగన
మ్మున సని భానుజునకు రా
వణు సందేశమ్ము వినుచ పయనమగు నెడన్ 37

ప్లవగులాపక్షి రూపుని వాలములను
గట్టి బంధించి దొంగ రాక్షసుఁడు వీఁడు
మనకు దొరికెను శిక్షింపు మనుచు రవిజు
ముందు నిలిపిరి పిడికిళ్ల పొడిచి, మోది 38

రవిజు నానతిపై శుకు రాము నెదుట
నిలుప నాతఁడుఁబనవుచు "నేను దూత
ననుచు వేగును గాను రామావనీశ !
విడిచి పుచ్చుము నను నీవు ప్రేష్యుఁడ సుమి ! 39

నరపతి పంపున జడియక
పరుషోక్తులఁబల్కు వాని వధియింపఁదగున్
పరిమితిఁదప్పని నన్నిపు
డఱిముఱిపడి శిక్షసేయ న్యాయంబగునే ? 40

అనిన విని రామచంద్రుఁడు
వనచరులకు నానవెట్టె వానిని విడువన్
వినువీధి కెగిరి సుగ్రీ
వుని ప్రశ్నించెను శుకుండు పురణించి వెసన్ 41

''వనచరేశ్వర ! సుగ్రీవ ! ఘనుఁడవీవు
బలపరాక్రమశాలివి ప్రబలుఁడవును
రావణుని కేమి చెప్పను ? రావణుండు
లోకవిద్రావణుండని నీకు తెలియు'' 42

అందుపైని రవిజుఁడందుకొని వచించె
శుకునివైపు తిరిగి సూటిగ నిటు
పలుకుచుంటి నాదు ప్రత్యుత్తరంబిదె
వినుచు మదియె దనుజ విభునికీవు 43

రావణ ! నన్ను మిత్రుఁడనరాదు-నినున్ గరుణింప కష్టమో
కావరి ! నాకు నెన్నఁడుపకారము సేయగలేదు-దానిచే
నీవు ప్రియుండవెట్లు ? మఱి నీవు ప్రతీపుఁడవౌదు రాముకున్
కావున నాకు శత్రుఁడవె-కల్మషబుద్ధివి క్రూరుఁడౌటచే 44

వాలిఁబోలెను నిను వధియింపగానౌను
తెగ పుత్ర బాంధవముగను నిన్ను
నాశనంబొనరింతు నాశక్తితో సేన
తోడ వచ్చి దనుజ ! దురమునందు
సురలు మార్కొనినను, సూర్యమండలమున
దాఁగుకొనినను పాతాళమందుఁ
జొచ్చిన రాముఁడు వచ్చి వధించును
విడిచిపెట్టఁడెపుడు తుడిచిపెట్టు
మూఁడు జగముల నినుఁగాచు వాఁడులేఁడు
మును జటాయువుఁ జంపితిననుచు గర్వి
వగుచు నుంటివ ముదుసలి యగుట వలన
చంపఁగలిగితి వంతె నిలింపవైరి 45

రామచంద్రుఁడు గాని లక్ష్మణుండును గాని
చూచుచుండగ నీవు సుదతి సీత
హరియించి తెచ్చితివా ! యట్టులైన నీ
ప్రాణముల్ తీసెడివారు కాదె ?
అతఁడు మహాభాగుఁడతఁడు మహాబలుఁ
డాతని నెదిరింప నమరదాన
వులకు సాధ్యముకాదు తెలుపుమీ సంగతి
మీ దశాస్యునకు సోమింపరాదు"

దానిపై నంగదుండనె వానరేశ !
ప్రణిధియే దూతగా చెప్పు రాక్షసుండు
మన బలము గుట్టుమట్టులఁ గనుగొననిటు
వచ్చినటుఁదోఁచు బంధింపవలెను వీని 46

రవిజు నానతిపై నంబరమున కెగిరి
ప్లవగులాతని బంధించి పట్టి కొట్టి
కట్టివైవగ శుకుఁడు రాఘవునిఁగాంచి
పలికెనిట్టుల గద్గదస్వనముతోడ 47

రఘువరా ! వీరు నాదునేత్రములఁ బీకి
వేయుచున్నారు ఱెక్కలు విఱుచుచుండి
రేను దూతను గావున నేనొనర్చి
నట్టి నా పాపమంత నిన్ చుట్టుకొనును 48

అద్ది వినిన రాముఁడగచరులకు నాజ్ఞ
నిచ్చె విడిచిపుచ్చుఁ డితని ననుచు
సింధురాజువేఁడ చెలియలికట్టపై
కుశలశయ్యఁ బఱచి కూరుచుండె 49

వనధివేలపై దర్భల పఱచుకొనుచు
తూర్పుముఖముగ తిరుగుచు తోయధిపతి
కంజలి ఘటించి సర్పదేహాభమైన
స్వీయభుజమె తలగడగ విభుఁడు పండె 50

ఈ కరమే రత్నహేమకేయూరాది
భూషణసంయుతమ్ముగఁ బొలిచెను
ఈ కేలె తాటక, లోకభీకర నిశా
చరి ప్రాణవాయువుల్ సురుగఁజేసె
ఈ హస్తమే మిథిలేశు నందన సీత
కనిశము తలయంపియై రహించె
ఈ చేయి కిష్కింధనేలెడి యింద్రజు
నొక కోలతోడను నుక్కడంచె
ఈ కరమె శివచాప మెక్కిడుచుఁ ద్రుంచె
నట్టి హస్తమె తలగడయయ్యె వాస
రత్రయము దర్భశయనుఁడై రామచంద్ర
నృపుఁడు పండిన సాగరవిభుఁడు రామి 51

అలిగి సౌమిత్రిఁ బిలిచి రామావనీశుఁ
డనియె తమ్ముఁడ! చూడుమీ యబ్ధిరాజు
గగనమంటుచు పొంగునుగాని నాకు
దర్శనంబీయ డెంతకు దర్పముమెయి 52

నా కోదండము లక్ష్మణ!
నాకిచ్చిన పీనిపొగరు, నయగారమ్మున్
బోకార్చెదనని నుడువుచుఁ
జేకొనె బాణాసనమ్ముఁ జిడిముడి పడుచున్ 53

ఓరిమి, మృదుభాషిత్వము
కారుణ్యము. శాంతి, దాంతిఁ గలుగు మనుజులన్
నేరని వాఁడనుకొందురు
గౌరవమును నెఱపఁబోరు గర్వము పేర్మిన్ 54

దుర్జనుల మెచ్చుకొందురు
దుర్జనులును, సాగరుండు దుర్జనుఁడగుటన్
నిర్జరారి గర్వింపక
వర్జించుచు చుండె నార్జవముఁ గల్గుననున్ 55

మత్తు, వంచకు, దుష్టు నాత్మప్రశంసఁ
జేసికొను వాని భయపెట్టు చెనఁటి బరుల
నెపుడు దండించు వానిఁబూజించు జగము
శాంతముగ నున్న కీర్తియు జయము రావు 56

చూడు లక్ష్మణా ! నా యోర్పుఁజూచి నన్ను
చేతగాని వానిగ నెంచి చెనఁటి కడలి
నా కడకు రాఁడు నేను శాంతముగ నున్న
కాన నింకింతునిపుడు సాగరమునంత 57

నడచి పోవచ్చు సర్వ వానరులు లంక
కెండగట్ట సముద్రము నిప్పుడనుచు
నగ్నికల్పబాణమ్ముల నఘుఘుడేయ
బాణబడబానలము పుట్టె వార్ధినపుడు 58

చెంగలించు తరంగభంగ సంయుతమయి
కళవళ పడిపోయె కడలి-నంత
పొగలు లేచెను సర్పములు వ్యధితములయ్యె
శంఖముల్ శుక్తులు పుంఖితముగ
తేలెను-పాతాళ దితిజులు పీడితు
లై పర్వుఁదీసిరి లావుకొలఁది
నక్రముల్ మత్స్యముల్ నభమున కెగిరెను
కెరటముల్ మిన్నంటె క్రేళ్లువాఱి
దానితో తృప్తినందక దాశరథియు
మరల బాణమున్ దొడుగ లక్ష్మణుఁడు నూర్చి
వలదు, వలదని యగ్రజు పాణిఁబట్టి
యాప రాముఁడు నిగదించె నబ్ధికిటుల 59

వార్థిరాజా ! నిన్ను పాతాళమువఱకు
నింకింతు ఘోరమౌయిషువు వైచి
నీయందు జలమంత మాయమ్ముఁగా దుమ్ము
ధూళి బయల్పడి తోఁచు దారి
నడచియే పోవు వానరసేన లంకకుఁ
బాలసులకును నివాసమీవు
కావున నా పరాక్రమముఁ బౌరుషము నా
వల్ల నీకును గల్గు వనటఁగూడ

నెఱుఁగకుంటివటంచు నా యినకులుండు
ధనువునందు బ్రహ్మాస్త్ర సంధానమునకుఁ
బూనుకొన భూమి బ్రద్దలై పోయినటుల
నంబరము ముఖరితమయ్యె నద్భుతముగ 60

తరువులు కూలెను ప్రాణుల
యఱపులు నిర్ఘాతములటు లవనినిండె భూ
ధర శిఖరమ్ములు కదలె పయో
ధరములు పిడుగులను వదలె ధారాళముగా 61

గగనమున మహా వాయువు
నిగుడారుచు బూరటిల్లె నిట్టలమ్ముగా
పొగ యావరించి యుండుట
నగపడె భానువులు నుల్కలటు పొనుగుపడెన్ 62

జగమునందంత క్రమ్మగ పొగలు, దెసలు
తెలియ వయ్యెను, పర్వతమ్ములు చలించె
కలఁగె నదులు సరస్సులు గతులుతప్పె
నుడుగణము పుష్పవంతులు-పిడుగులుపడె 63

వినఁబడె నదృశ్య భూతము
లొనరించెడి ధ్వనులతోడ నుడ్డాడి జనం
బనుమిక్కిలి భయమునఁ దూ
లెను కారణ మెఱుఁగరామి లేశము కూడన్ 64

వ. సముద్ర మధ్యమునుండి సాగరుఁడు మేరుపర్వత శిఖరమునుండి సూర్యుడేతెంచు నట్లు వెలువడి రామ మహీక్షితు పాలికివచ్చి కేలు మొగిచి యిట్లు మనవి చేసెను. 65

సగరుఁ డిక్ష్వాకు భూపుఁడా
జగదుని మూలమున నేను సాగరుఁడనగా
నెగడుదు నీవీ పగిదిగ
తెగఁబడగా ధర్మమగునె దినకరవంశ్యా ! 66

జనపతి ! సర్వలోకముల సాకుచుఁ దొల్లిటినుండి-నాపయిన్
కినుక వహించి జంతువులగీడ్పడఁ జేసెదె విష్ణుమూర్తిగా
ననునయ దృష్టులంగనుచు నాశ్రయమిచ్చుచు నాదరించు నీ
ఘనతకు నేటికోళ్లు-ననుఁ గారుణికుండుగఁ బ్రోవుమీ ప్రభూ ! 67

సురల ననుగ్రహింప మనుజుండుగఁ బుట్టితివబ్జనాభ : గ
హ్వారియును, వహ్నియున్, జలము, వాయువు, వ్యోమము శాశ్వతమ్ములై
వరలును లోతుగానిలుచు భావము నీటికిఁగల్గుఁ గాన దు
ర్భరముగ నుంట నాకును స్వభావము కావున నన్ క్షమింపుమా ! 68

ఇది రహస్యము--దీని నే నిచ్చకొలఁది
కాంక్షమై సాధ్వసమ్మున గాని పెక్కు-
జంతువుల కాకరమ్మగు జడధి నీకు
వెఱచి యిప్పుడు నేను స్తంభింపలేను 69

నరపాల ; సర్వవానరసేన వార్థికు
        త్తర తటమ్మును జేరు దారియొకటి
మనవిచేసెద నీకు-మయుని కుమారుఁడు
        నళుఁడను ప్లవగుఁడు కలఁడు-యోద్ధ
ఆతఁడు శిల్పవిద్యను ప్రవీణుండును
        పితృసమానుండు-తద్వీరుచేత
నిర్మింపఁ జేయుము నీరధిపైని వా
        రధి నది మునుగని రమణఁబట్టి
యుంచెదనటంచు నుడివె నాయుదధిరాజు
రాముఁడడిగెను నా ప్రచరమ్ము నెందు
నే ప్రయోగింప వలెనన నీరధిప్రభు
నిట్లు నిగదించె రామ రాజేశ్వరునకు         70

ఇచటి కుత్తరముగ నిరవొందు ద్రుమకుల్య
        యను ప్రదేశంబొండు-అందు నిలిచి
క్రూరకర్ములగు నాభీరులు పాపులు
        అపవిత్రునిగఁజేతురనిశమునను
కావున వారిపై కాండ ప్రయోగముఁ
        గావింపగా నమోఘంబగునది
అనుచు మనవి నేయ నట్టులే ద్రుమకుల్య
        మునఁబ్రయోగించె రాముండు కడిమి

విశ్రుతంబయ్యెనా మరువిటపి నాటి
నుండి ముల్లోకములలోన నూలుకొలిపి
అస్త్రపాతము జరిగిన నా ప్రదేశ
మందు భూమి భేదిల్లగ పొందుకొనెను
మధురజలప్రవాహం బొందు మగ్నమౌచు 71

ఆ మధువనమ్ము దానితో క్షామరహిత
మగుచు ఫలమూల సంయుతమగుచు సస్య
భరితమై శ్యామలమ్ముగ పరిఢవిల్లె
రామభూపాలు బలపరాక్రమము వలన 72

సాగరుని మాటపై రామచంద్రవిభుఁడు
నళునిఁబుత్తెంచె వారధి నిలుపుమనుచు
నతఁడు దానికి నొడబడి యంబుధిపయి
సేతువును గట్ట నెంతయో ప్రీతిపడెను 73

మహితుఁడగు రామునకును నమస్కరించి
జనకుఁడగు విశ్వకర్మ మా జననికొసఁగె
వరము తన వంటి శిల్ప ప్రవణుఁడగు సుతుఁ
డనుచు-సేతువు నిర్మింతు ననఘ ! యనెను 74

అనుచు విష్ణుపతికి నంజలించి నళుండు
సేతు బంధనమ్ము చేయ మొదలు
పెట్టె నుత్సహించి నిట్టలమ్ముగ కీశ
వీరులతనితోడ విన్యసింప 75

విఘ్ననాయక ! గణపతి ! ద్విరదముఖ ! న
మోనమో ! మృడాని పుత్ర ! వక్ర
తుండ ! ఏకదంత స్తుతియిుంతు భక్తితో
నా ప్రయత్నమందు నయముఁగూర్చ 76

ద్వివిద, శరభ, నీల. పవననందన, మైంద
పనస. జాంబవంత, వాలిపుత్ర
గజ. గవాక్ష, కుముద, గంధమాధన సుషే
ణాది. కపులు సాయ మాచరింప 77

పర్వతమ్ములవంటి వానరవీరులు
వేలు. లక్షలు, కోట్లు వెడలి పెక్కు
తరువులు, కొండలుఁ దలలపై దాల్చి నీ
రధిఁ బడవేయ జలమ్ము గగన
మంటురీతి నెగసె నగచరుల్ కొందఱు
సూత్రముల్ పట్టిరి సుందరముగ
కొలత కఱ్ఱలఁ బూని కొందఱు సాయముఁ
జేయంగ నళుఁడును జివరకుఁ పది
యామడల వెడల్పునను నూరామడనిడి
సేతువునుగట్టి మిన్నున స్వాతివీథి
బోలె నదిచూచి సిద్ధవిబుధమహర్షి
యక్షగంధర్వు లంబరమందు నిల్చి
యబ్బురంపడి సంతృప్తులైరి పెలుచ 78

వారధింజూడ జలధికి పాపటవలెఁ
దోఁచు చుండగ వానరుల్ దుముకి, యెగిరి
కలకలముతోడ నావలిగట్టుఁ జేరి
బెట్టిదుని వీటిలో కాలుపెట్టిరపుడు 79

వారు దశాస్య పట్టణము వారధి మీదుగఁ బోయి చేరగా
తీరమునన్ విభీషణుఁడు తేజున మేరుసమాన ధీరుఁడై
వారణముం బొనర్ప పరిపంథులు నడ్డమురాని రీతిగా
వారికి ముందుగా గదనుపాణిని దాల్చుచు నిల్చెఁ గ్రన్ననన్ 80

రవిజుఁడంతట నిగదించె రాముఁజూచి
పవననందను భుజములపైని నీవు
నంగదుని యంసములఁ దమ్ముఁడధివసింపఁ
బూని కొనిపోవుదురు వలీముఖులు మిమ్ము 81

భానుజుఁడు చెప్పినటు ధనుష్పాణులగుచు
బయలుదేఱిరి రాఘవుల్ రయతనపుడు
జలము, ఫలమూలములు గల్గు స్థానమరసి
ధ్వజిని విడియించె వానరేశ్వరుడు చెలఁగి 82

అమర సిద్ధచారణ గణమంత దీనిఁ
గాంచి రాముని పుణ్యోదకముల తోడ
ప్రేమతో నభిషేకించి విన్ననువున
ననఘు దీవించి ప్రణుతించి రబ్బురముగ 83

రాఘవా ! శత్రుకోటిఁ బరాసనమ్ముఁ
జేసి వనధిపర్యంత మీ స్థిరను నీవు
పాలన మొనర్పవలెఁ జిరకాలమెసఁగి
ధన్యతాభాజనమ్ముగ మాన్యుఁడవయి 84

దాశరథి శుభాశుభనిమిత్తముల ఫలము
లరసి సౌమిత్రితోననె ననుజ ! ప్లవగ
సేన గరుడవ్యూహమ్ముగఁ బూనిచె రవి
జుండు లోకక్షయభయమ్ము చుట్టుకొనును 85

కలుషముగ వీచుచుండెను గాలి- భూమి
వణఁకుచున్నది గజగజ-పర్వతశిఖ
రములు నూగుచు నుండె-వృక్షములు కూలి
పోవుచుండెను-నెత్తురుబొట్లు రాలు 86

సంధ్య రక్తచందనమట్లు చండమయ్యె
భానుమండల మందుండి భగభగమని
మండి క్రింది కురుకు నగ్నిమండలమ్ము-
కాంతిహీనుఁడై చంద్రుఁడు కానఁబడును 87

తారకలు ధూళిధూసరితమ్ములగును
ప్రళయకాలసూచనఁ గల దిప్పాట సహజ !
వాయసములు, గ్రద్దలు నశుభముగఁ గూయు
చును తిరుగుచుండెఁ గ్రిందుగ చోదితముగ 88

దనుజవానరయోధులు రణమునందు
విసరు శూలశిలాయుధ విసరమందు
రక్తపలలమ్ములం భూమిసిక్తమౌను
రవిజ ! రావణపాలిత లంకపైకి
దండు వెడలెద మిపుడె సిద్ధమ్ముకమ్ము 89

అనుచున్ బల్కుచు రామభూవిభుఁడు తానై ముందుగా లంకకున్
జనుచుండన్ గనుచున్ విభీషణుఁడు కీశశ్రేష్ఠుఁడౌ భానుజుం
డును సేనల్ వెనువెంటఁ బోవగను పీడుంబుట్టు కోలాహలం
బును దర్శించుచు రాఘవేంద్రుఁడు మదిన్ బ్రోత్సాహముం బొందెతాన్ 90

కాకుత్థ్సుఁడును శరత్కాలపౌర్ణమినాడు
చంద్రసంయుక్త నక్షత్రవితతి
పగిదిని తనచుట్టు వానరసైన్యము
చాలచక్కఁగ మహా సాగరమటు
లంతులేనట్టి సైన్యము వల్ల గజగజ
లాడె సర్వంసహ - యసురనాథు
లంకలోనుండి కర్ణములు చిల్లులుపడు
రీతి విన్పించె భేరీమృదంగ
నాదములు వానితోడ వానరులు దేహ
ములును రోమాంచములు కాఁగ పొంగె వారు
సింహనాదముల్ జెయగఁ జెలఁగి యవ్వి
రాక్షసుల కష్టతోఁచె పర్జన్యములటు 91

చిత్రవర్ణపతాకలఁ జెలఁగుచున్న
లంక పుటభేధనముఁ గాంచి రామచంద్రుఁ
డమిత దుఃఖముతో సీత నాత్మఁదలఁచి
మిక్కిలిగ నూర్చి పల్కె సౌమిత్రిఁగాంచి 92

"ఏణాక్షియైన నాసతి
దానవేశ్వరుని పురిని తహతహపడుచున్
హీనగ కుజువలనను రో
హిణి కైవడి నిల్చియుంట యేహ్యాముకాదే ? 93

నెగడి సంకల్ప మాత్రాన నిర్మితమయి
మయునితో లంక యొప్పు నంబరము రాచు
చౌనుచు - పెక్కు విమానముల్ కూడ కలవు
మేఘముల తోడ నిండిన మిన్ను పగిది 94

లంక నిండఁగల్గును చైత్ర రథము వంటి
లాలితోద్యానములు కూడ పూలతోడ
పండ్లతోడను నిండి యొప్పారు పక్షు
లవి మెసవియే మదించి యున్నవి యవరజ ! 95

మత్తుగొని యుండె భసలముల్ మధువుఁగ్రోలి
పల్లవమ్ముల మెసవిన పరభృతములు
సుల్లసమ్ముగ నుండెను-పిల్లగాలి
వీచుచుండెను లక్ష్మణ ! విపులముగను" 96

ఆజ్ఞల నొసఁగె రామావనీశుఁడు వలీ
ముఖఋక్షవీరుల ముందు నిలిచి
దుర్జయుండగు నంగదుఁడు నీలసేనాని
సహితుఁడై ధ్వజిని వక్షస్థ్సలమున
నుండగావలె వానరోత్తముఁడగు ఋష
భుఁడు సేన దక్షిణమ్మున నిలుచుచు
రక్షింపవలెను-వారణ సమానుఁడు గంధ
మాదనుఁడుండు వామాంకమందు
పొందుకొని శిరోభాగమందుందుము సహ
జుండు నేనును - జాంబవంతుండు, వేగ
దర్శియు, సుషేణుఁడును కుక్షిదళమునందు
నిలుతు రర్కజుడును వెన్కనిగుడ వలెను 97

గరుడవ్యూహముతోఁ బ్లవంగచమువాకాశమ్మునన్ మేఘముల్
పరిపూర్ణమ్ముగ నావరించినటులప్పాటన్ భువిన్ నిండగా
తరువుల్ కొండలు వానరప్రతతి హస్తన్యస్తులై రేఁగి సం
గరమున్ సేయగ సిద్ధమై నిలిచి రాకాంక్షించుచున్ శూరులై 98

సమవిభక్తముగానుండి సైన్యమంత
సర్వ సన్నద్ధమయ్యెను సమరమునకు
సింహనాదముల్ సలుపుచుఁ జెలఁగుఁ జూడు
మనుచు నుడివెను శ్రీరాముఁ డర్కజునకు 99

x x x x x

ప్లవగులువీడగా శుకుఁడు రావణు పాలికిఁబోవ నాతఁడున్
గవకవ నవ్వుచున్ పలికె "కాఁటియపెట్టిరె నిన్ను, మోమునన్
దవులు విచారముద్ర శుకదానవ : వైరికిఁ జిక్కినాఁడవే
వివరములన్ వచింపగదవే పరిపంథి బలమ్ము వైనమున్ 100

నీ రెక్కలుం ఖండించిరె ?
నీరసముగ నుంటివీవు నింజిలియేలా !
వైరులకు దొరకిపోయితి
వా ? రయముగఁ దెల్పుమని ప్రహాసమొనర్చెన్ 101

అని యెకసక్కెమాడు దితిజాధిపుతో శుకుఁడిట్లుపల్కెనో
యనఘ : దివమ్మునం దిరుగునప్పుడు నన్ దిలకించి వానరుల్
కినిసి నభమ్మునందె నను గీడ్పఱుపంగనుబట్టి నేలకున్
గొనకొని దింపుచున్ బొడిచి గ్రుద్దులు గ్రుద్దిరి విహ్వలింపఁగా 102

మృదువుగ నీదువాక్యముల మిత్రతభూజునకేను దెల్పితిన్
వదరుచు నేవచించునది వానరులున్ గణియింపకే ననున్
వదలకపోయి రెంతకును బాధలుపెట్టగ రామచంద్రుఁడే
వదలుఁడటంచుఁ దెల్పగను వచ్చితి వారలువీడ నిప్పుడే 103

కోపమెక్కువ రాజేంద్ర ; క్రోఁతులకును
రాముఁడింతకు మునుపు విరాధదనుజు
దనువు సుతుఁడగు నా కబంధుని వధించి
సేతువునుగట్టి వచ్చెను సింధువునకు 104

ఖరుని నిహతునిఁగావించి ఖరకరసుతుఁ
గూడి జానకి కోసమై కోఁతిదండు
తోడ నేతెంచె లంకకు దుందుడుకుగ
రాముఁడు తృణీకరించుచు రాక్షసులను 105

పంతగించి రాముఁడు ధనుష్పాణి యగుచు
నిలిచి యున్నాఁడు యుద్ధము సలుపు కొఱకు
ప్లవగభల్లూకయోధులు పర్వతముల
జలదముల బురుడించెడి శౌర్యధనులు 106

నేల సర్వము సేనతో నిండిపోయె
సంధి మాటలు పొసఁగవు క్ష్మాతలేశ !
కదలివత్తురు నగరప్రాకార మాత్ర
మించుటకు ధూర్వహాముగ సోమించి మించి 107

సీత నాతని కర్పించి చెలిమి చేయ
నెంచితివా ? సమరము సేయ నెంచినావా ?
నిశ్చయించిన మంచిది నీవు రాజ !
రాక్షసుల, లంకఁగావుము రగడమాని 108

అనగా రావణుఁడెంతొ మండిపడి ఔరా ! యెంత ధైర్యమ్ముతో
వనితన్ రామునికీయుమంచునను నభ్యర్థింతువే ? యెన్నడా
పనిఁగావింపను-దేవదానవులు దుర్వారమ్ముగా వచ్చినన్
నను గెల్వంగను లేరు - రాముఁడనగా నాదారుఁడే యౌగదా ! 109

విరియఁబాఱిన తరువుపై విధుతముగను
మధుపములు పోయి వ్రాలిన మాడ్కి, నా ని
శితశిలీముఖములు రాముఁజేరి కవియు
చూడుమీ నా ప్రతాపము చూడు శుకుఁడ ! 110

సూర్యుఁడుదయింప చంద్రుని శోభతఱుగు
నటులనే ధనుష్పాణినై యరుగ యుద్ధ
రంగమున సర్వవానరుల్ మందగలరు
నాద్రుతము చూడు మీ సముద్రద్రుతంబె ! 111

రాముఁడెఱుఁగడు నాదు పరాక్రమమ్ము
కాన నాపైకి నిట్టులఁగదలివచ్చు
నతఁడు నను జూడడెపుడు రణాంగణమున
కావుననె వచ్చు చుండె సంగర మొనర్ప 112

నా ధనుర్వీణఁబూని రణస్థలమున
దారుణమ్ముగ మ్రోయింతు-దానిఁగనుము
ఆ సహస్రాక్షుఁడింద్రుండు నాహవమున
నా యెదుట నిల్వలేక ప్రణామమనును 113

వరుణుఁడును నాదు మ్రోల నిల్వంగలేఁడు
శమను గెల్చితి, గుహ్యకేశ్వరు జయించి
నాఁడ, నసు తేఱిచూడగ లేఁడు రాముఁ
డనిన నొక మానవుఁడె కాని ఘనుఁడు కాఁడు 114

దశరథాత్మజుఁడు సంద్రము దాఁటి వానర
బలముతో లంకకు వచ్చు వార్త
నాలించి దశముఖుఁడంతట శుకసార
ణులను మంత్రి వరులఁబిలిచి పలికె
దుస్తరమైన యీ తోయధిఁ దరియించి
వానర సైన్యము వచ్చె వార్ధి
కెపుడు నెన్నడు కూడ యెఱుఁగని రీతిగా
సేతువు బంధించి చేరె లంక-

దీనినే లక్ష్యపెట్టను కాని పృతన
యెంత యుండెనో యేపాటి దెవరు దాని
నాయకులో, మంత్రులెవరో, వానరులలోన
వీరు లెవ్వరో తెలుపుడు మీర లరిగి 115

జలధి బంధన కార్యము సలిపెనెవఁడొ ?
వానరుల బలవిక్రమ వైభవముల
మీరు వానర బలములో చేరి సర్వ
విషయము లెఱింగి రావలె విస్తృతముగ 116

వానరేశుని నమ్మిన బంటు లెవరొ ?
ప్లవగబలమేడ విడిసెనొ ? వారి యాయు
ధమ్ము లెట్టివొ సౌమిత్రి ధైర్య సాహ
సమ్ములెట్టివొ ? తెలియుఁడు సంగ్రహముగ 117

ఏపుగ వానర రూపులై యిర్వురు
చెలఁగి వాహినిఁ బ్రవేశించినారు
తరువుల శైలకందరముల, వనముల
పర్వతాగ్రమ్ములఁ బర్వియున్న
సేనలెక్కిడ లేక చిక్కులుపడ విభీ
షణుఁడు వారల నిశాచరులటంచు
గుర్తించి రయమున ఘోషించి,పట్టించి
నిలిపి రాముని ముందు ''నీరజాక్ష !
వీరు రావణు చారులు పేరులు శుక
సారణులటంచుఁ దెలుపగ వారిరువురు
ప్రాణముల మీఁద నెంతో నిరాశ తోడ
కరములన్ మోడ్చి మ్రొక్కిరా కలుషమతులు 118

మేము రావణు చారులమే మహాత్మ !
నీ బలము నెంచి రమ్మని నేత పనిచె
నని మనవిసేయ రాముండు నందుపైని
చిఱునగవు తోడ నిట్లు భాషించెఁగరుణ 119

''మా బలమునంత చూచిరే ? మా విషయము
సర్వము నెఱింగితిరె ? మీరు చారులార !
చూడవలసిన దంతయు చూచినారె ?
పూర్తికాకున్న చూచియే పొండుమీరు ! 120

మీ ప్రభువు నియోగించిన మేటి కార్య
మెల్ల నిర్వహించిరె మీర లేరుపడగ
లేనిచో విభీషణుఁడు పూరింప వచ్చి
సాయపడు సకృచ్ఛమ్ముగ చారులార! 121

తొందరపడి మాకు దొరకి పోయితిరని
పీఁచ మడఁగుననెడి బెంగవలదు
ప్రాణభయములేదు-రావణు కార్యము
పూర్తిచేసి మీరు పోవ వచ్చు! 122

దూతలైన వారు దొరకి పోయినఁగత్తు
లిలను బాఅవైవ నెట్టివారు
చంపకూడదనెడి శాస్త్రము కలుగుట
స్వేచ్ఛమెయిని మీరు వెడలవచ్చు! 123

మీరు లంకకు పోయి మీఱేనితో పల్కు
డిటుల నా మాటగా "ఏ బలమ్ము
చూచుకొనుచు నాదు సుదతిని హరియించి
తెచ్చితివో యట్టి తెంపు, బలము
చూపించు రణములో శూరుఁడవైనచో
నీ సైన్య బాంధవ నిచయముఁగొని
నేను రేపుదయమే నీ లంక కేతెంచి
నాశమ్ముఁజేసెద నగరి, పృతన

వాసవుఁడు బిదురము చేత పర్వతముల
పై ప్రయోగించు రీతి నీపై మదీయ
క్రోధమును వీడెదను-చూచుకొనుము నీవ
టంచు వాకొనుఁడో చారులార ! మీరు'' 124

రామునకును జేజేలొ్కొట్టి లంక కరిగి
రంత శుకసారణులుతేని చెంతఁజేరి
మనవి చేసిరి రాముని మాటలన్ని
అక్షరము పొల్లువోకుండ నభినయించి 125

మేము ప్రచ్ఛన్నముగఁబోయి మెల్ల మెల్ల
ప్లవగ పృతనను దిరుగుచు పట్టు వడితి
మయ్య ! మన విభీషణునిచే నతఁడు మమ్ము
రాము మ్రోలను నిలిపె పరాయణుఁడుగ 126

పొలుపుగ రాముఁడున్ విడిచి పుచ్చెను మమ్ము్మల జాలిఁబూనుచున్
నిలువగ రామలక్ష్మణులు నీ సహజుండును వానరేశుఁడున్
పొలిచిరి లోకపాలకులపోలి రహించిరి వీరు నల్వురే
తలఁచిన లంక సర్వమును త్రవ్వి సముద్రములోనఁగల్పరే 127

దాశరథి రూపమును నాయుధములఁజూడ
నఖవురేలను ? రాముఁడే నాశనమ్ము
చేయఁగలుగును మనలంక-సేనఁదేటి
చూడలేరు మహేంద్రుండు సురలు కూడ 128

సేతువును గూడ మేము దర్శించినాము
విరివి నూరామడలు గల్గి వెడలుపు పది
యామడలు గల్గు వారధి యమరి యుండె
దానిపై నుండి వాహిని దాఁటి వచ్చె 129

రాముఁడా సేనతో సముద్రమ్ముఁగడచి
జడధి యుత్తరతటమున విడిసి యుండె
సేన-యుద్ధము నెప్పుడు చేయవలె న
టంచు నువ్విళులూరునో యసురనాథ! 130

కనుక రామునితో యుద్ధకాంక్ష మాని
సీత నాతని కర్పింప క్షేమమగు న
టంచు శుకసారణులు తెల్పిరసురపతికి
వెఱచఱచి వారు వాహిని విస్తృతిఁగని 131

చారులు నట్లు చెప్పగ నిశాచరనాథుఁడు పల్కె తోడనే
నేరమి చేత పల్కెదరు నెమ్మి మదీయ బలంబెఱుంగరే?
తారుచునుండ వానరులు తర్జన భర్జన సేయ భీతితో
కారులు పల్కె రాఘవుని కాంత నొసంగు మటందురే ననున్ 132

వ॥ అనుచు బహుతాలోన్నతంబగు సౌధం బధిరోహించి చూడ్కులకు నక్కజంబగుచున్న సైన్యస్కంధావారముఁబరికించి సారణుంజూచి యివ్వానరులందెవ్వరు బలాధికు, లెవ్వరు సమరోత్సాహముఁగలిగి యుందు, రెవరేకులమువా రెవ్వరెంత బలమ్మున కధిపతు, లెవ్వరు యూథపయూథపు లంతయు నెఱిఁగింపు మన నతఁడిట్లనెను. 133

వాలము వ్రేలవైచుకొని పాదపశాఖ నిషణ్ణుఁడౌచు నా
ఖీల స్వరాన యూథపుల పెక్కురఁ గూడుచు సింహనాదమున్
చాలికతోడ లంకదెస సంఘటితమ్ముగ సేయు నాతఁడే
నీలుఁడు-భానుసూతి ధ్వజినిన్ నడపించెడి యోద్ధ భూవరా ! 134

పర్వతాకారుఁడై పద్మకేసరివర్ణుఁ
డై బాహువులనెత్తి డంబుమీఱ
సారెకు వాలమ్ము సవరించుకొనుచు లాం
గూలరావమ్ము దిక్కులు పిగులగ
లంక దెసకు వచ్చు ప్లవగుండు బలియుఁడం
గదుఁడు వాలి సుతుండు కపులకు యువ
రాజ సముండు పరాక్రమ మందున
తండ్రికి తఁడెసాటి తన యపార
సేనతో నిన్ను గెల్వగఁజెలఁగుచుఁజను
దెంచుచున్నాఁడు-మారుతి తెంపరియయి
యితని యాలోచనము తోడ యింతి సీత
నెమక వచ్చెను లంకకు నింగిమీఁద
కింకరాఖ్యులఁ జంపిన కీశుఁడతఁడె ! 135

కలఁడు బలశాలి యొక్కఁడంగదుని వెనుక
నళుఁడతఁడు సేతువుంగట్టి నాఁడతండె !
సింహనాదముల్ సలుపుచు చెలఁగువారు
చందనాటవి వాసులు సాహసికులు 436

సేతుబంధనమ్ముఁజేసిన మొనగాఁడు
విశ్వకర్మ సుతుఁడు విక్రముండు
నళుఁడు నిల్చి యుండె నక్తంచరాధిపా !
దురమొనర్ప నంగదుని వెనుకను 137

వెండివలె తెల్లగా నుండు వీరుఁడడుగో !
శ్వేతుఁడను వాఁడు మిక్కిలి విక్రముండు
బుద్ధిమంతుఁడు వానర పుంగవుండు
గొప్పవాఁడును ప్రఖ్యాతిఁగొనినవాడు 138

అల్లదిగో ! చూడు మాతఁడు కుముదుఁడు
గోమతీతటిని సంకోచనమను
గిరిపైని కలుగు వానర రాజ్యమేలెడి
వాఁడు-పోటరి-దీర్ఘవాలయుతుఁడు
రణపండితుండును రాజసమందు పం
చాస్య సముండు విశాల నేత్రుఁ
డతని సేనలఁగూడి యాజిలో లంక నా
శము సేయ వచ్చె రాక్షస నృపాల !
చూడు మాతఁడు రంభుఁడు వాఁడు వింధ్య
శైలమున కృష్ణగిరి మీఁద సహ్యా పర్వ
తమ్ముపై సుదర్శన పర్వతమ్ము పైన
వాస మొనరించు కపులకు ప్రభువతండు 139

ఇమ్మొగా లంక తాను నాశమ్ము సేయ
రంభుఁడరుదెంచె చూడుము రణమొనర్ప
లెక్కలేనంత సేనతో పిక్కటిలుచు
వీరుఁడాతండు నెనలేని శూరుఁడతఁడు 140

చెవులు రిక్కించుచు చీటికి మాటికి
ఆవులించుచు నున్న నతనిఁజూడు
శరభుఁడాతని పేరు మరణమన్నను గూడ
భయములే దతనికి-వాని యదుపు
నందు నల్వది లక్ష లగచరవీరు లు
న్నారు నిశాచరనా థ! వాఁడు
వచ్చెను-ప్లవగుల వాసవుఁడటులున్న
వీరుఁడు పనసుఁడు భేరి రవము
పగిది శబ్దించు నాతని భాషణమ్ము
వాఁడు పారియాత్ర ధరముపై వసించు
నాతఁడేబది లక్షల యగచరులకు
ప్రభు విజేయుఁడు రణముల రాక్షసేంద్ర! 141

అతనిఁ జూడుము - వినతుఁడు అతనియదుపు
లోన నరువది లక్షల వానరగణ
ముండె పర్ణాసనది తటభూమి నిలుచు
నతని పృతనకు నడ్డులే దాజులందు 142

కాంచు మాతఁడు గవయుఁడు కండబలము
కలఁడు గైరిక వర్ణముకల శరీరుఁ
డాతఁడెంతొ తేజశ్శాలి అలుకఁబూని
వచ్చె డెబ్బది లక్షల ప్లవగులఁ గొని 143

కామరూప ధరులు కపులు డెబ్బది లక్ష
లని నజేయులైన నగచరులను
గూడివచ్చెఁ జూడు కొండచాడ్పుననున్న
వాఁడు గవయుఁడన్నవాఁడు కంటె! 144

వానరయోధు లసాధ్యులు
దానవప్రభు! కామరూపధరులందఱు, దు
ర్మానులు ఘోరము లెన్నిటి
నైనను గావించువారె వ్యగ్రత తోడన్ 145

గజుఁడు. గవాక్షుఁడు, గవయుఁడు, నీలుఁడు
నళుఁడు వీరంత వానరప్రముఖులు
వీరి కొక్కొక్కరి చేరికలో పది
కోటుల యోధులు పోటుమగలు
కలరు శ్రీరామునికై ప్రాణములువీడ
పంసిద్ధులుగ నుండు సాహసికులు
ఒకరిప్రక్కను నొక్కరున్నారు చూచితే!
మైందుఁడు ద్వివిధ నామములవారు

ఆ మహావీర ద్వితయము నజుని కరుణ
నమృతపానముఁ గావించినట్టి ఘనులు
రణములం దసమానులు లంకనేల
మట్ట మొనరింప వచ్చిన బెట్టిదులును 146

అటుచూడు మదహస్తి యటులున్న వానరు
నతని గుర్తించితే! హనుమ అతఁడు
వాఁడు కోపించిన వనధినే కలఁచివై
చును జనకజమును చూచి, వనము
భగ్నము కావించి భాషించి నీ తోడ
వెడలినవాడు హంవీరుఁడు సుమి
హనుమంతుఁడనెడి విఖ్యాత నామము వాఁడు
కామరూపుండు విక్రమము లోన
మూఁడు జగముల నెవ్వరు నీడు కారు
జనన కాలమునందె సూర్యుని ఫలమని
యెంచి, తినఁబోయినప్పుడా యింద్రువజ్ర
ఘాతమున పొద్పుమలమీఁదఁ గంది పడెను 147

బిదురమున దౌడ పగులగ పేరు వచ్చె
నాతనికి హనుమంతుఁడటంచు, నతని
బలము, రూపము, కాంతి ప్రభావమింత
యనుచుఁబల్కఁగ నెవ్వరి కలవికాదు 148

తారుఁడు, గంధమాదనుఁడు, సుషేణుఁడు
శతవలి, హరుఁడు, కేసరి ప్రముఖులు
వానర బలములో ప్రఖ్యాతులందఱు
తమ తమ పృతనలు దశరథసుతు
సాయము సేయుటే ధ్యేయమ్ముగా వచ్చి
యుండిరి శౌర్యము మెండుకొనగ
ఈ దెస చూడుము ఋక్షవీరుల యందు
జాంబవంతుఁడు కడు సాహసికుఁడు

అంజనాద్రులకై వడి నసిత జలద
పాళి తెఱఁగున భల్లూక ప్రకరమెంత
భీకరమ్ముగ నుండెనో వెఱపు కలుగు
వాటి సంఖ్య యపారము సాటిలేదు ! 149

భల్లుకమ్ములు కొండల వనములందు
వాహినీ తీరముల నుండి ప్రధనమునకు
సిద్ధమై వచ్చి యుండెను సింధువు వలె
విఱిగి పడుచు నీ మీదకు విస్తృతముగ 150

జాంబవంతుఁడు మిన్న ఋక్షప్రముఖుల-
మిగుల వృద్ధుఁడు, బలశాలి, మేటియెంతొ
పెద్దవారిని సతము సేవించునతఁడు
ఆజులందు నసాధ్యుఁడు ననఘుఁడగును 151

దేవదానవ రణముల దేవవిభున
కెంతొ సాయము నొనరించి, యెన్నొ వరము
లతఁడు పడసెను అనుచరు లగ్నిసములు
చావుకైనను జంకని ధీవరుండు 152

జలదముల మధ్య నింద్రునివలెను భల్లు
కముల నడుమను ధూమ్రుఁడు కలఁడు, నర్మ
దానదీ తోయములఁ ద్రావు ధ్వజినికి నధి
పతి యధివసించుఁదా ఋష్యవంతగిరిని 153

అతని దగ్గరగానుండె నవనిధరము
మాఢ్కి మటియొక భల్లూకమల్లుఁడతఁడు
ధూమ్రునకు నన్న జాంబవంతుండు-నేక
రూపధరు లిద్దఱును హెచ్చులొచ్చులేదు 154

వృక్షపాషాణహస్తులై వేయికోట్ల
ప్లవగవీరులు హరుడను వాని నాయ
కత్వమున వచ్చినారు లంకాపురమ్ము
ధ్వంస మొనరించు తలపుతో దనుజనేత ! 155

అదిగో : యెగురగ సిద్ధమౌనతఁడు బలుఁడు
ప్లవగవీరుల ప్రఖ్యాతిఁ బడసె నెంతొ
జంభభేదికి నొకసారి సమరమందు
సాయమొనరించె నెంతయో జయము కలుగ 156

అడుగు లామడదూరాన పడును నడవ
నతఁడు పొడవరి - చూచితివా నరేంద్ర !
పరఁగఁదద్రూపమే చతుష్పాత్తులందుఁ
గనఁబడదు-వానికొకనికె కలుగునద్ది 157

తామసుఁడు ప్లవగులకు పితామహుండు
అతఁడు సన్నాదుఁడను పేర నామతిల్ల
పిలుతు-రొకసారి మఘవుతోఁ గలియఁబడగ
నోడిపోయెను దేవేంద్రుఁడూర్జితునకు 158

అదిగో ! క్రోధనుఁడను నగచరసేనాని
వహ్నికి గంధర్వ వనితకు నుద
యించిన వాఁడు దేవేంద్రుని కంటెను
బలశాలి యొకసారి వాసవునకు
సాయమ్ముఁజేసె-వైశ్రవణుపాలిత హిమ
గిరిపైని నివసించు కీశసేన
దశకోటి వీరులఁ దనవెంటఁ దోడ్కొని
వచ్చెను లంకను బట్టుకొనగ
అదిగో ! యటుప్రక్క చూడుమో అసురనాథ !
హనుమ జనకుఁడు కేసరి యనెడి వాఁడు
శంబసాదనదానవు సంహరించె
నతఁడు తన పరాక్రమముచే ప్రతినఁబూని 159

వసియించు కేసరి వానర వీరుఁడు
మేరుపర్వతముపై మేటరిగను
అట సర్వఫలములు నధికముగా నుండు
కలవు నానావృక్షగణము లచట
పక్షులు, మృగములు, పాదపమ్ములు గూడ
కాంచన మయములే కాంచనగిరు
లరువది వేలుండె-నసురుల మధ్య నీ
వుండిన పగిదిగ నుండు మేరు
పర్వతము-వానరులఁజూడు వారిలోన
కొందఱి మొగమ్ము లెఱ్ఱగ, కొందఱి వద
నములు తెల్లగ, కపిల వర్ణముగ నుండె
దంష్ట్రలు నఖమ్ములే యాయుధమ్ములగును 160

వారు పులులట్లు సింహముల్ పగిది కడు భ
యంకరులు-ఘోర కర్ములు, నగ్నుల వలె
కాలసర్పమ్ములటు, మత్తకరుల వోలె
నిలిచెదరు వారు-పింగళ నేత్రులంత 161

వారు నిలుతురు కాంచన పర్వతముల
పైని శతవలి నాయకత్వమున లంక
నాశన మొనర్ప వచ్చిరి నట్టుకొనుచు
కడు పరాక్రమవంతులా కపులు రాజ ! 162

పవనధూత జీమూతము వలెను సేన
ముందునకుఁ జొచ్చుకొనివచ్చు భూమిధర స
మాన వానర వీరుని దానవేంద్ర :
కాంచితివె - ప్రమాథియను మర్కట విభుండు 163

వింధ్యపర్వతవాసులు వీరులంత
బలపరాక్రమవంతులు ప్రధనములను
నేర్పుఁగలవారు-దానవనేత ! వార
లంతకూడ మహాకాయు లగుదురుసుమి. 164

సారణుడటు పల్కి యూరుకొన శుకుండుఁ
దానందుకొని పల్కె దానవేంద్ర !
తుహినాద్రిపై సాలద్రుమముల చందాస
బలిసిన నా యోధవరులఁ జూడు
వారు దుర్జయులు దుర్వారులు బలమున
కామరూపులును రాక్షసులతోడ
సరిపోలు వారును సంగ్రామమున సుప
ర్వుల వోలె విక్రమ స్ఫురణనుందు
రట్టి ప్లవగవీరులు నసంఖ్యాకముగను
వచ్చి యుండిరి సుగ్రీవ వానరేశు
నకును నమ్మిన బంటులు-నసుగుకాదు ?
వారు కిష్కింధవాసులే పనిగొనెదరు 465

ద్వివిదమైందుల ప్రక్కను దిటవరులగు
వారు మృత్యుదేవతకు కుమారులైన
సుముఖ దుర్ముఖ నాములు-చూచినావె?
వారు దశకోటి బలముతో వచ్చిరి ప్రభు! 166

కనుగొంటె! నీలమేఘశ్యాముఁడిక్ష్వాకు
రాజుల శూరుఁడు రామవిభుఁడు
అతఁడు జగత్త్రితయంబునఁ బ్రఖ్యాతి
నందిన వీరుఁడు నసఘుఁడెంతొ

ధర్మము తప్పని దాక్షిణ్యుఁడాతఁడు
నిఖిల వేదాంగముల్ నేర్చి, వేద
వేత్తయై చెలువారు విజ్ఞానవంతుఁడు
బాణమ్ము వేసిన బ్రద్దలౌను

విన్ను, భూధరములు పిండిగుండ యగును
అతని క్రోధము మృత్యు వలిగినటులె
విక్రమమ్మున సరిపోలు శక్రు తోడ
అతని భార్యను సీతనే యసురనాథ!
ఎత్తుకొని వచ్చినావు-కోపించి యిటకు
వచ్చె నినుఁగూల్చుటకు నేఁడ కచ్చుకొనుచు 167

అతనికి కుడి ప్రక్క నపరంజి ఛాయతో
కనిపించువాఁడు లక్ష్మణుఁడనుజుఁడు
అతఁడు బహిఃప్రాణమన్నకు విపుల వ
క్షస్కుఁడు-కడు బలశాలి, రాజ

నీతిలో, సంగర నిగ్రహ మందున
కుశలుఁడు, శాస్త్రముల్ క్షుణ్ణముగను
చదివిన వాఁడు విచక్షణఁగలవాఁడు
కోపియు రాముని కోసమతఁడు
విడిచిపెట్టును స్వీయ జీవితమునైన
దుర్జయుఁడు, బుద్ధిమంతుఁడు, దూరదృష్టిఁ
గలుగువాఁడు, తానొకఁడె రాక్షసుల నెల్ల
సంహరించుకాంక్షను గల్గు సాహసికుఁడు 168

రాముని వామపార్శ్వమ్మున నెలకొని
నలువురు దనుజులఁగలిసియున్న
వ్యక్తి విభీషణుఁడసురేశ్వరా ? చూడు
మాతని పోల్చుము భ్రాఁతి మిగుల
రాముఁడు నీ భ్రాత లంకకు పట్టాభి
షిక్తుఁగావించి నియుక్తుఁజేసె
నినుఁ గూలఁద్రోయగ నిశ్చయం బొనరించె
నీ తమ్ముఁడిప్పుడు నీతిఁదప్పి
వారిమధ్యను పర్వతప్రాయునిగను
నిలుచువాఁడు సుగ్రీవుఁడు నిర్జరారి !
అతఁడు సర్వ వానరసేన కధిపతిసుమి
వాఁడు కిష్కింధ నేలుచున్నాఁడు నేఁడు 169

జ్ఞానమునఁ దేజమున, బుద్ధిలోన, నాభి
జాత్యమందున బ్లవగుల చదురులాడు
అతని మెడలోన బంగారు హారముండె
సకల సంపద దానిలో సంతరించు 170

అది ధరించిన వానికి నపజయమ్మ
కలుగ దెన్నడా హారము కపులరాజ్య
మతని కొసఁగెను రాముండు నగ్రజుఁడగు
వాలిఁ జంపి మైత్రికి నానవాలు సరణి 171

భానుసూతి యసంఖ్యాక ప్లవగసేన
తోడ నల్వురు దనుజులఁగూడి నీ స
హోదరుఁడు వెంటరా లంకమీఁదికిపుడు
వచ్చుచున్నాఁడు వాస్తవ వార్త యిద్ది 172

ఏమి చేసిన మనకిప్డు క్షేమమగునొ
వైరులకుఁ బరాజయ మెటువచ్చునొయది
చేయవలెను మహారాజ! చిత్తగింపు
మిదియె నేఁడున్న సంగతి - పదిలపడుము 173

శుక సారణు లప్పగిదిగ
ప్రకటింపఁగఁ దమభయమ్మ-రావణనృపుఁడున్
చకితుండై కపిసేనను
నికాయ్యంబునుండి తాను నిర్వర్ణించెన్ 174

రాముని, సహజు, విభీషణు,
సౌమిత్రిని, భానుసూతి సందర్శింపం
గా మదిలో భీతిల్లుచు
దారుణముగఁ బ్రలాపించెఁ దన వేగులతో 175

నిగ్రహానుగ్రహ నిభృత పార్థివునకు
వేగు లిప్పగిది యప్రియములైన
వార్తలందించుట ప్రల్లదమే సుమి
అజిఁ బ్రారంభించు నవసరమున
మీరిద్దఱును మనమీఁదికి దండెత్తి
వచ్చిన వైరులఁ బ్రస్తుతింపఁ
దగదు - విప్రులకుఁ పెద్దలకుఁ గావించిన
శుశ్రూష సర్వము శుష్కమగును
ప్రీతి నూరిపోసిన రాజనీతి సుంత
అంటలేదు మీకేమియు - దంటుకొనిరి
మిమ్మువంటి మూర్ఖుల సేవనమ్ముకలిగి
బ్రదికియుంటి నదృష్టమ్ము వలననేను 176

నేను నోరువిప్పి నిగదింప నెదిరికి
శుభ, మశుభమొ తెలియుఁ జుంబితముగ
అట్టి నా యెదుటనె నిట్టు భాషింపగ
నింత భయములేదె ? ఏమిచూచి ? 177

కారుచిచ్చు ముట్టి కాననమ్మున చెట్టు
బ్రదికి యుండవచ్చు వహ్నియార
బ్రదుకఁ గలరె యెందు రాజాగ్రహామునకు
పాత్రులైన వారు పందలార ! 178

వైరిగణము మీరు ప్రస్తుతించుటఁ బట్టి
సంహరింపఁ గలను చారులార !
కాని యింతవఱకు ఘనకార్యములుచేసి
నందువలన విడువనయ్యె మిమ్మ 179

కనికరించితి నా సమక్షమ్మునుండి
పొండి ! మీరు కృతఘ్నులు, భూమికాంద్రు
స్నేహమున కిచ్చగింపని చెనఁటులనుచుఁ
దెలిసిపోయెను కావున తొలఁగిపొండు 180

ఇదియె మరణమ్మ మీకని యెంచి పొండ
టంచు పరుషోక్తులాడగ నసుర విభుఁడు
సిగ్గుపడి శుకసారణుల్ జేజెలొసఁగి
వీడి రచ్చోటు ప్రభువును వీడుకొనుచు 181

అపుడు రాజు మహోదరుఁడనెడి వాని
పిలిచి నీతిశారదులగు వేగుల మఱి
కొందఱను బంపుమని చెప్ప గూఢచారు
లరుగుదెంచి భూపతికి జయమ్మ పలుక 182

రాముఁడు సువేల పర్వత ప్రాంతమందు
నెలకొనగ వేగులేఁగి యున్నిద్రులగుచు
గూఢ చర్యలఁ గావించుకొనుచును దను
కార్యమును జక్కపెట్టగఁగదలఁబోవ 183

చారులు వచ్చి నిల్వఁగ నిశాచరనేత వచించె వారితో
మీరలు పోయి రాముని ప్రమేయము, యత్నము లెట్టివో మఱిన్
తీరులు తెన్నులెట్టివొకొ తెప్పున మీరు గ్రహించి రావలెన్
చారుల వల్లనే ప్రభువు శత్రుల పైని జయమ్ముఁగాంచెడిన్ 184

రాముఁడెపుడు నిద్రించునొ
రాముఁడెపుడు మేలుకొనునొ రాముని యత్నం
బేమియొ, బలమెంతయొ మీ
రామృష్టముగా నెఱింగి యరుదేరుఁడొగిన్ 185

జాలము సేయ కుండగను చారులు వైళమ పోయిరంత శా
ర్దూలుని నాయకత్వమునఁ దూకొని భీకరకీశవాహినిన్
చాలిక ఛద్మవేషులయి సాగి నిదానముగా రఘూద్వహున్
శీలుని లక్ష్మణున్ రవిజు, సేన, విభీషణుఁగాంచి రయ్యెడన్ 186

కాని వేగు లపారమౌ కపిపృతనను
పాఱఁజూడగనే భయభ్రాంతులైరి
ఇంతలో విభీషణుఁడు గుర్తించె వారి
రోసె వారిలో పాపి శార్దూలుఁడనుచు 187

వాని నాతఁడు కపులకుఁబట్టి యిచ్చె
వానరులు వాని తక్కిన వారిఁబెక్కు
విధములుగ బాధ పెట్టిరి విభుఁడు రాముఁ
డపుడు కరుణించి విడిచెఁ దా నక్కజముగ 188

బ్రదుకు జీవుడా: యనుచును లంకకేఁగి
జరిగినది నివేదింప రాక్షస విభుండు
వెఱపునందుచు శార్దూల ప్రేష్యునిఁగని
మంచిగా వాని నిట్లు ప్రశ్నించె నపుడు 189

ఏల శార్దూల! నీ మొగమిపుడు వ్రేలఁ
బడుచు నుండె దీనముగఁ గన్పట్టె దీవు ?
వైరులేమైనఁజేసిరా ? విన్నఁదనము
నకును గారణమేమి కీనాశ ! తెలుపు 190

దాని కాతఁడు పల్కె ''దానవ రాజేంద్ర !
వానరవీరుల వైన మెఱుఁగ
నెంతటి చారులకేని సాధ్యము కాదు
కడిమిఁగల్గిన పరాక్రములు సర్వ
లగచరులకు రాముఁడండగా నున్నాఁడు
పలుకుట కష్టమౌ వారితోడ
నింక ప్రశ్నలు వేసి యెల్ల సంగతుల నె
ఱుంగుట యెట్టుల ? త్రోవలన్ని

పర్వతాభులు వానరుల్ భద్రముగను
గాయు చుండిరి మేమెల్లఁగపి పృతనను
మాఱువేషమ్ములను జొరబారుచుండ
దొరికి పోయితి మట్టులే దురదుర ప్రభు ! 191

మన విభీషణు ననుచరుల్ మమ్ము పట్టి
వంచకులటంచు నెంతో పీడించినారు
ప్లవగులకు నప్పగింపగ లావు మిగుల
వారు మోఁకాళ్లఁబొడిచిరి దారుణముగ 192

గోళ్లతో రక్కివైచిరి పళ్లతోడ
పీఁకివైచిరి, చఱచి, చపేటములను
పిడికిళులగ్రుద్ది త్రిప్పిరి పృతన నంత
నేను మూర్ఛిల్లు స్థితినుంటి నీరసపడి 192

ప్లవగులంతట నిల్పగ రామునెదుట
దీనముగఁగేలుమోడ్చి ప్రార్థింప నతఁడు
కరుణతో విడిపించె రాక్షస నృపాల !
కాన మేమిప్పుడిటకు రాఁగలిగినాము 194

రాముఁడు శిలల సంద్రమ్మును బూడ్పించి
వానరసేనతో వచ్చి నగర
ద్వారములో నిల్చె-ప్లవగులు వైనతే
యవ్యూహమును బన్ని యనియొనర్చు

వ్యాసక్తిమై లంక నాక్రమింపగ సిద్ధ
మై యుండి ప్రాకారమధిగమింతు
రది తప్ప దసురనాథా ! సీత నిచ్చుట
యో యాహవము సేయ సుత్సహింతు
వో యొకటి నిశ్చయింపుము వ్యష్టిఁదలఁచి
జాగుచేయకుమనుచు నాచారుఁడసుర
పతికిఁబలుకగ నంత రావణుఁడు వేగ
మదినిఁజింతించి నుడివెను మరలఁబడుచు 195

అమరగంధర్వదానవయక్షనాగ
గరుడ కిన్నర గణములు కలనులోన
నన్ను నిర్జింపఁజాలరటన్న సీత
నేల రాముని కెటు సమర్పింపగలను ? 196

లోకమంతయు నాపైకి రూక్షితముగ
కలిసి దండెత్తి వచ్చిన కాని నేను
భయపడను సుంతయైన రావణుఁడ ! సీత
నెటుల విడుతును ? రాముని కీయగలనె ? 197

ఐనను చూచినాఁడవుకదా ! ప్రణిధీ ! నిగదింపుమునాకు నా
వానరసేనలో నెవరు ప్రాజ్ఞులు. శూరులు, దుర్జయుల్ మహా
సేనులు - వారి తేజము వచింపుము-వారల తంత్రులెవ్వరో
వైనము లన్నియున్ దెలుప వారి బలా బలముల్ గణింతునేన్ 198

ఆజి యొనరించుటకు మున్నె యరిబలమ్ము
తెలియగావలెఁ గావున-దెలుపు మన్ని
వివరములు నాకు వానర పృతనగూర్చి
యనుచుఁ బ్రశ్నింప శార్దూలుఁ డనియెనిట్లు 199

సుగ్రీవుఁడన వాలిసోదరుఁడును. ఋక్ష
రజుని కుమారుఁడు-ప్లవగనేత
ధూమ్రుఁడు. జాంబవంతుండును గద్గదు
సుతులు భల్లూక వంశ్యులు మహేచ్ఛ!
గీష్పతి పుత్త్రుడు కేసరి-వరుణుని
కొడుకు సుషేణుఁడు కడు సమర్థుఁ
డును ధర్మచింతతోఁ దనరును నిత్యము
దధిముఖుం డబ్జుని తనయుఁడగును
సుముఖ, దుర్ముఖ, వేగదర్శులును మృత్యు
రూపులగుదురు-నీలుఁడు లోహితాస్య
నందనుండు సేనాని వానర పృతనకు
మాతరిశ్వాత్మజుఁడు హనుమంతుఁడుసుమి! 200

దుర్జయుండగు నంగదుండు దేవేంద్రుని
మనుమఁడు, ద్వివిదుఁడు మైందుఁడనెడి
వారశ్వినీ సుపర్వాణుల నందనుల్
గంధమాదనుఁడును, గజ, గవాక్ష

శరభులు, గవయుఁడు శమను తనూజులు
జముఁ బోలియుందు రచ్చముగవారు
దశకోటి వానరుల్ దశరథనందను
సైన్యములోనున్న శౌర్యధనులు
ఎప్పుడెప్పుడాయని యని కెదురుచూచు
చుండిరందఱు విబుధుల సుతులె వారి
సంగతులఁ జెప్పనేరికి సాధ్యమగును
రాముఁడు మృగేంద్రములఁ జంపులావరిసుమి 201

ఖరుని, దూషణునిఁ ద్రిశిరునిఁగబంధు, వి
రాధుల జంపిన రాజతండు
ఆ జనస్థానమునందుండు దనుజులఁ
గసిమసంగిన పరాక్రముఁడతండు
అతని తమ్ముండైన నా లక్ష్మణుఁడు మత్త
వేదండమును మించు వీరుఁడగును
లక్ష్మణు బాణమార్గమ్ములో పడ్డవాఁ
డెవఁడును బ్రదుకలేఁడీల్లు గాని
జ్యోతిర్ముఖుండును శ్వేతుఁడు సూర్యుని
సూనులు వసుపుత్త్రుఁడైన దుర్ధ
రుండు, సోదరుఁడు విభీషణుండు కలఁడు
మంత్రి సహితుండుగా నట-మనుజవిభుఁడు
చెలఁగి లంకకు పట్టాభిషిక్తుఁజేసె
నందుచే రామునకు సహాయ్యమ్ము సలుపు 202

నళుఁడు మయసుతుఁడు నాగర్యమున సేతు
బంధనమ్ముఁజేసె వానరులను
వార్ధి దాటుటకు నుపాయమేర్పరచెను
చండవిక్రముఁడును సాహసికుఁడు 203

ఆ సువేలధరమునందు వానరసేన
నిలిచి యుండెను నాజిసలుప రాజ!
కొదవ కార్యమ్మంతఁగూర్పఁగ నీ చేతి
లోన నుండెను జాగరూకుఁడగుము 204

ఆకర్ణించి దశాస్యుఁడు
సాకల్యముగా బిఱాన శార్దూలునికిన్
గాఁక పడుచు సెలవిచ్చెను
తేకువ మంత్రులకు వార్త తెప్పున బంపెన్ 205

ఆతఁడు సంభ్రాంతుండై
కాతర్యము తోడ మనసు కళకళ పడగా
వాతమున దీపవర్తిక
రీతిఁజలించుచును దిక్కరేగుచు నుండన్ 206

మంత్రులు వచ్చిరి తోడ్తో
మంత్రాంగముఁజేసి సచివ మండలితోడన్
తంత్ర మొనర్చుచు వేగ ని
యంత్రితముంజేసె మాయలాని కొఱకుఁదాన్ 207

వచ్చెను విద్యుజ్జిహ్వుఁడు
కుచ్చితుండు, కుట్రలకును, కూహకములకున్
మచ్చరిగా చరియించును
పచ్చరించు జేని యాజ్ఞ పరిపాలించున్ 208

శరములు, విల్లును, మాయా
శిరమొకదాని సృష్టిఁజేసి రమ్మొగిన్
ధరణీతనయకుఁజూపుచు
మరణించెను రాముఁడనుచు మఱిపెట్టెదనేన్ 209

అని పనిచి దానవేంద్రుఁడు
మణిభూషణమతనికొసఁగి మన్నించె వెసన్
జనకజ వంచన సేయగఁ
జనె భూవుఁడశోకవనికిఁ జపలత హెచ్చన్ 210

అవనిపైఁ గూరుచుండి దీనాస్య యగుచు
పతిపరాయణచిత్త బాష్పములు కనుల
జాఱుచుండ శోకించెడి జనకపుత్త్రి
ఘోరరాక్షసీ పరివృత కుమతిఁ గాంచె 211

వింటివె నాదు మాటలను వెఱ్ఱిగ నుండుచు నేఁడు నీ విభున్
గెంటరియైన మా ఖరుని గెల్చిన వానిని యుద్ధభూమిలో
గెంటటువడంగనేఁగెడపి కేరుచు నుంటిని వైరినాశమున్
దంటగఁజేసి యాదరువుఁదగ్గునటుల్ పొలయించి భామినీ ! 212

నీ యాధారముఁగొట్టివైచి మఱియున్ నీ గర్వముం బాపి నా
ధ్యేయమ్మున్ నెఱవేర్పఁగల్గితిని వైదేహీ ! యిఁకన్ దుఃఖమే
లా ! యానందము తోడ నన్నుఁబతిగా రాగిల్లి హర్షమ్ముతో
చేయంగా వలె నన్ గృతార్థునిగ నో సీతా ! ప్రియంబారగన్ 213

సుఖపడుము నాకు పత్నివై సుదతి ! విడుము
నీదు మూర్ఖత్వమును-మరణించినట్టి
వానితోనేమి యింక? నా భార్యలకును
నీవు యజమానురాలవై నెగడగలవు 214

తెలివి తక్కువ దాన ! తెలిపెద నీ ధవుఁ
డెటు మరణించెనో-దిటవరి పతి
సుగ్రీవు సేనతో వ్యగ్రమ్ముగా నన్నుఁ
జంపగా వచ్చెను జలధి దాఁటి
కడలి తీరమ్మున విడిసెను-సేన మా
ర్గాయాసమున నెంతొ గాఢనిద్ర
లోనుండు తఱిని చారులఁబంపి సంగతిఁ
దెలిసి ప్రహస్తుని ధీరు గొప్ప
సేనతో పంప నాతఁడు చెలఁగి సర్వ
ప్లవగ సైన్యముఁబొలియించి రాము శిరము
నుత్తరించెను-సౌమిత్రి చిత్తగించెఁ
బరుగు-రవిజుని కంఠమ్ము నఱకఁబడెను 215

హనుమంతునకు దౌడఁజెనకి యాడగ దీర్ఘ
నిద్రలో నుండెను నీరుగాఱి
ఎగిరిపోవంగ యత్నించుచు మా విభీ
షణుఁడు దొరకిపోయె శక్తి తూలి
జాంబవంతుం డాకసమున కెగురఁబోవ
చరణముల్ ఖండింప చచ్చెనతఁడు
ద్వివిదుఁడు, మైందుఁడు దెబ్బలుతిని చావ
సిద్ధమై యుండిరి శిక్షితులయి
విడిచె నూపిరి కుముదుఁడు విశిఖములను
దనుజులందఱు కూల్చిరి తాల్మిఁదూలి
పవనుఁడును నేలపైఁబడె పాము పగిది
ఇటుల వానరులందఱు నీల్గిరి సుమి 216

కొందఱు పాఱిపోవ మఱి కొందఱు సాగరమందు దూఁకఁగా
కొందఱు మింటిపై కెగుర కొందఱు శీర్షము లూడిపోవ ని
ట్లందఱు నన్ని రీతులుగ వ్యాపకులై చెదరంగ నీ ధవుం
డుం దలఁ గోలుపోయె నిటు డుల్లిరి వానరఋక్షయోధులున్ 217

ఎచ్చటఁజూచిన శవములె
ఎచ్చటఁగాంచినను రక్తమే పద్మాక్షీ !
కచ్చియలో మీ ప్లవగుల
మచ్చుమాపఁగడలి తటము మలినంబయ్యెన్ 218

ఇదిగో ! నీ పతి శీర్షమియ్యెడకు చూపింపంగ రప్పించితిన్
ముదితా ! చూడుమటంచు రావణుఁడు డంబున్ బల్కి పుత్తెంచెఁదా
నుదుటుంజూపుచు వేగరమ్మనుచు విద్యుజ్జిహ్వునచ్చోటికిన్
కొదుకంజేయ విదేహరాజసుత యాకూతమ్ము భగ్నమ్ముఁగాన్ 219

ఈ విద్యుజ్జిహ్వుండే
నీ వల్లభు శిరముఁదెచ్చెనేఁబనుపగ నీ
కావిష్కరణ మొనర్పగ
నోవెలఁదీ ! చూడు మిద్ది యుగ్గవట్టుచున్ 220

రాముని శీర్షము నీవీ
భామ ముందు నిలుప నీమె పతి చివరి గతిన్
తేమగిలు కనులఁజూచును
వేమఱునని పనిచె తేఁడు విద్యుజ్జిహ్వున్ 221

దనుజుఁడటు చేసి ప్రక్కకుఁ దప్పుకొనగ
రావణుఁడు ధనుర్బాణముల్ రయతఁజూపి
మా ప్రహస్తుఁడు రణభూమి మల్లడి గొని
తెచ్చె పరికించుమీ వీని పిచ్చిదాన ! 222

తన పతి మాయా శిరమును
ధనువును, బాణములఁగాంచి తథ్యముగా రా
మునకును జెందిన వనుచును
తన మనమున నమ్మి సీత తత్తఱపడియెన్ 223

హనుమంతుఁడు రవిజుండును
తన పతికిన్ చెలిమిఁగూర్చు ధన్యులటంచున్
మనమున నెంచుచుఁ దచ్ఛిర
మనుమానము లేదు ధవునిదని దుఃఖించెన్ 224

నీ కోర్కెనెఱవేఱె కైక ! వంశమునకు
నానంద కారకుండైన సుతుఁడు
హతుఁడయ్యె కలహశీలా ! కులమంతయు
నీ వల్ల నాశమై నీరుఁగాఱె
వల్కలధారిగా వనముల కంపితి
వతఁడు కావించిన యపకృతి యెది
యో తెల్పుమనుచుఁ దానుత్కంపమున మొదల్
నఱకిన కదళియై ధరణిఁబడియె
కాని త్వరలోనె తేఱి దుఃఖమున శిరము
మూరుకొనుచు మహాబాహు ! ముగిసె నీదు
జీవితము-వితంతువు నైతి-నీవు ముందు
చచ్చిపోవుట పత్ని దోషమునఁగాదె? 225

ధీరుఁడవును సదాచార సంపన్నుఁడ
వౌదువు శ్రీరామ ! అటులె నేను
సాధుశీలను మఱి సంస్థితి యిట్టుల
సంభవించిన దేల ? చాన నేను

ప్రబదికి యుండగ నాదు పతికేల ముందుగ
మరణము వచ్చుట మాన్యమగునె ?
దుఃఖము మీఁదను దుఃఖము వచ్చినన్
ముంచెను శోకసముద్రమందు
మునిఁగిపోయిన నన్నుద్ధరణము సేయు
వాఁడెవఁడు చెప్పుమా ! ప్రియశ్వశ్రువిపుడు
లేగదూడ చచ్చిన గోవు లీలనగును
కాదె? నీ మృతి వార్తకు కదలిపోయి 226

నిన్ను దీర్ఘాయు వనుచును నిర్ణయించు
జ్యోతిషికుల వాక్యమ్ము లసత్యమగునె ?
అటుల కాదేని మరణించుటెటుల నీవు
కాలము విరుద్ధమై పోయె బేలుపడుచు 227

నీతిశాస్త్ర వేత్తవు కావె-నీవు వ్యసన
ములకుఁదగ్గ యుపాయముల్ తెలిసినట్టి
వాఁడవై వాని తొలఁగించు బలము, శక్తి
యుక్తులంగల్గు వాఁడవు యోద్ధవుగద! 228

అట్టి వాఁడవై యుండి మహత్తుఁగలిగి
యేల యీ రీతి మృత్యువు పాలఁబడితి?
రౌద్రమైనట్టి యా కాళరాత్రి మనకుఁ
జేసె నెడబంధములు ఛ్రమందఁజేసి నిన్ను 229

నను విడిచి ప్రియురాలి చందమున ధరణిఁ
గౌఁగిలించుక శయనింపగా నుచితమె ?
గంధమాలసమర్చిత కార్ముకమిద ?
కలసికొంటివి జనకు స్వర్గమ్మునందు 230

విపుల కర్మలను గావించిన నీ పూర్వు
లకు ప్రీతిపాత్రము, సుకృతమైన
నిక్ష్వాకు కులమున కింపుగా తారవై
గగనసీమను నిల్చి కనుచునుంటె ?
బాల్యమాదిగ నీకు భార్యనై నెచ్చెలి
నై యున్న ననుఁ జూడవా ? పలుకవ ?
నా కరగ్రహణము నాథ ! చేయుచు దీక్ష
పట్టి "నాతి చరామి" పల్కు కతన
నన్ను నీవెంటఁ గొనిపొమ్ము - నన్నువిడిచి
మృతిని బొందితివేల స్వామీ ! శరీర
మిపుడు దనుజుల పాల్జేసి కృపణుఁడవయి
అగ్ని సంస్కారమేలేక యరిగినావె ? 231

పెక్కు యజ్ఞముల్ నీవు కావించి గొప్ప
గొప్ప దక్షిణ లొసఁగుచు కూడఁబెట్టి
నట్టి పుణ్యము లేమయ్యె ననఘ ! యిటు క
థావశేషుఁడ వైతివా ? నీవు నాథ ! 232

దీక్ష ముగ్గుర మడవికేతెంచి యందు
లక్ష్మణుం డొక్కఁడే పోవ రాముఁడేడి ?
సీతయెక్కఁడ ? ననుచు ప్రశ్నింప దొక్కా ?
జనని కౌసల్య - సహజుఁడు వినుచును కథ ! 233

అతివ కతమున నీవు మహానుభావ !
సాగరము దాఁటి కడకు గోష్పాద మాత్ర
మునకు నాపన్నుఁడై పోతి - జనకపుత్రిఁ
బరిణయంబాడినావు విపత్తెఱుఁగక- 234

నిద్రలో నీవు నిటు మరణింప, నేను
రాక్షసుల చేతిలో పడు రగడ వినిన
అత్త కౌసల్య గుండియలాఁగి చచ్చు
నా కతమ్మున జరిగె నీ నష్టియంత 235

గత జన్మమునను విఘ్నముఁజేసి యుంటినో
యెవరొ కన్యాదాన మిచ్చగించి
కావించు సమయాన-కావున జగములు
రక్షింపఁగల వాని రమణినయ్యు
నిటుల దుఃఖిత నైతి జటిలమ్ముగను నేను
రావణా ! నన్నిప్డు రాముశవము
పైవైచి భార్యను భర్తను గలిపి పు
ణ్యముఁగట్టుకొనుమయ్య ! నా శిరమ్ము

రాము శిరముతో, నా శరీరమ్ము నాథు
దేహమును జేర్చుమెట్టి సందియము లేక
భర్తతో సహగమన మొనర్తు నేన
టంచు పరిపరి విధముల నంగలార్చె 236

పుడమికుమారి దుఃఖమున ఘోరున నేడ్చుచు నుండునంత న
య్యెడకుఁ బ్రహస్తురాక నెఱిఁగింపగ వచ్చెను ద్వారపాలుఁడొ
క్కఁడు-దనుజేశ్వరుండు క్షణకాలము చింత మునింగి వానితో
వెడలె వనమ్ముఁబాసి సరవిన్ భవితవ్యము నిశ్చయించుచున్ 237

రావణుఁడు పోవ రాము శిరమ్ము, విల్లు
బాణములు మాయమైపోయె-పంక్తిముఖుఁడు
భేరి మ్రోగించి సేన రప్పింపుఁడనుచుఁ
బనిచె మంత్రుల సేనాధిపతులఁజూచి 238

కారణము మాత్రమెఱిఁగింపకయె ధ్వజినిని
సిద్ధమొనరించి తెలిపిరి క్షితిపునకది
దీనితో తృప్తినందుచు దితిజనేత
పోయె హర్మ్యమ్మునకు నెంతో పుల్లసిలుచు 239

సరమ విభీషణ ప్రమద జానకి దుఃఖముఁజూచి యామెతోఁ
బరఁగిన చెల్మినాశ్వసనబంధురమై నిగదించె నిట్టులో
పరమ పవిత్ర ! యూరుకొన భావ్యము-రావణుఁడేమి పల్కెనో
దొరఁకొని వింటి సర్వమును-తొందరతోఁ జనెఁగాదె క్రన్ననన్ 240

నాతి ! నీ కొఱకేను ప్రాణములనైన
వీడ సిద్ధముగా నుంటి-వెఱపు లేదు
రావణుండెందుకేఁగెనో రయత దాని
కారణము నాకు తెలియును-కల్పన మిది ! 241

రాముఁడెఱుంగు సర్వమ్మను నిదురించు
సమయాన నాతని సంహరింప
ధరణిజ ! యెవరి సాధ్యము కాద ? యేస్థితి
లోనున్న నేరికి లొంగఁడతఁడు
ప్లవగులు శిలలతో పాదపమ్ముల తోడ
నని యొనర్తురు-పైగ, నమరవిభుఁడు
విబుధుల రక్షించు విధముగా నీ పతి
వేయి కన్నులఁ గనిపెట్టుచుండు
నైన వానర సంహారమలవి కాదు
దీర్ఘవృత్తభుజుండుఁ బ్రథితుఁడు, ధర్మ
మతి మహోరస్కుఁడును, శస్త్రి, పురుష సింహ
మతఁడు కడు విక్రముండు మహాత్ముఁడు సుమి 242

లక్ష్మణుండెప్పుడు రాముని వీడఁడు
రాముఁడు వేత్తయు రాజనీతి
నెఱిఁగిన వాఁడు-చలింపడు శత్రు బ
లంబెంత యున్నను లక్ష్యపెట్టఁ

డాతని పౌరుషంబాతని బలము నే
పాటివో నిర్ధరింపగనసాధ్య
మవనిజా! నీ ధవుండంతమొందగ లేదు
నమ్ము మాతండు ప్రాణముల తోడ
నుండె-మాయలమారి, దుష్టుండు ఘోర
కర్ముఁడగు రావణుని పరికల్పన మిది
నిన్ను భయపెట్టఁజేసిన పన్నుగడయె
వెఱవఁబని లేదు-దుఃఖమ్ము వీడుమమ్మ! 243

నీ దుఃఖమంతమై నీకు సౌభాగ్యము
వెలయు కాలము సమీపించె-సకల
సంపదల్ కలుగును జానకి! ప్రియ వార్తఁ
దెలిపెద వినుము నీ చెలువుఁడుదధిఁ
దరియించి యుత్తర తటమున విడిసెను
వానర ధ్వజినితో-నేను దాశ
రథుల వీక్షించితి రగడ యేమియు లేదు
క్షేమమే వారికి-చింతవలదు
రావణుఁడు నిగదించు వార్తలను నమ్మ
రాదు-వంచన కతఁడు పాల్పడెను సుమ్ము
వేగరులు వచ్చి చెప్ప నావేగి యగుచు
చేయు మంత్రాంగమిప్పుడు చెనఁటి నృపుఁడు 244

సరమ యిటు వివరించెడి సమయమందు
వినగనయ్యెను రాక్షసవీరకలక
లమ్మ-భేరీ నినాదము లిమ్మకొనుచు
పిక్కటిల్లగ-సరమ చెప్పెను మఱియిటు 245

అవనిజా ! యుద్ధ సన్నాహమద్ది-మత్త
సామజమ్ములు, వాజులు, స్యందనములు
కాల్బలమ్ములు సిద్ధమౌ కలకల మది
శంఖభేరీధ్వనుల్ పురి సమకొను సుమి 246

రణకోలాహలమద్ది-సైనికులు ప్రారంభింపఁ దద్యత్నమున్
ధ్వని విన్పించుచునుండె వీనులకు సీతా ! వీథులందెల్లెడన్
పనిగొంచున్ గనిపింతురెయ్యెడల నశ్వారూఢులై యోధులున్
జనుచున్ పెక్కురు ఘోరదర్శనులు విశ్వాసమ్ముతో దిట్టవై 247

కరులున్, వాజులు, స్యందనమ్ములును ఖడ్గస్తోమమున్, డాలు, లా
భరణమ్ముల్ రజనీచరారభటి యాపాదించు రోమాంచమున్
చిరదుఃఖమ్ము తొలంగి సంపదలు నిక్షేపించు-మా రాక్షసుల్
పరితాపమ్ము, భయమ్ముఁబొందెదరు సూ ! వైదేహి దూపాడుచుచున్ 248

తామరసపత్రనేత్రుఁడౌ దాశరథియు
జంభవైరి దానవులను సంహరించి
నటుల సమయించి పౌలస్త్యుఁబటుతరముగ
నిన్నుఁజేకొను జానకీ ! నిక్కువముగ 249

విష్ణు వరిగణమ్ముల పయి విక్రమించు
నటుల రాముఁడు, లక్ష్మణుఁడటుల యామి
నీచరులమీద శౌర్యమ్ము నిగుడఁజేసి
కసిమసంగుదు రవనిజా ! కసి యుడుఁగఁగ 250

నీ పతి శత్రుహంతయయి నెమ్మిని నిన్నొడిఁజేర్చి మన్ననన్
జూపుట నేను చూచెదను సుందరి ! రాముని కౌఁగిలింతలో
నోపడఁతీ ! ముదశ్రువుల మగ్మలి జార్చెదు వక్షసీమ పై,
నీ పిరుదుల్ స్పృశించు-ఘననీల కచమ్మను విప్పు నాతఁడున్ 251

పూర్ణచంద్రబింబము చందముగ వెలుంగు
ధవుని వదనమ్ముఁగాంతువు ధరణి జాత !
విషధరము కుబుసమ్మను విడుచునటుల
విడిచెదవు నీవు కన్నీరు విమల గాత్రి ! 252

సత్వరమ్ముగ రావణు సంహరించి
నిన్నుఁగూడుచు రాముఁడు విన్ననువున
పూర్ణసుఖమును బొందును పూవుబోఁడి
సస్యయుత భూమివలె ప్రకాశమ్మునంది 253

మగువ ! మేరువు చుట్టును మండల గతి
తో తిరుగుచున్న సూర్యుని దోయిలించి
శరణువేఁడు మాతండె యీ జగతి కంత
పరమ కారణమగుటచే పడయు సుఖము 254



# తృతీయాశ్వాసము

ఆకసము వర్షధారల నవనిఁదృప్తి
పఱచినటు సరమయు శుభవార్తఁ దెలిపి
పావనినిఁ దాను సంతోషపఱచి మఱియు
హితము కలిగింపఁ దలఁచి యయ్యింతికనియె 1

"సీత ! రామునికి నీ క్షేమమ్ము నెఱిఁగించి
యతని కుశలవార్త నవనిజాత:
తెలుపనెంచుచు నుంటి-దివిలోన గరుడియు
ననిలుండుకూడ నన్నందుకొనరు"
దానిపై వైదేహి తటుకున వచియించె
సరమ ! యత్రమ్మునఁ జనెదవు మఱి
పాతాళమునకు పోపంగను వలఁతివి
నాకోస మేమైన నయముఁగూర్పఁ
గలుగుదు వటంచుఁ దెలియును కాన నాకు
రావణుండేమి చేయఁదలంచు చుండె
నో యెఱుంగుచు నాతోడ నుడువ మేలు
కాపుపెట్టెను నాకు రాక్షస వనితల 2

వారు మాటలఁ జేష్టల దారుణముగ
నన్నుఁ బీడించుచుండిరి నాతి ! నాకు
ప్రాణసంశయముం గల్గుఁ బలువిధముల
స్వస్థముగ లేదు నాకు నా స్వాంతమందు 3

వాని తలపేదియో చెప్పవలెను నాకు
కాంత ! యంతకంటెను నుపకారము మఱి
యొకటి లేకుండెఁ గావున నోర్మిఁ జూపి
యీ సహాయముఁ గావింపు మెసకమెసఁగ 4

అంతటం బ్రియభాషిణియైన సరమ
రావణుని కడకేఁగి మంత్రాంగము విని
తిరిగి యేతెంచి పల్కె వైదేహి కిటుల
నా యశోకవనమ్మున కరుగుదెంచి 5

మాత కైకసియును వృద్ధమంత్రి యగు న
విద్ధుఁడను వాఁడు వానికి బుద్ధిఁగఱపి
సీత రామునికిమ్మని చెప్పినారు
కాని యతనికి నిను వీడు కాంక్షలేదు 6

యుద్ధమున నీల్గు వఱకు నోయువిద ! నిన్ను
విడువనని నిశ్చయించెను విభుఁడు, వాని
మంత్రులును సమర్థించిరి మహిపు ద్రఢిమ
బెంగటిల్లకు రాముఁడు పీఁచమడఁచు 7

అని యురార్చుచు నుండగా ప్లవగసేనాయత్తమై పోరికిన్
జనుచున్ సల్పుచు సింహనాదముల నిస్వానించి భేరీలతో
కినుకన్ రాక్షసనేత కృత్యముల బుగ్గింజేయు వక్రోక్తులన్
దనుజానీకము మార్కొనన్ విపులయత్నస్ఫూర్తిసాగెన్ వెసన్ 8

అది విని లంకలో దనుజులందఱు రావణు దుష్టకృత్యముల్
గుదికొనఁగీడు పూఁడెనని కొంకుచు నెంతయొ గుండెబీతునన్
పెదవిమెదల్పఁ జాలక తపించిరి పెల్లుగ పైకి చెప్పినన్
వదలక సంహరించునని వాదు కుపక్రమణమ్ము సేయకే 9

భేరీభాంకారమ్ముల
తో రాముఁడు లంకపైకి తోతెంచ విభుం
డారాటపడగ మంత్రులఁ
బాఱఁజూచి పలికె మాల్యవంతుండిటులన్ 10

మును జనస్థానసీమ రాముండొనర్చి
నట్టి దాని గుర్తించుము, అంబునిధిని
దాఁటి హనుమంతుఁడవనిజ దర్శనమ్ముఁ
జేసి, దనుజుల పెక్కురఁజిదిపె కాదె ! 11

మనుజమాత్రులకిది సాధ్యమా ? తలపు మ
టంచును నిదర్శనముంజూప నలుక మిగుల
యుద్ధమున జత్తుఁగాని నే నువిద నీయ
నని వచించె దశముఖుఁ డహంకరించి 12

సురల కొఱకు ధర్మము స
సురులకొఱకధర్మమ్మను నజుఁడేర్పరచెన్
నరులాదివిజుల పక్షమె
పరికించుచు నడవ నీకు భావ్యంబగు సూ ! 13

రాముఁడు వెస సాగరముదాఁటి యేతెంచె
నని, యాతని బలమ్ము నద్భుతమని
సైన్యముకూడ నసామాన్యమని మీరు
నిగదించి యున్నారు – నేనువింటి
రహి మీరు సత్యపరాక్రమవంతులు
కాని రాముని పరాక్రమము నెఱిఁగి
యింత తూష్ణీంభావమేల వహించిరి
దీని నేనెఱుఁగుదు దితిజులార !
యనుచు నిష్ఠుర వాక్కులనాడె నంత
మాల్యవంతుఁడు దశముఖు మాతకుఁ బిన
తండ్రి, ప్రాజ్ఞుండు వచియించె దానవేంద్రు
మందలించుచు నెంతయో కొందలపడి 14

అశర రాజేంద్ర : అన్ని విద్యలనేర్చి
నీతిశాస్త్రముఁ బట్టి నిర్వహించు
నవనిపాలుఁడు శత్రులందఱి వశమొన
రించుక చిరకాల మిలనునేలు

నీతితెలిసిన మన్నీఁడు తప్పినపుడు
శత్రువుతో సంధి సలుపుకొనుచు
వీలైనచో వైరివీరుల నెదిరించి
తన పక్షమును వృద్ధిఁ దనరుపుచును
ప్రభుత నెఱపి యైశ్వర్యము ననుభవించు
తన బలము హీనమైనచో జనపతి తన
యుక్తితో సంధి కొడబడుచుండవలయు
ప్రబలుఁడగుచో రణములఁబరఁగవలయును 15

సంగతిచూడ రాక్షసరాజ ! రాముతో
సంధిఁ జేసికొనిన సమరసమగు
ఎవరి మూలమ్మున నీ రట్టు పుట్టెనో
యాసీత రాముని కప్పగింప
ధర్మము - విబుధగంధర్వమహర్షిగ
ణమ్ములు రాము జయమ్ముఁ గోరు
చుండగ నీవెంతొ మొందరివై విరో
ధముఁ బెంచుకొనెదవు - తగదునీకు
ఆ మహర్షులు నిజముగా నగ్నిసములు
వారి కలసటఁ గలిగింప వలదునీవు
దుర్నిమిత్తము లెన్నియో తోఁచుచుండె
వాని వలన రాక్షసులకు వచ్చుచేటు 16

వరమొసంగెను నీకు పరమేష్ఠి దేవదా
నవనాగయక్షగంధర్వగణము
చే మరణమురాదు క్షితిప ! యటంచును
వానరభల్లూకమానవులిపు
డెత్తి వచ్చుచు నుండి రీవేళ మన పైకి
వరదాన మిపుడు నిష్ఫలము కాదె
రక్తము కురిసెను-లంకలో నేన్గులు
వాజులు కన్నీరు వదలుచుండె

కేతనమ్ములు నొరగుచుఁ గ్రిందపడెను
వఱడులఱచు ఘోరమ్ముగ, వారిదములు
రేఁగి నభమునఁ బెల్లు గర్జించుచుండె
గ్రద్దలాడెను పురములో కారుకొనుచు 17

నల్లని స్త్రీ లెదుట నిలిచి
తెల్లని దంతములఁజూపి దిక్కులదర గ
జిల్లున నవ్వుచు నుండిరి
పెల్లుగ వస్తువులు పోవు స్వప్నము లొలయున్ 18

ఇక్కల ఘుందఱి బలులను
గుక్కలు ముట్టుకొని పోవు గోగర్భములం
దక్కజముగ గార్ధభములు
వెక్కసముగఁ బుట్టుచుండె విస్మయ మొదవన్ 19

మూషికమ్ముల గలియును ముంగిసలును
కిటులఁగూడును భషకముల్ కిన్నరు లొగి
నరులు దనుజులతో గూడి నలిగొనెదరు
పిల్లులను గూడుచుండెను ద్వీపిచయము 20

ఒకపిశున పింగళాక్షుఁడు
వికటముండితశిరుండు వికటాటముగా
చికిలించుచుఁ బ్రతిగేహము
నికటమ్మునఁ దిరుగుచుండె నిర్జరవైరీ ! 21

లోకావనమ్ము సేయగ
నా కమలాక్షుండు విష్ణునవతారముగా
సాకేతమ్మున రాముని
గా కెరలుచుఁ బుట్టినట్లు కనిపించు మదిన్ 22

ఇట్టి దుర్నిమిత్తమ్ముల నెంచి చూచి
శ్రేయమగు దారిలోఁ బ్రవర్తింపుమనుచుఁ
దెలిపి భూపు నయిష్టతఁ దెలిసికొనుచు
నూరుకొనె మాల్యవంతుఁడు యుక్తుడగుట 23

మాత కైకసి పినతండ్రి మాల్యవంతుఁ
డెంతచెప్పిన రావణు స్వాంతమంత
మృత్యువశుఁడౌట మువ్వాత హితము నచ్చ
కతఁడు ప్రల్లదమ్ములనాడె కుతకుతనిటు 24

హితమో లేక యహితమ్ముఁ జెప్పెడవా నీకీ ధైర్య మెట్లబ్బె - స
త్కృతియా రాముఁడు - క్రోతులన్ గలిసి వార్ధిన్ దాటి యేతెంచినన్
కృతియౌనే? నరుఁడాతఁడే! పితయె తా గెంటెన్ కదా కానకున్
దితిజేశుండను నన్నుగెల్వఁ దరమా? ధిక్కారమున్ సైతునా! 25

దేవతలు నన్నుఁ జూచిన దిగులుపడుచు
వణఁకు చుందురు గజగజ - బలపరాక్ర
మములలో నాకు సాటియే - మనుజుఁడతఁడు
వైరులను బ్రస్తుతించిన నేరమగును! 26

ప్రభువును గుఱించి నీవలె పరుషముగను
పలుకఁ డెవ్వఁడు - నీవెంతొ పక్షపాత
మునను పలికెదు తాత! రామునకు నేను
సీతనిచ్చుట కుదరదు భీతినంది 27

దాశరథులను, సుగ్రీవుఁ దాత! యనతి
కాలమునఁ గూల్చివైచెద-బేలనగుచు
యుద్ధమొనరింపకే భీతి నుండవలెనె?
నా స్వభావము మాఱదెన్నడు నెఱుఁగుము! 28

వనధికి సేతువుఁగట్టగ
ఘనమౌనే? నీవు వైరి ఘనతను బొగడన్
జనునే? సీతను విడువగ
మనసున భావింపవలదు మఱిమఱి వినుమా 29

మీఱుచు దానవనాథుఁడు
వారించుచు పలుక మాల్యవంతుని( దా
నూరుకొని నిరుత్తరుఁడై
జాఱుకొనెన్ సభన్వీడి జయవెట్టివెసన్ 30

వ। దశగ్రీవుఁడు తదుపరి మంత్రులతో నాలోచించి తీవ్రముగా పుర రక్షణకు వలయు నేర్పాటు లొనరించి తా నంతి పురమున కరిగెను. తరువాత రామలక్ష్మణులు వానర యూధపులతో నుండ విభీషణుఁడు ఎదురుగా కన బడుచున్న లంకా నగరమును జూపి దానిని(గొట్టుటకు మార్గము నన్వేషించుచు తన నలువురు మంత్రులను పక్షి రూపులుగా లంకలో శత్రు సేనలోఁ(బ్రవేశించి, అక్కడ జరుగుచున్న దంతయుఁ దెలిసికొని రండని పంపగా, వారు తిరిగి వచ్చి విభీషణునకు కలతెఱఁగుఁదెలుపగా నాతఁడు రామునితో లంకలోని యేర్పాటు లీవిధముగా వివరించెను. 31

రావణపాలితమ్మయిన లంక యదే! కనిపించు-చూడుమా
ధీవర ! రామచంద్రనృపతీ ! దశకంధరుఁ డప్రమత్తుఁడై
చేవ(దలిర్ప రక్షణము నేయుచు నుండగ దేవజాతులా
లావరి పట్టణమ్ము దెసరారు జయింపగ భీతచిత్తులై 32

కలఁడు ప్రహస్తుఁడు కాపుగా తూర్పు వా
కిలిలోన సైనిక బలము తోడ
దక్షిణ ద్వారము దరిని మహాపార్శ్వు
డును, మహోదరులుండిరనఘ ! నైక

రాక్షస యోధులు శిక్షితుల్ పశ్చిమ
ద్వార మింద్రజి కాయు దాంభికుఁడుగ
రావణుఁడు శుకసారణులతో నుత్తర
వాకిలిలో నుండె బలులఁగూడి

మధ్య నుండె విరూపాక్ష మాంసలుండు
నీ విషయమెల్ల యెఱిఁగి యేతెంచినారు
నా సచివులద్దిచెప్పు చున్నాను రామ !
అతని కాల్బల మెంతయో యధికము సుమి 33

సామజములు, వాజులు సహస్రముగ నుండె
కోటినుంది పదాతులు కుదురుకొనిరి
రావణుని మూల బలమిది రామచంద్ర !
వారలందఱు బలవంతులే! రథికులె ! 34

వారిలో ప్రతివానికి పది, పదేసి
లక్ష రాక్షసులుందురు రామ ! నీవు
క్రోధుఁడవు గాకు-నీకు పౌరుషము కలుగు
నటులుచుఁదెలిపితి భయపెట్ట నధికముగను 35

తగిన వాడవు రావణ దనుజపతికి
నీ వనాయాసముగ వాని నిగ్రహింతు
వమరులనుఁగూడ గెల్వగ నవుపదును
తదితరులమాట లెక్కయే దశరథసుత ; 36

వ్యూహమును దీర్చి వానర వాహిని నడ
పించి నటులైన రావణుఁ బిలుకుమార్పఁ
గలుగుదువు నీవు రామ భూకాంత ! యనగ
నందుపై దాశరథి పల్కె నంచితముగ 37

నిలుచును తూర్పువాకిలిలోన నీలుండు
పురుడించుచుఁ బ్రహస్తుఁ బోరునందు
అంగదుఁడరిగి యామ్యద్వారమున మహో
దర, మహాపార్శ్వుల నొరగఁజేయు
పశ్చిమద్వారాన పావని మేఘనా
దునిఁ బీఁచ మడఁచును ధూర్వహుఁడుగ
స్వయముగాపోయి రావణు సంహరింపగ
నుత్తరద్వారమందుందు నేను
వానరేశ్వరుఁడును, జాంబవంతుఁడును వి
భీషణుఁడు సేనమధ్యను విక్రములుగ
నిలిచి చక్కఁబెట్టెదరు సూ : బలమునంత
నసులవోలె వానరులు కన్పట్టరాదు 38

నేను, సౌమిత్రి, పావని, నీలుఁడంగ
దుండు, సుగ్రీవుఁడు విభీషణుండు మనుజ
రూపముల నుందు మితరుల రూపమందు
మార్పు రారాదు లేద ప్రమాదమె సుడి! 39

వ॥ అని పలికి సుగ్రీవ దశగ్రీవానుజులంజూచి సువేలాధిరోహణమ్మొ జేసి లంక కలయం గనుంగొనవలయు, నీరాత్రి దీనినెత్తంబునం బుత్త మనుచు నధిజ్యశరాసనుండై లక్ష్మణుఁడును, సుగ్రీవవిభీషణజాంబవ దాంజనేయ గజ గవయ గవాక్ష గంధమాదన శరభ శతవలి సుషేణ దుర్ముఖ ప్రముఖులైన వలీముఖ భల్లుక యూథనాథులుఁ దమతమ బలంబుల తోడను గొలిచిరా నమ్మహీధరోత్తమం బెక్కి రాముఁడు తన పరివారముతో నా రాత్రి గడపెను. 40

ఆ రాముండును తెల్లవాఱగను శైలాగ్రమ్మునందుండియే
శ్రీరమ్యంబగు స్వర్ణలంకఁగనుచున్ జిత్తమ్ము ... మెచ్చి, తత్
పారమ్యమ్మును సారెకున్ గనుల కాప్యాయమ్ముఁ గూర్పంగ, సా
మీరిన్ లక్ష్మణు భానుజున్ గనుచు నెమ్మిన్ బల్కె హర్షమ్ముతో 41

"ఇది మయనిర్మిత పురమగు,
మది కాశ్చర్యమ్ముఁ గొలుపు మఱి మఱి కనగా
నిది హృద్యమ్మది శోభిత
మిది సౌందర్యమున కిక్కయే తలపోయన్ 42

నానావృక్షసమన్వితంబగుచు నానాజంతుసంయుక్తమై
సూనంబుల్ వెదజల్లు గంధములతోఁ జోద్యమ్ముగా దోఁచు ను
ద్యానమ్ముల్ గృతకాద్రులున్ గొలంకులున్ హాళింబ్రదర్శింప, తం
త్రీనాదమ్ములు మానసమ్ములకు పూరింబుచ్చుఁగాదే తమిన్ 43

పాదపమ్ముల మీద ఖగములుల్, శారికల్
శుకములు రొదసేయు చోద్యముగను
పంచమస్వరముతో వనప్రియమ్ములు పాడు
సరసులలోన హంసలు మొదలగు
జలపక్షులుండెను శాద్వలమ్ములు కూడ
తుహినబిందువులతో తురఁగలించు
పర్వతశిఖరమ్ముపై లంక విలసిల్లు
నిడివి నూరామడల్ వెడలుపు మఱి
ముప్పదామడలుండె విబుధులు, ఖేచ
రులకుఁజొర కష్టమనగ నరుల విషయము
చెప్ప నేముండె లంకలో చెలఁగునెన్నొ
మేడలును, మిద్దెలును శ్వేతమేఘములటు 44

వెలయు చైత్యభవన మొందు వేయి కంబ
ములను గల్గుచు నద్ది విభూష లంక
కంతటికిని కైలాస శిఖరము వోలె
నంబరముఁదాఁకు చున్నటు లబ్బురముగ 45

సంతతం బచ్చటను నిశాచరులు నూర్గు
రెపుడు కావలియుండుదు" రిట్టి లంక
రామచంద్రుఁడు దర్శించి రావణు ఘన
వైభవమ్మును గమనించి ప్రస్తుతించె 46

రాముఁడటునిటు చూడగ రమ్యమైన
లంకలోనఁ బౌలస్త్యు దర్శనము కలిగె
నాతఁడొక గోపురమున సింహాసనమున
ఠీవిఁగూర్చుండి యుండెఁబటిష్ఠముగను 47

సరస పరిచారికలు శుక్లచామరములు
వెల్లగొడుగుఁజేపట్టి సేవించు చుండ
దైత్యనాథుండు రక్త చందనముఁబూసి
కొనుచు భూషణముల్ దాల్చి తనుకు చుండె 48

కాంచనాంబరసీమ కాలమేఘము రీతిఁ
గన్పించుచుండె వక్షస్థలమ్ము
దత్తయైరావణదంతఘాతవ్రణాంక
కాయమ్ముతో నిండి కానిపించె
శశకరక్తకషాయశ్లక్ష్ణ వస్త్రముఁగట్టు
కొని యుండ రాముండు వనచరులును
పరికించు చుండగా వానరనేత సు
గ్రీవుని కెడఁదలో కినుక హెచ్చి
వెంటనే గంతువెట్టి యావేగియగుచు
నుత్తరపు గోపురమ్మున నున్న పాపి
రావణుని ముందు నిల్చి నిర్భయము తోడఁ
గాఁకతో నిగదించెఁ దృణీకరించి 49

"నేను జగముల కేలికయైన రామ
చంద్రు భృత్యుఁడ, సఖుఁడ, దశాస్య! యతని
చరితతేజోబలమ్ములఁ బాయమునను
నిన్ను పీడను చూడుము మన్నిగొనెద" 50

అనుచు చిత్ర విచిత్రమౌ యసురనాథు
వక్షమునఁదాఁచి మకుటము పడఁగఁద్రోసె
దానిపై దశగ్రీవుఁడు తామసమున
లేచి సుగ్రీవుఁబడగొట్టి రెచ్చి పలికె 51

"ఎచటొ సుగ్రీవుఁడవు కాని యిచట కాదు
వచ్చి నా ముందలనిలుచుటు వలన నీవు
గ్రీవరహితుఁడవే"యని రావణుఁడన
వెంటనే లేచి రవిజుఁడు గెంటె నసురు 52

వానరేశుని తన పరిష్వంగమందు
నసురుఁ డిఱికించి పీడింప నర్కజుండు
సూక్ష్మముగ దాఁటె తద్యత్నచూర్ణకమ్ము
రావణుండద్ది గమనించి యేవగించె 53

ఇద్దఱును బిడికిళ్ళను గ్రుద్దుకొనిరి
చప్పటుల నఱచేతులఁ జఱచుకొనిరి
పొడుచుకొనిరి మోఁచేతుల ముడుకులందు
గోళ్ళతో బరుకుకొనిరి కోపములుగ 54

వారి వపువులు చెమటతో వడియఁగట్ట
నస్రమోడికల్ గట్టి దేహమ్ములందు
విఱుగఁబూసిన శాల్మలీ వృక్షములటు
లుండి యలసట నిల్చినా రొక్కతడవు 55

తరువాత నొకరిమీఁద నొకరు పడుచును
ఒకరినొక్కరు వంచి రొత్తుకొనిరి
ఒకరినొకరు త్రోసి యూర్చుచుఁ బ్రాకార
పరిఖల మధ్యను పడిరిరువురు
వెంటనే లేచుచు జంటగా నొకరినొ
క్కరు పట్టుకొని కసిఁగరుల పగిది
ద్వీపి సింహములటుఁ దెగువతో యుద్ధమ్ము
సలిపి రెంతయొ పట్టుదలగ నభ్య
సనముగా సాటిలేనట్టి శక్తితోడ
నలిపి చంప పరిష్వంగ కలన నొకరి
నొకరు పీడించుకొనిరి మహోద్ధతి మెయి
కుమ్ముకొనిరి మహోగ్రులై దిమ్మదిరుగ 56

ద్వంద్వయుద్ధము సలిపిరి దైత్యవిభుఁడు
ప్లవగపతియు బాహాబాహి పంతగించి
భీకరముగ ముష్టాముష్టి పెక్కువగను
చూపఱుకునద్ది చూపట్టె చోద్యముగను 57

మసలిరిద్దరు మండలమార్గమందు
నమిత వేగముతోడ పోరాడినారు
అసురనేతయు స్వీయ మాయాబలమ్ము
భానుజునిపై ప్రయోగింపఁ బూనుకొనగ 58

దనుజేంద్రుండును మాయఁ జూప పెనుయత్నం బొందుకావింప దా
నిని వీక్షించి ప్లవంగ నాయకుఁడు సున్నిద్రుండుగా తోన రా
ముని సాన్నిధ్యము మింటి మార్గముననేపోవంగ నూహించిరా
వణునిన్ ద్రోయగయత్నమున్ సలిపె దుర్వారుండుగా బల్మిమై 59

వంచితుం డౌచునపుడు రావణుఁడు తన ప్ర
యత్న మెల్ల నిష్ఫలమై నిరాశఁ జెంది
యట్టులేనిల్చి కాంచె వియత్పథము
అచ్చవడి వానరేశుని ప్రేప్సఁదలఁచి 60

అర్కనందనుఁడట్టుల నభ్రవీథి
కెగిరి రాముని మ్రోలను దిగెసువేగ
వంచితుఁడు హతాశుండు రావణు డటులనె
యుండిపోయెను తాను చేయునదిలేక 61

రాముడెంతొ సంతోషించె రవిజుఁ గాంచి
ప్లవగవీరులు నానంద భరితులగుచు
సింహనాదముల్ సలిపిరి చేరి చుట్టు
తమ ప్రభువురాక కనుగొని తన్మయులయి 62

వ. అంతట రాఘవేంద్రుఁడు సుగ్రీవుని వృత్తాంతము నాకర్ణించి, కౌఁగి
లించుకొని యిట్లు పలికెను. 63

ఓ వలీముఖరాజ ! నీవు నాతోడ నా
లోచింపకయె నీకు తోఁచినటుల,
చెప్పక చేయక చేసితి విట్టుల
సాహసకృత్యమ్ము సంభ్రమమున
వీరాధివీరుండవే! సాహసికుఁడవే!
నను, వానరుల, విభీషణునిఁ గూడ
సంశయావస్థలో సంతపడగఁ జేసె
సాహసం బొనరింప సాంప్రతమ్మె।
ఇంకెపుడుఁ జేయఁబూనకు మిట్టి పనులు
నీ కపాయము వచ్చిన నాకు సీత
తోడఁ బనియేమి ? యనుజులతోడ-కడకు
నేమిపని నా వపువుతోడ బావుకొనగ 64

నీ బలశౌర్యముల్ నేనెఱింగినఁగూడ
రవిజ ! నీవిచటికి రాకముందు
దైత్యసపుత్ర బాంధవముగా సపుయించి
యీ విభీషణుని లంకేశ్వరునిగఁ
జేసి, యయోధ్యలోఁజేసెద భరతుని
రాజుగా ప్రకటించి భ్రాజితముగ
అటుపయి నేను దేహత్యాగమొనరింప
నిశ్చయించితినని నిష్ఠురముల

నాడ దానిపై భానుజుఁడనియె నిటుల
రామ ! నా పౌరుషమెఱింగి రామ హ_ర్త
కంటఁబడ మిన్నకుందునె ? దంటనయ్యు
ననుచు మాటాడ రాముండు ననునయించె 65

అనుజుని లక్ష్మణుంగనుచు నా రఘురాముఁడు పల్కె_ నిట్టులన్
మనమిపు డాస్వదింపగఁ గ్రమంబుగ స్వాదుజలమ్ముఁబండులున్
గొనకొను తావునారసి, నిగూఢముగా రచియించి వ్యూహమున్
వనచరభల్లుకప్రవరప్రాణములన్ బరిరక్షఁజేయగా 66

ఇది లోకక్షయకారకంబయిన దీ హింసా ప్రకోపమ్ముతో
మదిలోఁగూడ భయమ్ముఁగల్గెడిని సుమ్మా ! పెక్కు_ వీరుల్ పదిం
బదిగా నాశము చేయగా బడుదురీ పక్షమ్మునన్ మెండుగా
కదలున్ పృథ్వియు, మేఘముల్ కురియు ర_క్తమ్మొడికల్ కట్టుచున్ 67

పరుషముగ వీచుచుండెను పవనమిప్పు
డూఁగు భూధరశిఖరమ్ము లుద్ధృతముగ
వృక్షములు కూలుచున్నవి-వెలుఁగు తగ్గె-
భాస్కరునిలోన మంటలు ప్రబలుచుండె 68

వహ్నిబింబము క్రిందికిఁబడుచు నుండె
శశియుఁదేజోవిహీనుఁడై సంతపడును
ఇఱుకుగా పరివేషము పరఁగుఁజూడు
మచ్చ కనఁబడు మార్తాండమండలమున 69

వికిరములు, మృగములు సూర్యబింబముఁగని
యశుభముగ కూయుచుండె దైన్యమ్ము మిగుల
ఉడుగణమ్ములు మలినమైయుండె సహజ !
కానఁబడు ప్రళయమువచ్చు కరణి నిపుడు 70

ఇపుడె ముట్టడివైచి జయింపరాని
లంకపై దండువెడలగ రామచంద్రుఁ
డగచరబలమ్ముఁ జూచుచు నాత్మతృప్తి
నంది యాజికై రవిజుని కాజ్ఞనొసఁగె 71

ప్రాతఃకాలమునందు రాముఁడు ధనుష్పాణుండుగా సేనతో
నోతప్రోతముగా దశాస్యు పురిపై యుద్ధమ్ముకై యూధప
వ్రాతమ్మున్గొని పైలుదేఱఁ దరువుల్ రాల్ రప్పలుం బూనుచున్
భూతశ్రేణి వడంక సుద్ధృతముగాఁ బోకార్పగా దైత్యులన్ 72

ఘోరరణమ్ము సేయగ నకుంఠిత ధైర్యముతోడ లంకకున్
జేరెను వానరధ్వజిని-జేత రఘూద్వహుఁడాస్థ నుత్తర
ద్వారమునందు రావణునిఁ దాఁకగ నిల్చె సుమిత్రసూనుతో
వేఱొక వీరుఁడాగవను విక్రమమున్ వెలయింపఁ గష్టమౌ 73

వ॥ రావణాధిష్టితమై యది వరుణాధిష్టితమైన మహా సముద్రమువలె సున్నది, సాయుధులు, మహావీరులైన రాక్షసులనేకు లక్కడ కాపున్నారు. మైందుని, ద్వివిదుని వెంటబెట్టుకొని నీలుఁడు తూర్పుద్వారముఁ గవిసెను ప్రమాధి. ప్రఘసుఁడు మొదలగు వీరులతో హనుమంతుఁడు పశ్చిమ.

ద్వారముఁ గవిసెను. అంగదుఁడు గజగవాక్షగవయఋషభులతో దక్షిణ ద్వారముఁ గవిసెను. భల్లూకవానరవీరులతో నుత్తరద్వారమునకు, పశ్చిమ ద్వారమునకు మధ్య సుగ్రీవుఁడున్నాఁడు ముప్పదియాఱు కోట్ల ప్లవగ వీరులతో. 74

పరిరక్షించుచు భానుసూతి నిలిచెన్ వాయువ్య భాగాన వా
నరభల్లూకప్రవీణయోధవరసైన్య స్తోమ సంయుక్తుఁడై
సరసన్ లక్ష్మణుఁడున్ విభీషణుఁడు నాజ్ఞాబద్ధులై రామ భూ
వరు సామీప్యమునందు సాయముగ నిల్వన్నెమ్మి ప్రోద్దాములై 75

ప్రతిగవను చెంత కోట్లాది ప్లవగవీరు
లుండి బాసటగా నిల్వ మెండుకొనుచు
జాంబవంతుఁడు భల్లుక చమువుతోడ
రామునకు బాసటగ నిల్చె బ్రాఁతినెసఁగ 76

ద్వీపుల వలె బయల్దేఱిరా ప్లవగులు
బెట్టిదమ్ముగఁ బురి ముట్టడించి
నారు-పొంగుచు నుండె వారి శరీరముల్
వారి లాంగూలముల్ పైకెగురుచు
నుండె-రోషము వల్ల మండి మొగమ్ములు
కడు భయంకరముగ గ్రాలుచుండె
వారిలో శతదంతి బలులు కొందఱు, మఱి
కొందఱు వేయి యేన్గుల బలమ్ము

కలుగు వా రూహకందని బలము కలుగు
వారు పెక్కురు-గుంపుగా వారు కదల
మిడుత లొకచోటఁజేరిన వడువునఁగన
వైరి పృథ్వియు గగనమ్ము నాక్రమించి 77

ఎచటఁజూచిన వానరులే-పవనుఁడు
లంకలోఁబ్రవేశింపజాలక నిలఁబడె
ప్లవగులాకస్మికమ్ముగ రాగ దనుజు
లెంతొ యాశ్చర్యచకితులై యిడుమపడిరి 78

సాగరము విర్గిపడినట్టి చందముగను
పెద్ద ధ్వనియయ్యెఁగపిసేన యుద్ధవిడిగఁ
దారుచుండ భయంకర ధ్వని జనించి
లంక లంకంత గజగజ రాయిడి పడె 79

ఇటుల రాముఁడువైరి జయింప ప్లవగ
సేన నాయత్త పఱచి సచివులఁబిలిచి
జరుగవలసిన కార్యము సలుప వాలి
తనయు నంగదుఁ గన్గొని పనిచె నిటుల 80

వీరాధివీర ! నాప్రేష్యుండుగా దశ
ముఖు పాలికింబోయి ముక్తసరిగ
నా వచనమ్ముగా రావణ దైత్యుతో
వచియింపుమివ్విధి పరుషముగను

నక్తంచరా ! నీ వినాశకాలము వచ్చె
ప్రాభవంబెల్ల లుప్తంబె యగును
వరగర్వమున నీవు సురనాగగంధర్వ
యక్షకింపురుషమహర్షుల కప
కార మొనరించినాఁడవు ఘోరముగను
తత్ఫలము వల్ల నీకు నంతమ్ము వచ్చె
ఏ బలము వల్ల వంచించి యింతిఁదెచ్చి
తా బలమ్మును జూఁపింపు మసురవిభుఁడ ! 81

సురనాగమహర్షుల క
ప్సరలకు యక్షులకు ముష్ఠిపాలసుండవై
దురుసుగఁజేసిన యపకృతి
పరముగ నీకంతమిపుఁడు ప్రాప్తించు సుమీ ! 82

నాకు సీత సమర్పించి నన్ను శరణు
పొందకుండిన నీ లంక భుగ్నమగు, మ
దీయనిశితాస్త్రములచే నుదిలగొనుసుమి
నే నరాక్షసముంజేతు నీ పురమ్ము 83

రాక్షసుల నుత్తముండు ధర్మజ్ఞుఁడగు వి
భీషణుఁడు నను శరణమ్ము వేఁడె మునుపె
మూర్ఖుఁడవు, పాపివగుదువు పుట్టి మునుఁగు
లంక యాతని వశమగు రాజు కాఁగ 84

కావున రాజ్యమేలగఁ బ్రకర్షముఁజూపకు శూరతన్ దశ
గ్రీవ ! రణమ్ము సేయవలె లేద మదీయశరాళిఁబాల్పడన్
నీవు పవిత్రుఁడౌదువు-వినీలనభమ్మున పక్షిరూపునన్
బోవగ నిన్నుఁబట్టి పొరిపుచ్చెద తప్పక రాక్షసాధమా ! 85

అభిషేకించితి మీ విభీషణుని లంకాధీశుగాఁజేసి నీ
విభవమ్మెల్లను వీటిపోవగను దుర్వృత్తిన్ బ్రదర్శింపగా
విభుఁడై యుండి నృపాల ధర్మమును నిర్వేదమ్మునన్ వహ్ని స
న్నిభ మత్పత్ని హరించి తెచ్చితివి దుర్నీతిన్ విడంబించుచున్ 86

ద్విజముగా మూఁడు లోకాలఁదిరిగిన సరె,
నీవు నా కంటఁబడుటచే నిన్ను నేను
బ్రదుకనీయను రావణ ! పాపివగుట
నిది యథార్థము నాశక్తి విదితమగును 87

ఔర్ధ్వదైహికక్రియల నీవాశర ! పొన
రించుకొనుమిప్పుడే వేగ మించిపోక
ముందె-కాలము నాహితమ్మును గణించి
చూచుకొను మొక్కపరి లంక నీచ హృదయ ! 88

నీవు నా చేతిలోఁజచ్చి నిర్జరులు మ
హర్షి సత్తముల్ రాజర్షులందు స్థాన
మీవు చేరెద విప్పుడు రావణాధ
మా ! నశింతువు దుశ్శీల మానహీన ! 89

వాలి తనయుఁడు రాముని పల్కులువిని
రూపుదాల్చిన వహ్నియై రోషియగుచు
గగనవీథినిఁ జని పంక్తికంధరు గృహ
సీమ క్రోధముతోఁ బ్రవేశించె వడిగ 90

మహిపుఁడప్పు డాలోచనా మందిరమున
మంత్రిమండలితో నుండె మంతనముల
వాలినందనుఁడంత రావణుని ముందు
నిలిచి వచియించె నిమ్మెయి నిరసనముగ 91

రావణ ! మాననీయుఁడగు రాముని దూతను-వాలి పుత్త్రుఁడన్
వావిరి నంగదాహ్వయుఁడ వైనములన్ని వచించినాఁడ సూ!
నా విషయమ్మెఱుంగుదువు నాయకుఁడౌ రఘునాథు దౌత్యమున్
నీవు వినంగనౌ నిపుడు నిష్ఠురమైనను గష్టమైననున్ 92

నిను చెఱలోనుంచి నీ మదమడఁచిన
కార్తవీర్యార్జును కరసహస్ర
మును దున్మ జమదగ్ని తనయుని చాపమ్ము
విఱిచిన మా రామవిభుని దూత
నై యరుదెంచితి వసుధేశ్వరా ; నిన్ను
చంకలో నిఱికించి స్నానమాడి
నాల్గు వార్ధులముంచి నవయింప జేసిన
వాలి తనూజుఁడ ! వచ్చినాఁడ

నంగదాఖ్యుఁడ రఘువీరుఁ డనిపెనన్ను
ఆ మహాత్ముని వచనము లాశర ! యిపు
డేను నుడివెద తాల్మి నాలింపుమయ్య
ఉభయతారకమై యెంతొ యుక్తపడును 93

“నే నాశ్రమమ్మున లేనివేళ మదీయ
పత్ని నపహరించి పాడిఁదప్పి
యసురాంగనల మధ్య నారామమున నుంచి
వేధించుచుంటివి బెట్టిదముగ
వరగర్వమున నీవు వర్తించి దేవమా
నవులను నవయించినావు కనుక
మరణము తప్ప దాశరనాథ : నీకిప్డు
కడిమిఁ జూపించి సంగ్రామమందు
నిలుపుమా ! లేద నాసతి నేలపట్టి
మంచితనమున నాకు నర్పించి నన్ను
శరణు వేఁడిన మన్నింతు మరణముఖము
నందు నీవుంటి విప్పుడు-తొందరపడు 94

కడిమి సపుత్త్రబాంధవముగా వధియింతును రాక్షసాధమా !
విడుమర కల్గ లోకములు విస్మయమందును నిన్ను జంపఁగా
ఒడయనిగా విభీషణుని యోర్పరినై నిలుపం దలంచెదన్
ఎడయగ విడ్వరమ్మపుడు ఏర్పడు శాంతి జగమ్ములన్నిటన్ 95

సర్వసంపదలును విభీషణు వశమగు
నీవు సీత సమర్పింప నేరని యెడ
శరణు వేఁడని యెడల నిన్ సంహరింతు
నని వచించెను రాముఁడు దనుజనేత !" 96

అంగదుని మాటలాలించి యసురవిభుఁడు
క్రోధపరవశుఁడౌచు విరోధి దూతఁ
బట్టుకొని నఱకండని నిట్టలముగ
ప్రేష్యులకు నాజ్ఞలిడెను నిలింపవైరి 97

అటులఁ బదిమాఱులఱవగ నసురభటులు
వెంటనే దీప్తవహ్నుల వంటివారు
వచ్చి తారేయు బల్మినిఁ బట్టుకొనగ
తన బలముఁజూప వాలినందనుఁడు చిక్కె 98

తన్ను పట్టిన నలువురి దానవులను
పిట్టలను బట్టుకొన్నినటు పట్టి యెగిరి
చేరుకొనెను మహీధరశిఖర సన్ని
భమ్మయిన మహోన్నత రాజభవన సీమ 99

అంగదుని వేగముననుఁ సర్వాంగములును
నలుగుచును శ్వాసయాడక నవసి పంక్తి
కంధరుఁడు చూచుచుండగ గాసిఁ బడుచు
నవనిపై జాఱిపడి చచ్చిరసురభటులు 100

హర్మ్యశిఖరముఁ దన్నఁగ నంగదుండు
కూలిపడె వాని ధాటికి- హేళనముగ
నఱచి "యంగదనాముఁడ ! మఱువకు"మని
గగన మార్గానచనియె నంగదుఁడు పేర్మి 101

దానిఁగని పౌలదిండులు తల్లడిల్లి
పోప, వానరులందఱు పొంగిరెంతొ
తన భవన మటుఁగూలగ దానవపతి
తలఁచె తనకు వినాశము తప్పదనుచు 102

లంకాపురినిఁజుట్టి రాజిలు వానర
ధ్వజిని విలోకించి దానవులపు
డాశ్చర్యచకితులై యటులె నిల్వగ, గొంద
అమిత భయమ్ముతో నలఁతఁగుంది
రమిత బలాఢ్యులు సమితికై వారు సం
సిద్ధులై నిలిచిరి- సేనతోఁచె
మఱియొక ప్రాకారమై పురి ప్రాకార
మునకు దీటుగ భయమోహితులయి

చెలఁగి పెల్లు హాహాకారములు సలుపుచు
వానరులు లంక ముట్టడి వైచిరనుచు
దశముఖుని కెఱిఁగింపగ. భృశము మండి
పెక్కు కట్టుదిట్టముల గావించె మఱియు 103

తన మేడపైనెక్కి దానవేంద్రుఁడు పరి
కింపగ పురిచుట్టు కీశపృతన
భూమిపై, చెట్లపై. చేమలపై గుట్ట
మిట్టలందుననను భూమీధరముల
పై నిండియుండెను ప్లవగ సైన్య మ్మెట్లు
నాశనంబగునను, నవసి మదిని
ధైర్యము తెచ్చుక తదుపరి వానర
యూథపులను రాము నుదిరిపడుచు

కాంచె-నచ్చట రాముఁడు కపులఁగాంచి
హరిణనేత్ర జానకి యిట నవధిలేని
కష్టములఁబడుచుండెను కాన మీర
లసుర సంహార మొనరింపుడని వచించె

104

అనుటయే తడవుగ నగచరవీరులు
పోటీలు పడుచును పోయిరెలమి
సింహనాదమ్ములఁజేసిరి పర్వత
శిఖరముల్ తోడను చెట్లుతోడ
చెలఁగి రాక్షసులను జిదుకకొట్టెదమని
గ్రుద్దులతోఁ బడఁగొట్టెదమని
యఱచుచు, మట్టితో నశ్మమ్ములను నగర్త
ముందుగాఁ గడిమితోఁబూడ్చినారు

పదిలపడి లగ్గలకు నెగఁబ్రాకినారు
మీఁటి ప్రాకారమును నాక్రమించినారు
గోపురము లెన్నియో రూపుమాపినారు
పెక్కు తోరణమ్ముల గూల్చి వేసినారు 105

దాఁటుచున్ దుముకుచు వారు దానవులను
గర్జనల తోడ నెదిరింపఁ గడగినారు
కామరూపులై కపులు ప్రాకారభేద
నమునకై యత్నమొనరించినారు పెలుచ 106

జయము రఘునాథమౌళికి జయము జయము
జయము లక్ష్మణస్వామికి జయము జయము
రామపాలితసుగ్రీవ రాజునకును
జయము జయమని నినదించి సాగినారు 107

వ। జితకాశులైన దశకోటి వానర వీరులతోఁ గుముదుఁడు పూర్వ ద్వారమును గొట్టసాగెను. ప్రఘసుఁడు, పనసుఁడుఁబెద్ద సైన్యముతో నతనికి సాయము చేయుచుండిరి. మహాబలశాలియైన శతవలి వింశతికోటి ప్లవగ వీరులతో దక్షిణ ద్వారము ఛేదింప పూనుకొనెను. తార తండ్రి సుషేణుఁడు ఆరుకోట్ల వలీముఖ వీరులతో పశ్చిమ ద్వారమును వశపఱచుకొనుటకుఁబూనుకొనెను. ఉత్తర ద్వారమున లక్ష్మణ సహితుఁడై రామ మహీపతి నిలిచెను. రామునకు కోటి కపివీరులతో మహాకాయుఁడు గవాక్షుఁడు ఒక ప్రక్కను, కోటి భల్లూక వీరులతో ధూమ్రుఁడు మఱియొక ప్రక్కను సహాయము

యుచుండిరి. మహాబల పరాక్రమశాలి యగు విభీషణుఁడు కవచధారియై
దాపాణియై మంత్రి సహితుఁడై రాముని దగ్గరగా నుండెను. గవాక్షుఁడు
జుఁడు, శరభుఁడు, గంధమాదనుఁడు నెవరికి కావలసిన సాయము వారి
ందించుచు తిరుగు చుండిరి. 108

రాము వ్యూహము గమనించి రావణుండు
రణమొనర్ప నాదేశించె రాక్షసులకు
సింహనాదముల్ సలుపుచు చెలఁగి రసుర
వీరులపుడు భేరీ ధ్వనుల్ వినగనయ్యె 109

మొరసె శంఖమ్ములు పొలదిండి వీరులు
కానిపించిరి బలాకలు, మెఱపులు
కలిగిన కారుమేఘముల చందమ్మున
రావణునాజ్ఞతో ప్రళయ సమయ
నీరధిమాడ్కిగ నింగిని ముట్టు ను
త్సాహమ్ముతో వారు తరలిరి వెస
వారి రాకనుఁజూచి వానరవీరులు
నుదిరి త్రికూటాద్రి యూఁగునటుల

సింహనాదముల్ సేయగ స్థిరవణంకె
గగనమెల్లను నిండె సాగరము కలఁగె
లంకలో హయహేషలు, రథసనదము
హస్తి బృంహితముల్ విననయ్యెనపుడు 110

సంకుల సమరము శర్వరీచరులకు
ప్లవగ వీరులకు నారంభమయ్యె
రాక్షసుల్ ద్రుఘణబరశ్వధశక్తితో
మరశూలకార్ముకపరిఘముద్గ
రాది యాయుధముల నగచర కోటినిఁ
బ్రహరింపఁబూనగ ప్లవగులు తమ
దశననఖము లాయుధములుగా వాడుచు
పీఁకుచు, గీరుచు పోఁకుల పయి

వృక్షములు, ఱాలు, రప్పలు విసరివైచి
వారిఁబీడింప దొడఁగిరి దారుణముగ
నసురులును కోట ప్రాకారమందు నుండి
భిండివాలముల్ శూలముల్ విసరుచుండ్రి 111

వానరులుఁబ్రహరికి నెగఁబ్రాకి రజని
చరులఁ గ్రిందికిఁ బడఁగొట్టసాగినారు
క్షణములో నాహవమ్ము భీకరమగుచును
నేల రక్త మాంసములతో నిండిపోయె 112

కపుల యుద్ధవిధానముఁగాంచి దనుజు
లకు నమర్షము మిఱియు బలమ్ము పెరిగె
రావణు జయమ్ముఁగోరుచు రాక్షస బల
ముఱికె రథముల, వాజుల నుగ్రులగుచు 113

స్వర్ణశేఖరయుక్త వాజుల నగ్నిశి
ఖలఁ బోలిన పతాకములను గలిగి
రాజిలు స్యందన రాజిపై సూర్య స
న్నిభతనుత్రాణ సందీప్తులౌలయ
సింహనాదమ్ములఁ జేయుచు దశముఖు
జయసాధనమునకై సాగియుఁడుకు
చుండ వానరసేన శుచివ్రతుఁడగు రామ
చంద్రుని విజయమ్ము సంఘటింపఁ
గోరుచు నిశాచరులపైకి కూడముట్ట
ద్వంద్వయుద్ధము సాగెను దనుజులకును
ప్లవగవీరులకును ఘోరరణముజరుగ
నంబరమునుండి దేవతలరయుచుండ్రి 114

వ. వాలిపుత్రుఁ డంగదునితో నింద్రజిత్తు కలియఁబడెను. విభీషణ సచివుడు సంపాతి. ప్రజంఘుఁడు నొకచోట, జంబుమాలి హనుమంతుఁడు నొక తావున, విభీషణుఁడు మిత్రఘ్నునితోను కలియఁబడిరి. తపనునితో గజుఁడు, నికుంభునితో మహా తేజశ్శాలియైన నీలుఁడు తలపడెను. వానరేశుఁడగు సుగ్రీవుఁడు ప్రహస్తునిమీద పడెను. లక్ష్మణుఁడు విరూపాక్షుని మీఁదికురికెను. అగ్నికేతువు. రశ్మికేతువు, సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁడు శ్రీరామునెదిరించి మరణించిరి. వజ్రముష్టినామక దనుజుఁడు మైందుని, యశనిప్రభువను రాక్షసుఁడు ద్వివిదు నెన్నుకొనిరి. ప్రతీపనుడను క్రవ్యాదుఁడు తీక్ష్ణవేగుని జంపెను. మహోదరుఁడు సుషేణుని, మకరాక్షుఁడు

జాంబవంతుని, కుంభుండు ధూమ్రుని, నరాంతకుఁడు పనసుని, దేవాంతకుఁడు గవాక్షుని. త్రిశిరుండు శరభుని, నకంపనుఁడు కుముదుని. సారణుఁడు ఋషభుని. అతికాయుఁడు రంభ వినతులను, ధూమ్రాక్షుండు కేసరిని, శుకుఁడు వేగదర్శిని, గజుని యెదుర్కొనెను. సుషేణుఁడు విద్యున్మాలి యను నాశరుని నిలఁబెట్టెను. అటులనే మఱికొందఱు వానరయోధులు మఱికొందఱు రాక్షసయోధులతో తలపడి ఘోరయుద్ధముఁ గావించిరి. మహాపార్శ్వుఁడు గంధమాదనుని, విద్యుజ్జిహ్వుండు శతవలిని తక్కిన వలీముఖులను సర్వ శర్వరీచరులు పెనగిరాసమయంబున 115

వైరి సైన్య నాశకుఁడగు వాలితనయు
మొత్త గదతోడ నింద్రజి, త్తోటరియగు
నంగదుఁడు వానివాహముల్ స్యందనమ్ము
నుగ్గు నూచముఁ గావించె భగ్గుమనుచు 116

శరములను మూఁడువైచి ప్రజంఘదనుజుఁ
డపుడు సంపాతిఁ బ్రహరింప నాతఁడశ్వ
కర్ణ వృక్షముతో బాది కసిమసంగె
పరువడి ప్రజంఘు యోద్ధ సంపాతి కినిసి 117

స్యందనమ్మున నిల్చుచు జంబుమాలి
వాయుజుని రథశక్తితో వక్షమందు
కొట్ట నాతని రథముపై బెట్టిదముగ
దూఁకి యఱచేత చఱచుచు దునిమె హనుమ 118

తలపడ నింద్రజి తారాసుతుని తోడ
ద్వంద్వ యుద్ధము సాగె-దానవుండు
గదనొక్కదాని నంగదుపై బ్రయోగింప
నదియ కైకొని వేగ నరదపు నొగ
విఱిచి రథ్యమ్ముల నొఱగఁజేయుచు రథ
సారథి నంకించె కాఱియపడి
ప్లవగుని బలపరాక్రమముల కాశ్చర్య
పడి 'యెవ్వఁడ' వటంచుఁ బ్రశ్న సేయ

'నన్నెఱుంగవ, యింతకు మున్ను నేను
రామదూతగ వచ్చి మీ రమ్య సౌధ
చంద్రశాలను గూల్చిన సాహసికుఁడ !
వాలి తనయుఁడ నేను రావణ కుమార ! 119

అంగవించెద నా నామ మంగదుండు
లంకను దహించి వచ్చిన బింకము గల
పవననందను శిష్యుఁడ-బాహుబలుఁడ !
మేటి కీశవీరుఁడ-లేరు సాటి నాకు 120

లంకాధీశ్వరుఁడైన నీ జనకునిన్ లావొప్ప నా తండ్రి తా
జంకన్ నిల్పుచు నాల్గువార్థులను ముంచన్ బిట్టుపల్లార్పగా
బింకమ్మున్ బలమున్ జెలంగగను నాభీ ఖందుగాఁ ద్రిప్పగా
శంకిన్ దప్పెను ప్రాణ సంచయమునట్టే ! యెంచు మాశౌర్యమున్ 121

ప్రతపనుఁడు నఖనొంపగ నతఁడు వాని
గోళ్లతోఁ బీఁకి కనులు పోఁగొట్టెఁగినిసి
ప్రఘసుఁడు శిలీముఖుల క్రమ్మింగవచ్చు చుండ
సవితృసుతుఁడు వధించె వృక్షమునఁగొట్టి 122

రామచంద్రునిఁదాఁకిన భీమబలులు
రాక్షసులు నొవ్వఁజేయగ రగిలి నాల్గు
శరములను మట్టుపెట్టె నాశ్చర్యముగను
చూపఱున్ రాము స్తుతియించి రేపు మిగుల 123

వజ్రముష్టిని మైందుఁడవారణముగ
నొక్కగ్రుద్దును గ్రుద్దగ నూర్జితుఁడయి
రథముతో, రథ్యముల తోడ రాక్షసుండు
కోటబురుజు కూలిన రీతిఁగూలె నతఁడు 124

కుంభకర్ణుని సుతుఁడు నికుంభుడు శత
మార్గణము వేసి నీలుని మార్కొనంగ
నొడికమున వాని రథచక్రమూడ పెరికి
దానితో ప్రహరించె నాతని దృఢిమను 125

పిడుగు వంటి ద్వివిదుండును విక్రమించి
అశనిప్రభువను దానవు నచలశిఖర
మునను దాడించి విటపితో మోది విరథుఁ
జేసి సారథి, వాజులఁజిదిమివైచె 126

అరుగుదెంచి విద్యున్మాలి యరదమందు
సింహనాదముఁజేసి సుషేణుఁగొట్టి
బండరాయిని విసరుచు వాని రథముఁ
గూల్చి ప్రహరించి శిలతోడఁగూల్చె నతని 127

దేవ దానవులట్లు దితిజులు, వానరుల్
పెనగిరి-రణభూమి విఱిగిపడిన
కరవాలశక్తితోమరపట్టసాదుల
తో కూలిపోయిన తురగసాము
జములతో బ్రుంగిన స్యందనమ్ముల తోడ
చనిపోయినట్టి రాక్షస వనచర
వితతితో నిండెను విపుల సర్వమ్మును
అటనట వఱదులు పాఱిసంచ

రింపఁదొడఁగెను రక్కసుల్ రేయి కొఱకు
ఎదురు చూచుచు నిల్చిరి బెదరుపడుచు
తమకు ననుకూలపడువేళఁదమను భూమి
నాక్రమించెడి వఱకును విక్రమింప 128

రవియస్తాద్రినిఁజేరె చీఁకటులు పర్వన్ యుద్ధభూమిన్ ద్వరన్
ప్లవగుల్ రాక్షసులాజిమానకయె ఘోరంబైన సంగ్రామమున్
దవులన్, వానరులున్ నిశీథమున నౌత్సుక్యమ్మునన్ జంపగా
మివులన్ జేసిరి స్వీయ సైనికులనే మేటిల్లి గుర్తింపకే 129

"చంపుము" "చీల్చుమా" "నిలుము" "జాగొనరింపకర"మ్మటంచు క
వ్వింపులు సాగె నెల్లెడల భీకరమై పరుషమ్ముగా కరా
ళింపులు ఘోరమై చెలఁగె రెక్కానిరేఁగె రణాంగణమ్మునన్
తెంపరులై వధించిరి పదింబదిగా ప్లవగుల్ ప్లవంగులన్ 130

తపనీయ భూషలఁ దాల్చిన మేచక
దానవుల్ తిమిరములోన వెలుఁగు
ధాతువుల్గల భూమిధరములట్లుండిరి
సోత్సాహమున రాక్షసులఁ బ్లవగులు
నమలివేయుచు సత్వరముగను ద్రుతవేగు
లై సంచరించిరి - రహిని ప్లవగు
లామర్షమున వెస నభ్రమ్మున కెగిరి
వాజులఁ కరులను ధ్వజములవడి

చీల్చివేయ దొడంగిరి - చీఁదఱగొని
రక్కసులఁ బీఁకి, కొఱకుచు, రక్కెరెంతొ
దాశరథులును తీక్ష్ణప్రదరములేసి
దనుజులను రూపుమాపిరి ద్రఢిమమిగుల 131

రథచక్రములచే గుఱ్ఱపు గిట్టలవలన
రేఁగి పైకెగయుచు రెచ్చుధూళి
సర్వుల కన్నుల శ్రవణములను దూరి
పీడింపసాగెను పెలుచన వెస

నా తిమిరమ్ములో, నాదుమ్ములో రక్త
మేఱులుగా పాఱె మేరమీఱి
ఆ రుధిరమ్ములో పేరెము వాఱి భే
రీ ఖాంకృతులు కూడ లీనమాచు

వినగనయ్యె గంభీరముగను సమీక
భూమి పడిపోవు యోధుల మూలుగులును
ఖీకరమ్ముగనుండి తపించుచుండె
భూషణమ్ములు పిండియైపోయె పెలుచ 132

దురములో మృతిచెందు యోధుల శవములు
తునిగిపోయిన డాళ్లు. కత్తులు. కటార్లు
కలనులో గూలిపడు తురంగములు, కరులు
కలిగి రణభూమి నడుగిడ కష్టమయ్యె 133

ఎచ్చటఁజూచిన తరువులె
ఎచ్చటఁగనుగొన్న నెత్రుటేఱులె శిలలే
ఎచ్చటఁగాంచిన పలలమె
విచ్చలవిడి చెల్లచెదరి బీతుగొలిపెడిన్ 134

చీఁకటిలోన దానవులు స్తైమముతో రఘునాథు పైని న
ఫ్త్రాక నమోఘ బాణముల నవ్యవధానముగాఁ బ్రయోగమున్
జేకొని సింహనాదములుఁజేయగ నాతఁడుఁ బారియాత్ర మ
శ్లైకలనుంనిలంబడుచు శీవి వధించెను వారినందఱిన్ 135

ఇమ్మగు రాముధాటిని సహింపగనోపక పెక్కు వీరులా
లమ్మొనరింపఁగష్టమయి రాయిడికిన్ బరువెత్తె రాము బా
ణమ్ములతో తటిత్తులటు నల్గడలన్ రణభూమి వెల్గులన్
బ్రమ్మె విపక్షులగ్ని శలభమ్ముల మాడ్కిఁగ మ్రందిరెందఱో 136

దనుజుల సింహనాదమ్ములుఁ బ్లవగుల
అంకెలు రణభూమి ప్రబలమయ్యె
వానితోడ త్రికూట పర్వత మఱ్ఱాడె
వాలిసూనుండు రావణినిఁగూల్పఁ
దలఁచి యాతని గుఱ్ఱముల, సారథినిఁజంపె
ముందుగా-దానితో స్యందనమ్ము
వీడి యదృశ్యమై వెడలిపోయెను-దాశ
రథులు తారేయు విక్రమముఁజూచి

సంతసించిరి-వానరుల్ సవితృ సూతి
యును. విభీషణుఁడాతని యూర్జితమ్ము
సాహసమ్మను మెచ్చి. ప్రశంసఁజేసి
రెంతో-పరిభూతుఁడై పోయె నింద్రజిత్తు 137

ప్లవగులంజూచి పలికెను రాముఁడిటుల
"మీరు సుగ్రీవు కడనుండి మెలఁగ వలెను
బ్రహ్మవరముండెఁగాన రావణికి దాన
వాఁడు పీడించు జగముల బాధ పెట్టు 138

నా కొఱకు నోర్పు వహియింప నయము కలుగు
ననుచు వచియించు చుండ రావణి యరుదుగ
కినిసి నాగాస్త్రములఁ బ్రయోగించె జలద
పటలిలో దాఁగికొనుచు నపారముగను 139

మత్తకరి యింద్రజిత్తు విసుమానముగా వెస నాగపాశబం
ధితులను జేసి తోడనె యదృశ్యుఁడుగా ప్రహరించెఁ బెల్లుగన్
శితశరముల్ ప్రయోగమును జేయుచు దేహములందు రక్తముల్
ప్రతివిధి యేఱులై దొఱయ ప్రాకృతుఁడై రణనీతి దూరుఁడై 140

ఎచ్చటనుండి కాండములనేయుచు నుండెనొ యింద్రజిత్తు పా
టచ్చరుఁడౌచు, వానరభట ప్రకరమ్ము మసు పాలుపోవకా
పొచ్చె మెఱుంగ నభ్రమున పోయిరి భూరుహ పాణులై ద్రుతిన్
మచ్చరకాని పోల్చుకొని మార్కొని చంపు ప్రయత్నమందునన్ 141

ఎంతకు మేఘనాదు పొడయే కనిపింపక పోవ వానరుల్
చింతిలి భూమిపై దిగిరి చేయునదేమియు లేక, దైత్యుఁడున్
వింతగ వారి వేగమును విన్నన నాపఁగ, నిస్సహాయులై
భ్రాంతిని వీడలేక నిలువంబడిపోయిరి చేష్టదక్కుచున్ 142

ములుకుల దెబ్బలన్ విఱుగఁబూసిన మోదుగు చెట్లరీతిగన్
బొలిచిరి రామలక్ష్మణుల ముద్దుశరీరము లస్రసిక్తమై
పలికెను రావణాత్మజుఁడు వారలఁ గాంచి యదృశ్యుఁడై వెసన్
కలను నొనర్ప నింద్రుపకు కష్టమె-నన్ దరియంగలేరుగా 143

కనుగొనలేరు నన్ను విశిఖమ్ముల ముంచుచు మిమ్మునిప్పుడే
పనుపగలాడ ్ి జముని పాలికటంచును జెప్పి బాణముల్
కనలుచు వీడుచున్ బకపకన్నగి హేళన పూర్వకమ్ముగా
చనువుగ సింహనాదమును సల్పెను గర్వము ప్రస్ఫుటింపఁగన్ 144

కాయములను విశిఖమ్ములు గ్రుచ్చుకొ
నంగ రాజ సుతులు నవసి వఁణకి
ఇంద్ర ధ్వజములట్టు లిలపైన వ్రాలిరి
అప్పుడు ప్రస్రవణాద్రిమీఁదఁ
బ్రభవించి క్రిందికి ప్రవహించు సెలయేఱు
లట్టుల వారి దేహములనుండి
నెత్తురు వరదలై నెలవు కొనెన్ మును
ముందుగా పడెను రాముండు ధరణి
అతఁడు పడిపోయినను కూడ నతనిహస్త
మందు సంధాన మొనరించినట్టి విల్లు
కలదు-దానిఁ జూచి లక్ష్మణుఁడు భ్రాత
ప్రాణములపైని సంశయపడెను బెదరి 145

రామచంద్రుఁడు నేలపై వ్రాల నతఁడు
వంతఁగుందెను ప్లవగులు బాధపడిరి
వానకురిసి వెలయునటు దానవుండు
నూరుకొన విభీషణుఁడార్కి చేరిరటకు 146

ప్లవగవీరులు చూడనంబరము వైపు
కానరాడయ్యె నింద్రజి కాని వానిఁ
గాంచెను విభీషణుండు రాక్షసుఁడు కనుక
మాయలెఱిఁగిన వాఁడ సామాన్యుఁడగుట — 147

తన కావించిన ఘోర కార్యమును ప్రస్తావించి గర్వమ్ముగా
ననెఁ గ్రవ్యాదుల తోడ రావణి "విపర్యాసమ్ము గుర్తించి రే
దునుమంజాలితి రామలక్ష్మణుల నస్తోకత్వముంజూపి నా
జనకున్ ధన్యునిఁజేసినాడనుగదే సంఘర్షణన్ మాన్యుచున్ — 148

ఈ నాగాస్త్రపు బంధమెవ్వరును దూలింపంగలేరెన్నడున్
దానన్ దండ్రికి నిద్రపట్టునిఁకమీఁదన్-లంకకే బాధలే
కానందమ్ముగ నుండు నెప్పటి వలెన్ వ్యాకూతి శూన్యమ్ముగా
సేనాదమ్ము సురక్ష సేయగను సౌహిత్యమ్ముఁగోల్పోవకే — 149

ఎవని మూలమ్మున నీ లంక వర్షాన
డింబోలి కలఁగుచు దీలుపడునొ
దానికి హేతుభూతంబైన రాముని
సంహారించితి నేను సర్వకేశ
వీరుల బలమును విక్రమంబును రామ
లక్ష్మణులిర్వురి లావు, లవణి
నిష్ఫలంబై పోయె నిగుడు హరించితి
నా శౌర్యమునను వినాశమయ్యె

ననుచుఁదక్కిన ప్లవగుల నమిత తీవ్ర
బాణములఁ బ్రహరించుచు బ్రధనమందు
నీలమైందద్వివిదనళవాలితనయ
పవన నందన ప్రముఖుల బాధపెట్టె 150

రామలక్ష్మణులిర్వురు భీమబలులు
ధరణిపై పడి యుండగ దర్పమెంతొ
దీపిలగఁజూపి చేతితో దితిజులకును
సింహనాదముఁగావించె చెలఁగి యతఁడు 151

రావణి మాటలన్ వినిన రాక్షస వీరులు సంతసించుచున్
వావిరి మెచ్చుకొంచు నతివన్ దమకింపగ పెద్ద గొంతులన్
భావన సేసె నింద్రజియు వారు మృతింగనిరంచు తెల్లమై
పోవగ శ్వాసలాఁగ వడిపోయెను లంకకు వార్తఁజెప్పగా 152

పరమానందము పొందిరి
మరణవార్తఁదెలిసికొన్న మనుజాశనులున్
పరిపాలకుఁడును దనయుని
మురిపెమునం గౌఁగిలించి మూర్కొనె శిరమున్ 153

వివరములన్ వచింపుమన వెంటనె యింద్రజి సర్వసంగతుల్
సవరన విన్నవింప పరుసన్ ముదమందుచు వైరి చావగన్
రవరవలన్ని పోవునని రావణుఁడాకు జ్వరమ్ము వీడగా
శివము కలుంగు నంచుఁదలఁచెన్ మది సాంత్వనమై చెలంగఁగన్ 154

అనఘుని దేహమందు ప్రతి యంగుళమున్ విశిఖంపు దెబ్బలన్
గనుగొని భానుసూతి కడు కాఱియనందె ౘ వానిఁజూచుచున్
మనసరియౌ విభీషణుఁడు మన్ననఁజూపుచు పల్కె "మిత్రుఁడా
దునుకకుత్రాసమొందకుము దూరము సేయుము నీ కలంతయున్ 155

యుద్ధములనంగ నిటులుండు నిద్ధచరిత !
స్థిరము కాదయ్య విజయము నిరతము సుమి
మన యదృష్టము మిగిలిన మ ౘ జవిభుఁడు
సొమ్మవిడిపోయి స్మృతి వచ్చుసుమ్మ రవిజ ! 156

నీవున్ ధైర్యముతో మెలంగవలెఁ గన్నీళ్లేల సన్మిత్ర ! నే
నావిగ్నుండనె! నే ననాథనగుటన్ ధ్యాతుండుఁగూలన్ మదిన్
చేవం గూర్చుము సత్యధర్మముల వాసిన్ నమ్మకంబున్న సు
గ్రీవా ! మత్యవు చావబుంఘు ఁమ డిచెన్ గేలన్న శ్రుసందోహమున్ 157

రవిజ ! యిది విచారించు కాలమ్మ కాదు
అతి విచారము మృత్యువు కనువు సేయు
దాన సర్వము పాడౌ నధైర్యమీవు
విడిచి కపిసేన సంగతి తడవ మేలు 158

ప్లవగపతి ! దాశరథులఁగాపాడుమయ్య !
తెలివి వచ్చెడి వఱకును తెలివి రాఁగ
వారు మన యందఱి కృపఁగాపాడగలరు
భయము లేదు రాముని కేమి-భద్రమగును 159

మరణింపఁడు శ్రీరాముఁడు
మరణించినఁ గళలుతప్పి మాఱుమొగ మగున్
కరణీయము వానరులకు
పరువడి ధైర్యమ్ముఁ జెప్ప భావ్యంబగుగా! 160

నీకు ధైర్యమ్ము చెప్పక
నీ కపులను జూడు మిపుడొకళ్లొకరితో
ప్రాకటముగ గుసగుసలన్
వాకొనుచున్నారు మివుల భయపడుచు వెసన్ 161

నేనంత చక్కపెట్టెద
వానరులకు ధైర్యమిచ్చి భయముడిపెద సూ!
దానన్ వీరులు వాడిన
సూన స్రజము విడుచునట్లు చూచెదను సఖా! 162

అని యూరడించె రవిజుని
వినయముతో విభీషణుఁడు వేద్యమొనర్పన్
వనచరపతి ధైర్యముతో
జనపతి నందనులఁ గాయు జతనముఁజేసెన్ 163

వ. కృతార్థుఁడనైనానని యనుకొని యింద్రజిత్తు లంకలోనికి వెడలిన యనంతరము వానర ప్రముఖులు రామునిఁ బరివేష్టించి దుఃఖించ సాగిరి. వారిలో హనుమంతుఁడు. నంగదుఁడు. నీలుఁడు. సుషేణుఁడు, కుముదుఁడు నళుఁడు, గజుఁడు, గవాక్షుఁడు, గవయుఁడు, శరభుఁడు, గంధమాధనుఁడు,

జాంబవంతుఁడు, వృషస్కంధుఁడు, రంభుఁడు, శతవలి, పృథువు మఱి యును విచారించిరి. వానర వీరులు చెట్లు, చేమలుఁ జేతపట్టుకొని పైకి, క్రిందికి, ప్రక్కలకు చూచుచు గడ్డిపరకలు కదలిన రాక్షసులు వచ్చుచున్నా రని కంగారు పడుచుండిరి. 164

మేఘనాదుఁడు వెడలినమీఁద పంక్తి
ముఖుఁడు సీతకు కాపున్న పొలతులఁ బిలి
పింప నాయకురాలగు వెలఁది త్రిజట
వారితో వచ్చి నిలిచె రావణునిమ్రోల 165

పంక్తికంధరుఁ డప్పుడు వారిఁజూచి
తెలిపె నింద్రజి రాము వధించెననుచు
జానకికిఁ జెప్పి యామెఁ బుష్పకముమీఁద
తీసుకొనిపోయి చూప నాదేశ మొసఁగె 166

ఎవనిఁజూచుచు గర్వియై యింతి సీత
ననుఁ దిరస్కరించునో యట్టి నాథుఁడైన
రాముఁడును సహజుండును రణమునందు
నీల్గ నిర్విచారముగ నన్నేలుకొనును 167

నెలఁతయిప్పుడు నిశ్శంక నిర్విచార
ముగను నిరపేక్షగా సర్వ భూషణములఁ
దాల్చి నన్ సుఖపెట్టును-ధవుఁడు ప్రమందెఁ
గనుక గతిలేక ననుఁబొందఁగలదు సీత 168

"సరియె" యటంచు నాశరలు చయ్యన నంతటఁబుష్పకమ్మునన్
గరితను సీతఁదీసికొని గ్రక్కున చేర్చిరి యుద్ధభూమికిన్
దురదుర రావణుండుఁ బురిఁదోరణముల్ వెలయింపఁజేసి దా
శరథుల నింద్రజిత్తు వెసఁజంపె నటంచును జాటఁబంచగా    169

పుష్పకమ్మునఁబోయి భూమిజ రణభూమి
  వీక్షించెఁగపిసేన విపుల పైని
పడియుండ, రాక్షసుల్ పరితోషమునఁబొంగి
  పోవుచు చరియింప కావరమునఁ
గనుఁగొనె రామలక్ష్మణుల ప్రక్క నివిష్టు
  లై వానరులు దీనులై వగవగ
వపువులు నిండిన బాణమ్ములను పడి
  పోయిన దశరథ పుత్త్రులఁగనె

నిద్ది పరికించి యవనిజ యేర్చు హృదిని
క్రిందపడిపోయి పొరలి దుఃఖించె పెలుచ
గోడుగోడున పనవెను కుమిలి కుమిలి
ఆపుకొనలేని వేదన నాపటిల్లి    170

సాముద్రికమును లెస్సగ నెఱింగిన వారు
  నేను ముత్తైదువుగా నిలుతును
సంతానవతినౌదు సాగు జీవితమను
  మతము వెలార్పగ హృతినిఁబొందె

పతి-వారి మాటలు వ్యర్థమై పోయెను
విభునితో యజ్ఞముల్ వెలయఁజేతు
ననుచును విషయజ్ఞులందఱు తెలిపిరి
అశ్వమేధముఁగూడ నాచరింతు

నని వచింప నసత్యమై చనియె నదియు
నేను నిత్య సుమంగళిగా నిలిచెద
నని వచించు సిద్ధాంతుల యభిమతమ్ముఁ
గూడ తప్పెను నా పట్ల కొందలపడ 171

వీరపార్థివపత్నివై వెలయుదువని
ధన్యురాల వటంచు నందఱు వచించి
అనృతవాదులై పోయిరి-ఘనతనొసగు
పద్మరేఖలు స్పష్టమౌ పదయుగళిని 172

పై లక్షణమ్ములఁ బ్రతినాతి ధవునితో
పట్టాభిషేక వైభవముఁ బొందు
తరుణుల నెపుడు వైధవ్యము గలిగించు
చిహ్నముల్ నామేనఁ జిందుకొనవు
నా కురుల్ పొడవులై నల్లనై చెలఁగును
కనుబొమల్ విడివిడిగా రహించు
జంఘలు గుండ్రమై చక్కగా రోమర
హితములౌ దంతాల నెడములేదు

హస్తములు నంగుళులు తొడ లడుగుదమ్ము
లందముగ గుండ్రముగ నుండు నద్భుతముగ
ఒరసికొనుచు బలిష్ఠమై యుండుఁ జనులు
బలిసియుండును పార్శ్వముల్ వక్షసీమ 173

పొక్కిలి లోతుగనున్నది
ప్రక్కలు వక్షస్థ్సలమ్ము వరలు బటువులై
ముక్కు తిలపుష్పసమమౌ
చెక్కిళులున్ స్నిగ్ధమగుచు చెలఁగు రమ్యమై 174

ఇనకులరత్నదీపమ : మహేచ్ఛ : మనోహర ; ప్రాణనాథ ! నీ
వనితను జూడకుండగనె ప్రాణములన్ ద్యజియించినాడవే
రణమున క్షుద్రదానవుఁడు రజ్జులనాడుచు మాయయుద్ధమున్
బొనరుప దుర్జయుండగుచు భూమిఁ బొకాలుచుఁ గూలిపోతివే ? 175

దిక్కుగ నిన్నుఁ జూచుకొని, తీఱును దుఃఖము నేఁడొరేపొ యన్
చక్కని యూహనింపుకొని చావక నిల్చితి మానసమ్మనన్
మిక్కిలి తర్జనల్ సలిపి మిన్నక బాధలు పెట్టుచుండినన్
వెక్కసముల్ వచించిన స్రవింపగ నశ్రులు సైచితిన్ ప్రభూ ! 176

నీ మృతివార్త నాయెడఁద నీఱయిపోవుచు దుఃఖనీరధిన్
రామ మహీశ ! నా శ్రవణ రంధ్రములున్నవి మూసిపోవకే
భూమిజ నిల్చియుండె నసువుల్ విడనాడక మొండికట్టెగా
ఏమను దాన! నిన్ను దురదృష్టము వీడక వెంబడింపగన్ 177

వంతనుగుందు నాకు విధవాత్వము కూడను సంక్రమించె నా
కంతయు జాలిలేని విధి యాటకు బద్ధనొనర్చె క్రూరతన్
పంతముఁబూని నా యెడల-భాగ్యవిహీనను నాదు స్వాంత మిం
తింతలు గాక నిల్చె నిసిసీ ! దెగటారెద నాథు వెంబడిన్ 178

వ। అని శోకించి సౌమిత్రిం జూచి 179

అన్నతోడిదే లోకమంబెన్నడతని
వీడకయె చరియించుచునేఁడతఁడు
కూలి రణభూమిలో నుండ జాలి మాలి
ఊరుకొని యుండ నీకిది యుక్తపడునె ? 180

ఆఁకలి దప్పటన్ నిదుర నన్నియు వీడుచునన్నకోసమై
వీఁకచరించి సంతతము విద్వరముం గడవంగఁ జెట్టు నీ
ప్రాకట సౌమ్యలక్షణము భంగమొనర్చుచు నిద్రఁగూర్కుచున్
శోఁకుల భూమిలో నిటుల క్షోణిశయించుచు నుండ న్యాయమే 181

అన్నకుఁదగ్గ వీరుఁడవు-అహవరంగమునందు నిత్యమున్
మన్నిగొనంగఁజాలుదువు మార్తురఁదావక సాయకమ్ములన్
చిన్నతనమ్ము నీబల విజృంభణమున్ బొనరింపకే యిటుల్
బన్నపడంగ క్షత్రియుఁడవై యలవోకగ నేలకూలితే ? 182

కడవగ కష్టమౌ జలధి గ్రక్కున వారధిపైని దాఁటి యి
ప్పుడమిని మాయ రాక్షసులు పోరున మిమ్మలయింప ప్రాణముల్
విడిచిరె మీరలిద్దఱును విక్రములయ్యును కూటకమ్మనన్
ముడుఁగఁగనయ్యొ మీ మరణముల్ గని నేను చలించిపోయితిన్ 183

ఎట్టి బలాఢ్యుఁడైన మఱియెట్టి మనోజవముండ్న వైరియున్
దిట్టఁడు రామ భూవిభుఁడు తెంపరియై మడియించు పేర్మితో
బెట్టిదుఁడౌచు నాతఁడె గభిల్లున కూలుచు దీర్ఘనిద్రలో
చట్టనమున్గి యుండెను ప్రచండుఁడెయైన విపర్యమ్మునన్ 184

వనవాసమ్మునకేఁగి వచ్చు సతితో పద్నాల్గు వర్షంబులేఁ
గిన తర్వాత నటంచు నాశమెయి కాంక్షింపంగఁగౌసల్యకీ
తనయుండీల్గిన వార్త చేరగను నైదాఘమ్మునందేఱురీ
తిని క్షోభించుచు ప్రాణముల్ విడుచు కాదే పెద్ద దుఃఖమ్ముతో 185

అస్త్రశస్త్ర ప్రయోగములన్ని తెలిసి
వాని నుపసంహరించెడి వైన మెఱిఁగి
నన్ననాథను గావించి నా ధవుండు
నిధనమందెను దయమాలి ప్రధనమందు 186

వ। అనుచు విలపింపందగు వాక్యమ్ముల శోకమ్ము వారింపఁదలఁచి త్రిజట యద్దేవి నవలోకించి 187

నాకున్ దోఁచవు మోములన్ మరణ చిహ్నాంబుల్ విలోకింపగా
నో కల్యాణి ! మహాత్ములున్ బ్రదికియే యున్నట్లు కన్పించెడిన్
వైకల్యమ్ములు లేవు, చచ్చిన యెడన్ వైవర్ణ్యమేపారు సూ
చీఁకన్ బ్రమందిన లక్షణమ్ములకు తావేలేదు సీతాసతీ ! 188

అనవసరముగను నీవీ
వనటఁబొగులఁగాదు వీరి వక్త్రములగనన్
కనిపింపవు శవచిహ్నము
లనపాయురు రాముదేవి ! యంతయు శుభమౌ 189

లలన ! కనుంగొనంగ మృతలక్షణముల్ కనరావు-ప్రాణముల్
తొలఁగిన దేహకాంతులిటుఁ దోప వనాయకమైన సేనలున్
నిలువవు-వారె వానరులనేకులఁజూచితె ? వామనేత్రమున్
కలఁగు-శుభమ్ములున్ బొడము కావున సందియమున్ దొలంచుమా ! 190

మగువ ! మృతులైన దివ్యవిమానమెపుడు
విధవ యగు నిన్ను భరియించు విధము లేదు
పృతన కధిపతి మరణింప పృతన కర్ణ
ధారిలేనట్టి నౌకయై దారి తప్పు 191

సేన సర్వము నిశ్చలమై నిలుచును
రామలక్ష్మణులను గాయు రక్షితముగ
స్పష్టముగఁదోఁచు నిట్టి లక్షణములఁగన
బ్రదికి యున్నట్లె కనిపించుఁబతియు, మఱఁది 192

ఉవిద : ధైర్యమ్ముగా నుండుము-నేనిది
సర్వము నీ మీఁది సఖితఁజేసి
చెప్పు చుంటిని-నేను చెప్పనసత్యము
ముందును నిఁక ముందు ముదుకనగుట

శీలవతివి గాన సీతామహాదేవి!
చక్కగా నామది కెక్కినావు
దేవతలేకాదు - దేవేంద్రుడునుగూడ
రామలక్ష్మణుల గెల్వంగలేరు

రాఘవులకున్న పెక్కు సల్లక్షణములఁ
గాంచి నీకిది నేఁ జెప్పఁగలుగుచుంటి
మాటయును, చూపులేకుండ మహినిద్రాలి
యుండిరేకాని బ్రదికియే యుండిరిసుమి 193

సాధారణమ్ముగ చచ్చిన వారి మొ
గమ్ములఁ గళ తప్పు కాని వికృత
ములు కావు వీరి మోములు పరికించిన
శోకింపకుము రాజసుతులు నింక
బ్రదికియే యున్నారు రామలక్ష్మణుల కో
సము బ్రదుకగను నశక్యమేమి
కాదంచుఁ ద్రిజట పల్కగ వినుచు దృఢము
గా కరమ్ములు మోడ్చి కాంత సీత
నీవు పల్కిన దంతయు నిజమెయగును
గాక యనుచు వచింప నాకాశగామి
యై విమానము లంకకు నరుగ మరల
సీతతో త్రిజటయు రాక్షసీపరివృత
యై యశోకవనమ్మున నడుగుమోపె 194

వ॥ కొంతవడికి శ్రీరామచంద్రుఁడు మూర్ఛఁదేఱి కనులువిచ్చి నెత్తుటి వరదలో మునిఁగియున్న లక్ష్మణునిఁ గాంచి దుఃఖితాత్ముఁడై 195

ప్రాణాధికుఁడగు తమ్ముఁడు
ప్రాణమ్ములు వీడ పత్నిపని యేలను? నా
ప్రాణము లేలను? కార్ముక
బాణమ్ములతో పనేమి? ఖండనమేలన్? 196

అయ్యొ! విపక్షప్రోలునఁ బ్రియానుజుఁడిట్టులఁ గూలిపోవగా
తొయ్యలితోడ ఖండనముతో పనియేమిఁక ప్రాణమేటికిన్?
నెయ్యుర కూటమెందులకు? నే నిపుడేఁగ నయోధ్యనందఱున్
దుయ్యరె? నాతి, లక్ష్మణులతో చనుదెంచమి పృచ్ఛనేయుచున్ 197

పరిపంథి వీటతమ్ముఁడు
మరణింపగ నోటుపడుచు మగువ సీతకై
దురమొనరింపగ నేలా?
శరసంధానమ్మలేల? సైన్యంబేలా? 198

ఆరవ ప్రాణము సోదరుఁ
డీరణమునఁ గూలిపోవ నేటికి ప్రాణం
బోరగిలగ న్యాయంబగు
దూరంబొనరించి నాప్రతున్నపథమునన్ 199

లోకమ్మున నెచ్చటనో
నాకు దొరకు సీత వంటి నాతి, సచివుడున్
ప్రాకాశ్యము గల తమ్ముం
డేకాగ్రుడు దొరక కష్టమె త్తఱినైనన్ 200

భల్లూకప్లవగులు పరికించుచుండ నా
ప్రాణముల్ త్యజియించు వాడ నిపుడ
సవితృనందన : నీవు ప్లవగ సైన్యమ్ముతో
కిష్కింధ కేగుము కీటుపడక
నేను లేననుకొని దానవనాథుడు
తఱిమికొట్టగ వచ్చు తథ్యముగను
ఓవిభీషణ ! నీకు నేవిధి లంకకు
భూపునిగావించు పొలుపు లేదు
పరులు చేయగ లేనట్టి పని యొనర్చె
హనుమ-జాంబవదాదులు నని యొనర్చి
రెంతొ గొప్పగ దానికి సంతసింతు
ద్వివిద మైందులు చూపిరి విక్రమమ్ము 201

అంగదుడు కూడ కష్టించి యాజి నేసె
గజుడు. గవయుడు శరభుడు, గంధమాద
నుండును, గవాక్షుడును ఋషభుండు, రంభు
డెంతొ సాయము గావించి రిష్టపడుచు 202

స్నేహితుండెంత నేయునో నీవు నాకు
చేసినాఁడవు సుగ్రీవ ! వాసి కెక్కి
శక్తివంచన లేకుండ సాహసులయి
రణము చేసిరి వానర ప్రముఖులార ! 203

"ఇదిగొ ! నేననుజ్ఞను మీకు నిచ్చు చుంటి
వెడలిపొండు యథేచ్ఛగా వీరులంత"
కపులిదివినుచు బాష్పముల్ కనుల నింద
నింపుకొనిరి శ్రీరాముని నియమమునకు 204

కౌసల్య జానకి కనరాదటంచన
నేమని చెప్పుదు నామె తోడ
సుతుఁడు లక్ష్మణుడేల చూపట్టడంచు సు
మిత్ర నన్నడుగదే యాత్రముగను
భరత శత్రుఘ్నులు భ్రాతయేడనుచు పృ
చ్ఛింపగ నేనేమి చెప్పగలను ?
చనిపోయెఁగాదె లక్ష్మణుఁడు నా కోసమై
బ్రదుకేల నాకు కొల్పన మతేమి ?

అపుడు నేను దుఃఖింపగ ననుజ నీవు
యాశ్వసించెడి వాఁడవె యనునయించి
ఇపుడు నేను శోకింపగ నెందు వలన
మాటలాడవదేమి లక్ష్మణ కుమార ! 295

యుద్ధమునఁ బెక్కు రాక్షసయోధులఁగసి
మసఁగి నిహతుఁడై పడియుండె మహిని లక్ష్మ
ణుండుఁ గ్రుంకఁగ నున్న భానుని పగిదిగ
తోఁచుచుండె నా కనులకు ధూర్వహుండు 206

అడవులకు నేను వచ్చెడి యవసరమున
వెంటఁబడి వచ్చె నాతఁడు విహ్వలించి
అతఁడు యమపురి కేఁగెడి యవసరమున
నే ననుసరింతు నాతని నేయముగను 207

ఎల్లపుడు నన్ను బందుల నిష్టపడుచు
ననుసరించెడి వాని కీ యదనున మృతి
వచ్చె నా మూలమున దురవస్థ కలిగె
కోపమెంత వచ్చినఁ గూడ నోపెనెపుడు 208

వేయిచేతుల కార్తవీర్యార్జునందొక్క
సారై దువందల శరములేయు
సామర్థ్యమును గల్గ సహజుఁడు లక్ష్మణుఁ
డంతకు మించిన యలుగు లేయు
రెండు చేతులతోడ మెండుకొని యితండు
తన బాణములఁ బురందరుని మార్గ
ణమ్ములఁ బ్రహరించు నిమ్ముగా మృదుశయ్య
లందున శయనించు నతఁడు కటిక

నేలపై పండుకొని యుండె తూలిపోయి
నాకు సచివుఁడు, మిత్రుఁడు నన్ను నీడ
వోలె వెంటనంటుచు నిత్యమును చరించు
రక్షకుండౌచు బరఁగు నీ లక్ష్మణుండు 209

అంతలోన విభీషణుఁ డరుగుదెంచి
సవిత్ర సూతికివచియించె జయము-ప్లవగు
లతఁడు కాటుక కొండగా నగపడంగ
నింద్రజిగ నెంచి పరువెత్తిరిటకు నటకు 210

నుడిగుండమ్మునఁ జిక్కు నావపగిదిన్ సుగ్రీవుఁడానిగ్నుఁడై
యడిగెన్, వానరసేన భీతిలుచు హాహాకారముల్ సేయుచున్
కడిఁదిన్ బాఱగ హేతువేమియని యౌత్కంఠ్యముఁ జూపింపగా
నుడివెన్ తారసుతుండు రాఘవులు దీనుల్కాఁగ క్షోభించుచున్ 211

ఇదియొకటె కారణమ - వీరు లదవద పడ
వేటొకటి యుండియుండును విహ్వలింప
సిగ్గుఁ లజ్జయు లేకుండ బెగ్గడిలుచు
పడిన వీరులపై దాఁటి పరుగుఁదీయ 212

అనుచు పల్కుచుండ నర్కజుఁ డంతలో
నరుగుదెంచి రావణానుజుండు
జయముచెప్ప తనకు సవిత్రసూతి వచించె
జాంబవంతుఁ గాంచి సమరసముగ 213

వచ్చెను మా విభీషణుఁడు
మచ్చరీడు యింద్రజిత్తు మగుడివచ్చెనం
చుచ్చండముగా ప్లవగులు
కచ్చియతో పరుగుఁ దీయ కారణమేమో ! 214

వనచరులు జాంబవంతుని వచనములను
ధైర్యమునుఁ జిక్కఁబట్టి వితాకుమాని
వెనుక కేతెంచి రపుడు రవిజుని కడకు
సిగ్గుపడుచు వినీతులై చెచ్చెరమెయి 215

అంత దశాస్య సోదరుఁడు నా రఘుమౌళి, సుమిత్రసూతి వి
భ్రాంతమనస్కుఁడై దరిసి వారల బాష్పము లొత్తి ప్రేముడిన్
వంతను గుంది రాఘవుల పాటున కబ్బురమొంది రాక్షసా
క్రాంతికి లజ్జనొందుచు దురాగతమున్ దెగనాడె నివ్విధిన్ 216

సత్యపరాక్రముల్ సత్త్వసంపన్నులు
నైన రాఘవులు మాయావులగు ని
శాచరుల్ వలన దుస్సహ పరిస్థితి నంది
ధరణిపై పడి యుండి రరుదుపడుచు
దుడుకఁడై మా యన్నకొడుకు దుర్మార్గుఁడై
కూటయుద్ధమొనర్చెగోసఁగియయి
ఎవరి పరాక్రమ మేపారగా ప్రతి
ష్ఠను బొందు నాశతో సంచరించు

నాకు-వారిటులుండ భగ్నమ్మెనాదు
రాజ్యకాంక్ష-నావైరి బలమ్ము పెరిగి
పైగ కృతకృత్యుఁడౌనేమొ : బ్రదికి యుండి
నేను చచ్చిన వానిగా నెగడనయ్యె 217

కపివిభుఁడు విభీషణు నంతఁగౌఁగిలించి
పలికె 'ధర్మజ్ఞ ! లంకాధిపత్యమీవు
పొందగలవు-సందియపడి డిందుపడకు
రావణుఁడు మేఘనాదుఁడు పోవ గలరు 218

అనుచు సాంత్వన మొనరించి యతని శ్వశురుఁ
గాంచి యాదేశమొసఁగె నీ యంచితులను
తెలివి వచ్చిన తరువాతఁదీసికొనుచు
పొమ్ము కిష్కింధ కనుచు నృపుండు పేర్మి 219

ఘనుఁడ ! సపుత్రబాంధవముగా దశకంఠు వధించి జానకిన్
గొనుచును వచ్చెదన్ పిదప కూరిచి శాంతిని వీరినిద్దఱిన్
పనిగొని చూచుచుండుము-విపన్నులఁ గాంచుము కుస్తరించుచున్
వనచరనేత గౌరవము ప్రాపు నొసంగి కృతజ్ఞతా విధిన్ 220

వ॥ అనవుడు సుషేణుఁడు క్షీరసముద్రమున కుత్తర భాగమ్మునం జంద్ర ద్రోణ పర్వతములు గలవందు విశల్యకరణి, సంజీవ కరణి యను మహౌషధు లుండు వానిని దెచ్చుటకు హనుమంతుండు సమర్థుండు కావున నతని నిప్పనికిఁబనుచునది కార్యంబనుచు వచించు చుండ 221

చూచుచుండు నంత సుడిగాలి విసరెను
అంబుధులు కలంగె నద్రులదరె
పెల్లగిల్లె వృక్షవితతి పృథ్వివణంకె
వైనతేయు రాక వలన నపుడు 222

గరుడుని రెక్కల ధ్వని విని
యురగమ్ములు భీతినంది యొక్కుమ్మడిగా
పఱచెను విడివడి దూరం
బరిగెను రాఘవుల వీడి యారట పడుచున్ 223

వ॥ ఇట్లు బంధమోచనము చేసి తన్ను వానరపుంగవు లచ్చెరువున పరికించు చుండ రామలక్ష్మణుల వదనముల నిమురుచుఁ బక్షమ్ముల విసరగా వారి గాయములు మాని తొలుతటి వర్చస్సు పుంజుకొనెను. 224

గరుడి స్పర్శవలన కలిగెను తొలుతటి
బలము, కాంతి, బుద్ధి, ప్రభయు, తేజ
మురవడించె వీర్యముద్ధృతమయ్యెను
స్మృతియు వచ్చి వారు చెలఁగిరెంతొ 225

నాగబంధ మోక్షణమ్ముఁ గావింపఁగ
వైనతేయుఁ గాంచి ప్రభువుపలికె
మమ్ముఁగాచి నీవు మన్నించితివి గాన
తండ్రి తాతలటులఁ దలతునిన్ను 226

మాకీయాపదఁ బాపి కాచితివి సుమ్మా ! నీదు వైనమ్ములన్
నాకుం దెల్పినచోఁ గృతజ్ఞుఁడను మాన్యా ! రూపసంపన్న ! స్వ
ర్లోకమ్మందున నుండువాఁడవని నాలో దివ్యభావంబెదో
ప్రాకామ్యమ్ముగఁ దోఁచుచుండె నిగదింపన్ వేఁడెదన్ గ్రన్ననన్ 227

అనగ సుపర్ణుఁడా యనఘుతో వాకొనె
మహితుఁడా ! నే గరుత్మంతుఁడ సుమి !
పంక్తికంధరు నీ వవశ్యము వధియింతు
వమరభూసురహితమమరఁజేతు
వందులకే యిపుడరుదెంచితిని నేను
దేవరబంటుగాదే ! రఘువర :
అని రాముఁ బొగడి వీడ్కొనిపోయె గరుడుఁడు
హర్షవార్ధిని మున్గె నంచితుండు
తరుశిలాపాణులై వనచరులు మరల
సింహనాదముల్ సలుపుచు చెలఁగ నసుర
నేత తన్మహారవము విన్పింప విస్మ
యమున మంత్రుల రప్పించి యనియె నిట్లు 228

"అదిగో ! వింటిరె ! కపులెటు లార్చుచుండి
రో దెసలదరగ మరల రూక్షణముగ
చిత్రముగ నుండె నింద్రజి చెప్పలేదె !
దాశరథులీర్గినారని - తప్పెనద్ది 229

దాని నిజము తెలియ దానవనాథుండు
తగినవారిఁ బనిచె తథ్యమేదొ
తెలిపి రండటంచు దినకరుఁడుదయించి
కుదురుకొనెను పొడుపు గుబ్బలిపయి 230



# చతుర్థాశ్వాసము

ప్రాకారమ్ములనెక్కి దానవులు దూరంబందు వీక్షింపఁగా
వీఁకాకుల్ విడనాడి వానరులు నిక్షేపమ్ముగా నుండుటన్
సోఁకుల్ కొందఱు మాఱువేషముల నస్తోకమ్ముఁగాఁ జూడగా
వీఁకన్ గన్పడ రామలక్ష్మణులు నిర్భీతిన్ విడంబించుచున్ 1

నాగబంధవిముక్తులై నారు రామ
లక్ష్మణులటంచుఁ దెల్పిరి రావణుఁగని
యది వినుచుఁ దెల్లపోవుచు నఱచెనిట్లు
లతివిషణ్ణభావమ్మున నసురనేత 2

తన వరప్రభావమ్మున దాశరథులు
ఘోర సర్పసదృశమైన నారసములఁ
గట్టిపైచిన వానిలంఘనముఁ జేసి
బ్రదికిరన లంకకేదొ యాపదఘటిల్లు 3

వ॥ అనుచు నతఁడు కుపితమానసుఁడై ధూమ్రాక్షుఁడను వానిం గనుం గొని వీరాధివీరా! నీవు గొప్ప బలముతో వెడలి శత్రువుల జయించి రమ్మని యాదేశింప నా నిశాచరుఁడు బయలుదేర నతనివెంట బయలుదేఱిన రాక్షస సైనికులు మదమాతంగతురంగాదులఁ గైకొని వెంటనడవ నప్పుడు 4

కొందఱు స్యందనముల పై
కొందఱు ద్విరదములపైని, గుఱ్ఱమ్ములపై
కొందఱు నడచుచు వచ్చిరి
కొందఱు ధూమ్రాక్షువెంట ఘోరరణమునకై 5

పరిఘాపట్టసశూలముద్గరగదాపాణుల్ మహోత్సేకులై
పరుగుల్ తీయుచు సింహనాదములు సల్పన్ వైరిసైన్యమ్ముఁ దా
విఱియంబారుచు దానవధ్వజిని నువ్విళ్లూరుచున్ దాఁకఁగన్
కురిసెన్ బాణములున్. శిలల్ తరువులున్ ఘోరాజి సాగెన్ వెసన్ 6

వ॥ ధూమ్రాక్షుఁడు గార్దభసంయోజితరథము నధివసించెను. వాని మొగములు తోడేలు ముఖములవలెను సింహపు మొగమ్ములవలె నుండెను 7

అంత ధూమ్రాక్షుఁడు హనుమంతుఁడుండిన
పడమటి గవనుపై పడగఁబోవ
వికృతాకృతులుగల్గు వికిరముల్ నభమున
నిలిచి యా యోధుని నిలిపివైచె
రథశిఖరమ్ముపై గ్రద్దయొక్కటి వ్రాలె
ధ్వజముపై రాబందు వ్రాలె, రక్త
సిక్తకబంధము చెచ్చెర రథము ముం
దునపడె- రుధిరము తోయదములు

పెల్లువర్షించె గజగజ పృథ్వివణఁకె
దుర్నిమిత్తము లెన్నియో తోఁచె-గాలి
యెదురు తిరిగెను- చీఁకటుఁలేపు మిగిలె
వీనిఁగనుచు ధూమ్రాక్షుఁడు వెక్కసపడె 8

చకితుఁడయ్యెను దనుజుఁడు సాహసించి
పర్వసమయాన పొంగు నపాంపతివలె
చెలఁగు వానరసేన దర్శింపఁ బ్లవగ
వీరులును పెడబొబ్బలు పెట్టినారు 9

దనుజవీరులు వివిధాయుధములతోడ
రణము సలుపగ తరువులు ఱాలు. రప్ప
లం(గహించుచు యుద్ధము ప్లవగులెంతొ
ఘోరముగఁ బోరిరెంతయొ మేరమీఱి 10

(ప్రతివానర వీరుఁడు స
మ్మతముగఁ దనపేరుఁజెప్పి మనుజాశనులన్
క్షతిసేయఁ దొడగ వారలు
క్షతజమ్మును గ్రక్కుకొనుచు సమసిరెందఱో 11

కొందఱు పిండిగ నలిగిరి
కొందఱు మఱిముద్దలగుచు కూలిరి మఱియున్
కొందఱు తరువుల(క్రిందను
డిందువడుచు చచ్చినారు డీల్పడి పెలుచన్ 12

వానరులు విజృంభించుచు
దానవులం దాఁకిరెంతొ దార్ఢ్యముతోడన్
జానువులమోది శిలలన్
దూనము గావించినారు దుర్ధర్షులుగా 13

కొందఱి నఖములఁ బీఁకిరి
కొందఱిని పండ్లతోడఁ గొఱికిరి మఱియున్
కొందఱిఁ జఱచిరి చేతుల
నెందఱొ మరణించినారు హింసకు బలియై 14

తురగములు కూలె, నేన్గులు
మరణించెను-స్యందనములు మలపుగ విఱిగెన్
ఖరములు ధరపైఁబడవా
నరులు కూల్చిరాహవమున నక్తంచరులన్ 15

అది గమనించుచు దనుజులు
సదమదపడి విజృంభింపసాగిరి ధూమ్రాక్షుం
డదలించి ప్లవగవీరుల
గదలశూలములను మొత్తి కసిమసఁగె వెసన్ 16

కొందఱఁ బ్రాసమ్ములతో
కొందఱ ముసలముఁగూల్చెఁగోపనుఁడయి తా
నెందఱొ ప్లవగులఁజంపుచు
నందించెను మానసమున నక్తంచరుఁడున్ 17

హనుమంతుఁగదియ ధూమ్రాక్షుఁడు పశ్చిమ
ద్వారసదేశముఁ జేరుకొనుచు
ప్లవగులవధియింపఁబరికించి పావని
ఒకమహాగిరిశృంగ మూడబెఱికి

చకితుఁడయ్యెను దనుజుఁడు సాహసించి
పర్వసమయాన పొంగు నపాంపతివలె
చెలఁగు వానరసేన దర్శింపఁ బ్లవగ
వీరులును పెడబొబ్బలు పెట్టినారు 9

దనుజవీరులు వివిధాయుధములతోడ
రణము సలుపగ తరువులు ఱాలు. రప్ప
లంగ్రహించుచు యుద్ధము ప్లవగులెంతొ
ఘోరముగఁ బోరిరెంతయొ మేరమీఱి 10

ప్రతివానర వీరుఁడు స
మ్మతముగఁ దనపేరుఁజెప్పి మనుజాశనులన్
క్షతిసేయఁ దొడగ వారలు
క్షతజమ్మను గ్రక్కుకొనుచు సమసిరెందఱో 11

కొందఱు పిండిగ నలిగిరి
కొందఱు మఱిముద్దలగుచు కూలిరి మఱియున్
కొందఱు తరువులక్రిందను
డిందువడుచు చచ్చినారు డీల్పడి పెలుచన్ 12

వానరులు విజృంభించుచు
దానవులం దాఁకిరెంతొ దార్ఢ్యముతోడన్
జానువులమోది శిలలన్
దూనము గావించినారు దుర్ధర్షులుగా 13

కొందఱి నఖములఁ జీఁకిరి
కొందఱిని పండ్లతోడఁ గొఱికిరి మఱియున్
కొందఱిఁ జఱచిరి చేతుల
నెందఱొ మరణించినారు హింసకు బలియై 14

తురగములు కూలె, నేన్గులు
మరణించెను-స్యందనములు మలపుగ విఱిగెన్
ఖరములు ధరపైఁబడవా
నరులు కూల్చిరాహవమున నక్తంచరులన్ 15

అది గమనించుచు దనుజులు
సదమదపడి విజృంభింపసాగిరి ధూమ్రాక్షుం
డదలించి ప్లవగవీరుల
గదలశూలములను మొత్తి కసిమసఁగె వెసన్ 16

కొందఱఁ బ్రాసమ్ములతో
కొందఱ ముసలముఁగూల్చెఁగోపనుఁడయి తా
నెందఱొ ప్లవగులఁజంపుచు
నందించెను మానసమున నక్తంచరుఁడున్ 17

హనుమంతుఁగదియ ధూమ్రాక్షుఁడు పశ్చిమ
ద్వారసదేశముఁ జేరుకొనుచు
ప్లవగులవధియింపఁబరికించి పావని
ఒకమహాగిరిశృంగ మూడబెఱికి

రగులుచు దానవురథముపై విసరగ
రజనిచరుండంత రథము డిగ్గి
గదఁబూని విసరెను కాని యాగిరిశృంగ
మరదమున్ విఱిచెను బిఱబిఱ చని

సారథియు, వారువమ్ములు సమసెనపుడు
హనుమ మఱియొక పెనుశిల నసురుమీఁద
పడగ విసరగ-గదఁబూని పాలసుండు
వైవ పావని తప్పుక ప్రక్కకొఱుగ 18

ఒఱిగి భూధరశిఖరము నొండుతెచ్చి
పడగవైచిన ధూమ్రాక్షుపై నతండు
దానిక్రిందను పడుచు మ్రందగను జూచి
రక్కసులు పాఱిపోయిరి దిక్కుమాలి 19

హనుమ బ్రహ్మాండ భాండమ్మ నగలుచుగతి
సింహనాదము సలుపగ చెంతనుగల
ప్లవగ యోధులు నందించి భక్తిఁజుట్టు
చేరి కడుభక్తితోడ పూజించిరతవి 20

మహిపునకుఁజేరె ధూమ్రాక్షు మరణవార్త
క్రోధమూర్ఛితుఁడై పోయి రోజిమిగుల
తోఁకత్రొక్కిన త్రాఁచులా తూఁగి, తూలి
బుసలు కొట్టెను రాక్షసభూపుఁడపుడు 21

వజ్రదంష్ట్రుడన్ వాని రావణుఁడు పిలిచి
"నీవు రాక్షస యోధుల దావరులను
దీసికొనిపోయి రాముని దినకరసుతు
డైన సుగ్రీవుఁ బ్లవగులనందఱ వధి
యించి రావలెనిటకు జయించి వారి" 22

అతఁడు శూరుఁడు, యోద్ధ, మాయావి వివిధ
మండనమ్ముల మెయిదాల్చి మకుటధారి
యై కరుల్, వారువమ్ములు, నరదములు, ఖ
రమ్ము, లొంటెలు, యోధులు రావెడలెను 23

ముసలములు, తోమరమ్ములు, ముద్గరములు
పరిఘలుఁబరశ్వధమ్ములుఁ బట్టసములు
శక్తులును, శూలములును, బాశములుఁ జక్ర
ములఁగొనుచు దైత్యవీరులు మ్రోలనిలువ 24

వీరులును వహ్నులట్టుల వెలుఁగుచుండి
సామజమ్ములపై పోవు సరణిఁజూడ
పర్వతమ్ములు కదలెడి పగిదినుండె
సింహనాదముల్ సలుపుచు సేన కదలె 25

పృతన బొబ్బలతో నిండి శతవిధముల
నుఱుములుఱుముచు మేఘము లుద్గమించు
కరణిఁదోఁచెను మార్గాన కపిబలమును
వజ్రదంష్ట్రుఁడు వెడలెను ధ్వజినితోడ 26

అతఁడు దక్షిణ ద్వారమునందు నుండి
నంగదుని మీఁదకుంజనె నపుడతనికి
దుర్నిమిత్తము లెన్నియో తోఁచె మింటి
నుండి భగభగమండుచు నుల్కలుపడె 27

పఱడులు కూసె నమంగళ
కరముగ, వివిధదుష్టమృగమ్ములఱవగా
పరితాపము నందెను ప్రజ
దరికొనుచున్ సాగె వజ్రదంష్ట్రుఁడలుకమై 28

వారల రాక కనుంగొని
బీరముతో వలీముఖులువిక్రియ నఱవన్
ప్రారంభమయ్యె సమరము
ఘోరముగా నిరుతెగలకు గువ్వకరిగొనన్ 29

కొందఱ నఱచేతులతో
బ్రమందించుచుఁ గాళ్లఁగొంత మందిఁదన్నుచున్
కొందఱఁబొడుచుచు ముష్టుల
నెందఱొ రక్కసులఁజంపిరీసున ప్లవగుల్ 30

బలము లొండొంటితో తలపడ సంకుల
సమరమ్ము జరిగె నిశాచర గణ
మేపు మీఱుచును హింసింప బొడంగెను
ప్లవగుల శస్త్రాస్త్రపాళి తోడ

చటులముగా ధనుష్టంకారములు మ్రోసె
కత్తుల తళతళల్ క్రందుకొనెను
రథనేమి రావముల్ రాక్షస గర్జనల్
శంఖభేరీరావస్వానములును

వనచరులు బండరాళ్లను బాదపములు
దంతములు. నఖములు నాయుధములుఁగాఁగ
రాక్షసుల రక్కి, కొఱకి, పరాక్రమించి
ఘోరముగ పోరసాగిరి మేర మీఱి 31

ప్లవగవీరులు దనుజుల ఖండనమున
కసిమసంగిరి పెల్లుగా కసిమెయి వెస
వజ్రదంష్ట్రుఁడు సమవర్తి వలెను శత్రు
సంహృతిం జేయబోడఁగె విశసన బుద్ధి 32

రాక్షసులు క్రోధమూర్ఛితులై బిఱ బిఱ
వానరుల సంహరింపఁగఁబూనుకొనగ
అంగదుఁడు వాలిపుత్త్రుఁడాయవసరమున
మాఱి దావానలము వోలె మార్కొనెత్వర 33

కేసరిక్షుద్ర మృగమ్ముల
రోసముతోఁగెడపు రీతి ప్రోద్దామముగా
భాసించె తారపుత్త్రుం
డా సమరములోనఁ దామహాశ్చర్యముగా 34

ఆతని మీఁదకుంజనిన నాళరులున్ దలలూడు తాళముల్
గతి రణభూమిలోన విఱుగంబడు స్యందనరాజి నాజిలో
హతుల శవంబులున్ పడిన హస్తులు, వాజులు, గర్దభమ్ములున్
క్షతిఁగనిపించె నెల్లెడల సంగర రంగమునందు ఘోరమై 35

చిక్కుపడినట్టి హారముల్ చిటిలినట్టి
రమ్యకేయూరమండనరాజితోడ
రంగు రంగుల వస్త్రముల్ రాలిపడిన
శస్త్రముల తోడ రణభూమి జాలుకొనెను 36

తారకాయుక్తమగు శరద్రాత్రి వోలె
హరువుగా నుండె నెంతొ రణాంగణమ్ము
వాత్యతో మేఘములు విడివడిన రీతి
తారసుతుఢాక కాగక పాఱిపోయి
రసురవీరులు లంకకు నటమటించి 37

దనుజులపాటు, నంగదు విధానముఁ గాంచుచు వజ్రదంష్ట్రుఁడున్
ధనువు ధరించి వానరులఁదాఁకుచు భీకర బాణవర్షమున్
పనిగొని పెల్లుగా గురిసెఁబాలసులున్ వివిధాయుధమ్ములన్
గొని ప్రహరింపఁబూనగ నకుంఠితసాహసవిక్రమమ్ముతో 38

అంత నగచరవీరులు నటులె దనుజ
వీరులను ఱాల, రప్పల దారుణముగ
తిరగఁబడి రోషమున వెనుదీయకుండ
విసరివైవ సంగ్రామము వృద్ధియయ్యె 39

కొందఱి శీర్షము లెగిరెను
కొందఱి బాహువులు తెగెను కొందఱి డొక్కల్
చిందఱగొనె నిక కొందఱు
వందురగా ఘోరమయ్యె ప్రధనంబంతన్ 40

వారలందఱు రణభూమిఁబడుచు రక్త
మందుఁదేలుచు నుండగ నపుడు వాయ
సములు, రాబందులును, సృగాలములు, గ్రద్ద
లచట స్వేచ్ఛగ తిరిగె ప్రహ్లాదముగను 41

తలపడవానరుల్ మరల దానవవీరుఁడు వజ్రదంష్ట్రుడున్
సులువుగ బాణవర్షమును చోద్యముగాఁ గురియించిపెక్కురన్
బొలియగఁ జేయ నంగదుఁడు పోటరియై చనుదెంచి వానితో
సలుపుచు ద్వంద్వయుద్ధ మొక శైలముతో ప్రహరింప వాఁడునున్ 42

వజ్రదంష్ట్రుఁడుఁ దా గదాపాణియగుచు
రథముదిగి పోవ నంగద ప్లవగవీరుఁ
డతనిగద లాగు కొనుచు పర్వతముఁబూని
విసర నాతనిపై-వాఁడు విపులఁ బడియె 43

తేఱుకొని కొంత వడికి యాదితిజవీరుఁ
డపుడువేఱొక గదఁబూని యంగదాఖ్యు
పక్షమునఁ గొట్టె నుపయోగ పడమి వాఁడు
సిద్ధపడె ముష్టియుద్ధము సేయుటకయి 44

ఇరువురు సమానముగఁ బ్రహరించుకొనిరి
రక్తమోడికల్ కట్టెను, రణ మొనర్ప
వార లంగారకబుధుల పగిదిపోలి
భూరుహములతో సలిపిరి దారుణముగ 45

కత్తుల, డాళ్లఁబూని జయకాంక్షను వారలు పోరుసల్ప హో
రెత్తెరణాంగణమ్ము కలహింప సమంబుగ కత్తిదెబ్బలన్
జొత్తిలి రక్తమిర్వురకుఁ జూపడెఁ బూసినమోదుగుల్ బలెన్
కుత్తుకఁగోసెనంగదుఁడు కోపము మిక్కిల వజ్రదంష్ట్రినిన్ 46

దానిఁజూచి పర్వెత్తిరి దనుజులు వెస
లంకలోనికి వానరుల్ రాయిడింప
అంగదునిఁజుట్టుకొని మెచ్చి రంగవించి
యందఁజేసిరి తమ యభినందనముల 47

వ॥ అట్లంగదుని చేత వజ్రదష్ట్రిండీల్గ హతశేషుపైన దోషాచరులు లంకఁజొచ్చి యతని మృతివార్త రావణునకుఁ దెలుపనతఁడు క్రోధతామ్రాక్షుఁడగుచు కొండొక తడవునకుం బ్రహస్తుని, తనసేనాధిపతిని గనుగొని నీవకంపను సేనానాయకుంజేసి పనుపుమన నతడకంపనునిఁ బంపెను. 48

కాలమేఘసన్నిభుఁడకంపనుండు
నల్లగా మేఘమట్టులున్నాఁడు రథము
పైని వివిధాయుధమ్ములఁ బూని దురము
సేయ సంసిద్ధుఁడై పోయె చెలఁగి హృదిని 49

ఉఱుమునాతఁడు వారిద ముఱుమునటుల
కదపలేరాతనిని దివౌకసులుకూడ
మకర కుండలముల్ దాల్చి మత్తహృదయుఁ
డై బయల్దేఱె రణము సేయంగఁగడిమి 50

అరుగుచుండగ వానితురగము లాకస్మి
కముగ దీనము లౌచుఁగానిపించె
వామ నేత్రమదరె వదనము తెలవాఱె
గద్గద మయ్యేను గళమునందు
దినము దుర్దినముగా కనఁబడె నతనికి
వికృతమ్ముగాఁ గూసె వికిరచయము
మృగములడ్డమ్ముగా మెలఁగెను దారిలో
కాని సింహస్కంధుఁడైనవాఁడు

లేశమాదుర్నిమిత్తమ్ముల లెక్కగొనక
సాగిపోవుచు వడివడి సమరభూమిఁ
జేరె యోధులు వెంటరా చివ్వకొఱకు
నిర్విచారముగా తన సేత పసుప 51

వారల ధ్వనివిని వానరుల్ చెట్లు చే
మలు రాలు రప్పలు మార్కొనంగ
సిద్ధమై పోయిరి యుద్ధమున కుభయ
పక్షముల్ తలపడవచ్చె నటకు

అందఱు శూరులే అందఱుశైలస
న్నిభులె భేదములేదు నెరతనమున
రాముని కోసము ప్లవగులు-రావణు
కొఱకు రాక్షసులును కూడి రచట

దనుజ వానర సింహనాదముల తోడ
భూనభోంతరాళమ్ములుఁ బూరటిల్లె
వారు వీరు త్రొక్కిన పరవళ్ల వలన
దుమ్మురేఁగుచు నరుణమై తోఁచె విపుల 52

ధ్వజము లశ్వముల్ కనరావు దంతు లరద
ములును దోఁచవు ఖడ్గముల్ ముద్గరములు
కనఁబడకపోయె ధ్వనియె బిగ్గఱగవినిచె
స్వపరభేదములేకుండ చంపుకొనిరి 53

కదన రంగమునందు రక్తమ్ము వఱద
లగుచుఁ బ్రవహించె దానితో నణఁగె రజము
ముసలతోమరముద్గరములును చెట్లు
శిలలతో పోరొనర్చిరి చెలఁగి కలఁగి 54

కుముదనళద్వివిదమైందులు
ద్రుమములఁగొని ముందుకుఱికి దోషాచర సై
న్యముఁజిందఱవందఱగా
నమర్షమున నకంపనుండు నలజడి పడుచున్ 55

వారిని గూడుచుఁదక్కిన
వారు సహాయ్యమ్ముఁజేసి ప్రధనమొనర్పన్
వారణతురగ సమూహము
దారుణముగ మహినిఁగూలె తత్తర పడుచున్ 56

కాంచియకంపనుండు తన కన్నులఁ గోపముఁగెంపుఁదోప శో
షించుచు వింటినారి మొరయించుచు సారథితో వచించె" ఘా
తించిరి వీఁక వానరులు త్రెళ్లిరి రాక్షసులింక నీవు తో
లించుము వారువమ్ముల నరిందముఁడౌచు వధింతువైరులన్" 57

సారథి శత్రుసేనగల స్థానముఁజేర్ప రథమ్ము వెంటనే
వీరుఁడకంపనుండు సరవిన్ శరవర్షము తోడ ముంచె నా
వైరి బలమ్ము-భీతిలుచు వానరులున్ వెనుకంజవేయగా
మారుతి వానిపై కుటికి మార్కొనఁదక్కిన వారు రేఁగుచున్ 58

తలపడగా నకంపనుఁడుదర్పముతో పవమానపుత్రుపై
నలుక శిలీముఖమ్ముల వియాతుఁడువైచె మహేంద్రుఁడద్రి పై
ఛలమున వర్షమున్ గురియు చందమునన్-హనుమంతుడద్ది ని
ష్ఫలమొనరించి దానవునిపైఁబడె యెంతయు దుర్నిరీక్ష్యుఁడై 59

ఇమ్ముగా నొక పర్వతమ్మును బెకలించి
పరవళ్లఁద్రొక్కుచు బిఱబిఱనది
గిరగిరఁద్రిప్పుచు నరుగఁగ ముందుకు
పిండిఁజేసె నకంపనుండు దాని

హస్తమునంగలయా యాయుధమ్ములు
భగ్నమై పోవగ శ్వసనజుండు
క్రోధమూర్ఛితుఁడయి కుజమొక్కటింబేఁకి
యోధుల, రథికుల నుక్కడించె

అతని యూరువేగమ్మున నవనిఁబడెను
పాదపములు పదాతులు ప్రళయ కాల
భర్గువలె-వానిఁజూచుచు పాలసులును
పాఱిపోయిరి పెక్కురు పోరుమాని 60

రేఁగి యకంపనుండు ప్రహరించె చతుర్దశ మార్గణమ్ములన్
జాగొనరింపకే హనుమ చయ్యన భూరుహయుక్తపర్వతం
బై గరుపాఱె రక్తము ప్రవాహిలి గాయము లగ్నిచందమై
జేగుఱుకానిపింప నిరసించుచుఁ వేఱొక వృక్షమూనుచున్ 61

క్రోధముతో నకంపనునిఁగొట్టగఁబచ్చడియాచు క్షోణిపై
భూధరమట్లుఁగూలగను భూమి చలింపగ కూలు చెట్టులై
యోధులు లంకకున్ జని రయోమయులై కడు బెగ్గడిల్లుచున్
వేధితులౌచు-వానరులు వెన్నొని ప్రస్తుతి సేయఁబావనిన్ 62

హనుమ యకంపను వధియిం
చె ననుచున్ గొంతులెత్తి చీరఁగ కపులా
నినదమువిని రాక్షసులం
బెనుపరులగు వారుఁగూడ వెఱచిరి మిగులన్ 63

ఆకాశములో దేవత
లాకేసరి తనయుఁబొగడి రానందముతో
ప్రాకామ్యముగా రాఘవు
లాకపినేత విభీషణు లభినందింపన్ 64

దనుజులు లంకలో నృపుని దాపునకుంజని తెల్పగా నకం
పను మృతివార్త మండిపడి ప్రక్కను నిల్చు ప్రహస్తుతో వచిం
చెను" రిపులిప్డు సేనగొని చెచ్చెరకోటనుముట్టడింపగా
యని యొనరింప తప్పదుకదా ! మఱి మార్గము వేఱులేదుగా 65

కట్టుదిట్టమ్ముగా కనిపించు మనలంక
రక్షణలన్ని భద్రముగనుండె
నీక్లిష్టసమయమందేనొ తమ్ముఁడు కుంభ
కర్ణుఁడో, తనయుఁడో కాద నీవొ
మఱియు నికుంభుడో మార్కొనగావలె
తదితరులకిది సాధ్యమ్ము కాదు
భారము వహియింప లేరు కావున నీవు
తగిన బలమ్ముతో తరలి పొమ్ము

యుద్ధమొనరింప నీవేఁగ యోధులంత
నిన్నుఁగని సింహనాదముల్ నెమ్మిఁజేయ
పాఱిపోవును చపలస్వభావముగల
కపిసృతన క్రమశిక్షణ కఱవగుటను 66

వారు స్థిరచిత్తులుంగారు-పంచముఖము
గర్జనముసేయ నేన్గులుఁ గాఱియపడి
పోపడు విభాన సీవాక్క- ద్రొబ్బపెట్ట
చెట్టుకొాక పిట్టయై పోవు సేన చెదరి 67

కపులటుల పాఱిపోవ రాఘవులు సులభ
ముగను దొరికిపోదురు నీకు పోరడఁగిన
మనకు నాపద తొలఁగును-రణమొనర్ప
విజయమును గూడ లభియించు విధము కలదు 68

నీయభిప్రాయమును దెల్పుమా" యటంచు
దనుజనేత ప్రహస్తుని దరికి పిలిచి
ప్రశ్న నేయ నతండును బంధురముగ
జనపతికి మ్రొక్కి వినతుఁడై చర్చచేసి 69

మఘవునకు బృహస్పతి చెప్పు మాడ్కి పలికె
నా ప్రహస్తుఁడు దశముఖునరసి-మనము
నీతి శాస్త్రపారంగతుల్ నిపుణులైన
మంత్రులను గూడి యోజింపమా మహేచ్ఛ 70

"దనుజేంద్రా ! విషయమ్ము సర్వమును నిర్ధార్యమ్ముగా నుండ నే
లను పృచ్ఛించెదునన్ను-తొ త్తనె యభిప్రాయమ్ము నేనీయ సీ
తను రామావనిపాలు కిచ్చుటయొ లేదా యుద్ధముం జేయుటో
యనుచున్ నిర్ణయముంబొనర్చుమని ఆహా ! చర్చఁగావింతురే? 71

భిన్నాభిప్రాయములవి
యెన్నో యుండి వివాదమ్ములేర్పడె సీతన్
మన్నించి రాము కొసఁగుట
కన్నాకగు లేద రణముఁగావింపవలెన్ 72

నా యభిప్రాయమును దెల్పినాడమున్నె
దాన కొడబడపైతివి దనుజనాథ !
పోరు మొదలైనదప్పుడే దారుణముగ
నిపుడు వెనుకకు జంకిననేమి ఫలము ? 73

నా యూహల తోడను మఱి
నా యుద్దేశముల తోడ నమ్మకములతో
నేయముల నేమి పని యని
నాయక ! నిగదింతు రణము నాణెమటంచున్ 74

నీకేది ప్రీతి పాత్రమొ
నాకు కూడనదియె యెంతొ న్యాయంబగు సూ !
నీ కంటె నాకు ప్రాణము
లేకరణిని మిన్నగావు ప్రీతుూన్యుఁడనే ? 75

నా కరమ్ముల మడియు వానరులఁ బ్రీతి
గ్రద్దలు, సృగాలములును భక్షణ మొనర్చి
తృప్తిపొందగ వలెను-సాధింతునద్ది
రణమునకు సిద్ధమైపోదు రాక్షసేశ ! 76

నే సన్మానము లెన్నియో పడసితిన్ నీ వల్ల మున్నెన్నియో
నీ సౌహార్దము మెచ్చుగొల్పినది మన్నీఁడా! విడంబించుచున్
వాసింగాంచితి, తీరె వాంఛలు కృపావారాశి! నాయూహతో
వీసంబున్ పనిలేదు యుద్ధమునకున్ వేవేగపోదున్ సుమీ!

మన్ననలెన్నొ పొందితిని మామక వాంఛలఁదీర్చినావు నే
నన్న కృపాళువై యడిగినట్టివి సర్వమొసంగినావు నే
నెన్నడు మీ విధేయుఁడనె యీ సమయమ్మున మీ యభీష్టమున్
బన్నము లున్నబంధువులు భార్యయు ప్రాణములొక్కలెక్కయా!

వనితపై, పుత్రులపయి నైశ్వర్యముపయి
బంధువర్గముపై కాంక్ష ప్రబలదెపుడు
ప్రాణముల లెక్కసేయ నీవాంఛఁదీర్ప
నాకు నీ శ్రేయమే మిన్న చేకితాన!"

అమితబలమ్ముఁజేకొని ప్రహస్తుఁడుపోయె దశాస్యునాజ్ఞపై
సమరము సేయగా ప్లవగసైన్యము పొంగెడివార్ధికై వడిన్
సమకొన సింహనాదములు సల్పుచు భేరులు మ్రోగుచుండగా
తమకముతోడ కాంచన రథమ్మున తీవిగబైలుదేఱగా

కుంభహనుండును నరాంతకుఁడు సమున్న
తుఁడు మహానాదుఁడనెడి మంత్రులు నలుగురు
వెంబడింప ప్రహస్తుఁడు వెడలె నపుడు
తూర్పుద్వారముఁగడచుచు దురమొనర్ప

ఆ ప్రహస్తునియోధుల అఱపులకును
పుడమి కంపించె లంకలో పుణ్యజనులు
వికృతముగ భయభ్రాంతులై బెగ్గడిలిరి
గగనమందుండి రాలెనుల్కలు పెలుచన 82

వఱదులఱచె నమంగళ స్వనముతోడ
నుఱిమె ముదిరమ్ములెంతయో పరుషముగను
గాలిపెడసరమ్ముగ వీఁచె-గ్రహములన్ని
తోఁచె తేజోవిహీనమై ధూసరముగ 83

తిరిగె నపసవ్యముగ వాని తేరుమీఁద
పక్షిగణములు-ధ్వజముపై వ్రాలె గ్రద్ద
రుధిర వర్షముఁ గురిసె నరుంతుదముగ
తెల్లవోయె ప్రహస్తుఁడీ తెఱఁగుఁజూచి 84

తోఁచె నష్టవసువులకు దుర్లభమగు
తేజమునఁ బ్రకాశించె ప్రతిష్ఠ కొలఁది
యుద్ధమునకేఁగు సమయాన యుద్ధభూమి
నడుగుపెట్టి నిస్తేజుఁడై యడలిపోయె 85

కళవళించెను గుఱ్ఱముల్-కళయుజాతె
సూతు చేతిలోనుండి-ప్రఖ్యాతబలముఁ
గలిగిన ప్రహస్తురాకతో కపులు చెలఁగి
ఆయుధమ్ములతో సిద్ధమైరి త్వరగ 86

తారసిలె నుభయబలములు
'వారు' 'వీరు' జబ్బచఱచి పంతమ్ములతోఁ
జీరుచు నొండొరులను, గడి
తేఱి వాదులాడు కొనిరి ధిక్కృతు లెలయన్ 87

భీమపరాక్రముఁడగు వానిని
రాముఁడు దూరమునఁ జూచి రావణానుజున్
"ధీమంత ! వీఁడెవండని"
గోముగ ప్రశ్నించె తెలియుఁగోరికతోడన్ 88

అంత విభీషణుఁడవనిపాలునితోడ
వచియించె నీరీతి "ప్రభువతంస!
అతఁడు రావణుని సైన్యమ్మున కధిపతి
యైన ప్రహస్తుఁడు సేన యెల్ల
నతని యధీనమందలరును మూడు వం
తులు - మహాశూరుఁడు - దోర్బలుండు
వీరుఁడు, శస్త్రాస్త్రవేదియు ప్రఖ్యాత
బలపరాక్రముఁడని వైనములను

లావుఁదెలిపెను వివరముల్-ప్లవగ వీరు
లతనిన్ సైనికులఁ జూచి కుతుకపడుచు
సింహనాదముల్ సలిపిరి చేవఁమిగుల
దానవులుఁబూని వివిధాయుధములఁజనిరి 89

పరిఘలు పరశ్వధమ్ములు పట్టసములు
బాణములు. ముసలమ్ములుఁ బ్రాసములును
గదలు, శక్తులు, శూలముల్ ఖడ్గములును
భిండివాలముల్ పూనుచు పెక్కువగను 90

ఎదురునడచిరి ప్లవగులు బెదరు పడక
శిలలు. వృక్షములంబూని. చేవమిగుల
అశ్మబాణ వర్షమ్ములు ననిఁ గురిసెను
రాక్షసులు వానరులఁ జంప రణము ముదిరె 91

కొందఱను శూలములతోడఁ గూల్చ నింక
కొందఱను చక్రముల తోడ గ్రమ్మందఁ జేయ
కొందఱఁ బరశ్వధమ్ములఁ గొట్ట మఱియు
కొందఱను బరిఘలమోద గుబ్బటిలిరి 92

మొండెములై కొందఱు పడ,
గుండెలుబ్రీలంగ నింక కొందఱు గ్రమ్మందన్,
రెండుముక్కలుగ కొందఱు.
పిండియైరి మఱి కొందఱు పెనకువలోనన్ 93

దీనికి బదులుగ నసురుల
వానరులున్ శిలల బాది పచ్చడి సేయన్
మ్రానులతో ప్రహరించిరి
సూనరులై గోళ్లతోడ శుక్రశిష్యులన్ 94

కొందఱు నఱచేతులతో
కొందఱి చరణముల గ్రుమ్మికూల్చిరి మఱియున్
కొందఱను గ్రుద్ది చంపిరి
కొందఱి దంతములతోడ కొఱికిరి పెలుచన్ 95

వానరులలోన నసురులలోన కూడ
రోదనమ్ములు మఱి సింహనాదములును
భూనభోంతరాళమ్ములు మ్రోగి దద్ద
రిల్లిపోయెను నాటి పోరితము వేళ 96

అని ప్రహస్తుని మంత్రులు వనచరులను
పెక్కురను సంహరింపగ వెక్కసపడి
ప్లవగ యూధప వీరులు లాఘవముగ
నెంచి యుత్తిష్ఠమానులై మించినారు 97

గిరిశృంగమొకదానిఁ బెరికి ద్వివిదుఁడు మో
దుచు నరాంతకుని చిద్రుపలు జేసె
దుర్ముఖుండొక పెద్ద ద్రుమముఁజేకొని సము
న్నతుఁబ్రహరించుచు మృతునొనర్చె
పెనుశిలఁజేబూని దునిమి మహానాదు
జాంబవంతుండు పచ్చడిగఁజేసె
కుజము నొక్కటిఁదెచ్చి కుంభహనునిమట్టి
కఱపించి తారుఁడు కసిమసంగె

అద్ది గమనించి యలిగి ప్రహస్తుఁడరద
మందునిలుచుచు శరవర్షమార్జవముగ
గురిసి యెందఱొ ప్లవగులఁ గూల్చివైచె
రూక్షితమ్ముగ లయకాలరుద్రు పోలె 98

ఉభయ సైన్యములందున నుదధి పెలుచ
సుడివడగ నుద్భవించు సవ్వడి జనించె
సమరభూమిని మృతుల దేహములు పర్వ
తమ్ములటు గోచరించె విదళితములయి 99

జ్ఞప్తి కెలయించె కింశుకసాల వనము
రక్త పంకిలమౌచు సంగ్రామభూమి
ఒక మహానది పగిదగ నొప్పె మృతుల
శవములే దాని తటములై సంతపడగ
ఆయుధమ్ములె గట్లపై నవనిజములు 100

జలము రక్తము-శమనుఁడు సంగమించు
నబ్ధి-కార్జము, ప్లీహము నసలు-నాఁచు
ప్రేవులు-శిరస్సులును మీలు, రేవు లంగ
కములు రోదనములు తరంగములఁబోలు 101

కాకులే సారసమ్ములు గ్రద్ద లంచ
గములు-డిండీరమే క్రొవ్వు-కడలి వెలఁది
భీరువులు దాఁట కష్టము-వీరులైన
దానవులు ప్లవగులు నది దాఁటినారు 102

అసురసేనాని ప్రహస్తుఁడు వానర
సైన్యాధిపతి పైకి శరవిసరము
గుప్పింపగాఁబ్లవగుఁడు వృక్షమొకదాని
పెరికి ప్రహస్తుపై విసర నతఁడు

మరల నీలుని పైని మార్గణమ్ములఁబెక్కు
పరఁగించె నవి మీఁదపడుచు నుండ
లక్ష్యముసేయకా, రాక్షస సేనాని
యలుగుపరంపర నడ్డగించి

నిశ్చలమ్ముగ నీలుఁడు నిలిచి మరల
నొక్క ద్రుమమును జేకొని యుద్ధృతముగ
విసర పగతుని రథమును వీతులుఁదెగి
ధనువు లాగుచు విఱచివైచెను బలిమిగ 103

అప్పుడిద్దఱు మదహస్తులటుల రేఁగి
కలియబడుచు నొండొరులను కఱచుకొనిరి
గోళ్లతో రక్కుకొనినారు కుపితులగుచు
ఘోరముగ పోరు సల్పిరి కుమ్ములాడి 104

వానరవీరు దౌష్ట్యమును ప్రల్లదనమ్మును గాంచి దైత్య సే
నాని యయోగ్రముంగొని కనారిలుచున్ వెస నీలు ఫాలమున్
గీనము రక్తమున్ వెడలఁగీడ్పడగా ప్రహరింప నాతఁడున్
మానుగ బండరాయి గొని మార్కొని కొట్టె ప్రహస్త దానవున్ 105

శిరము బ్రద్దలయ్యె శిలతోడఁబ్రహరింప
నా ప్రహస్తుఁడటుల నంతమగుచు
మొదలు నఱకు చెట్టుపోలిక నేలపై
వడిగ పడెను నెత్రుమడుగునందు 106

మరణింపగా ప్రహస్తుఁడు
తిరిగి చనిరి లంక కపుకు దితిజులు నృపుతో
నెఱిఁగింపగఁ దద్విషయము
నఱిముఱిపడె దశముఖుండు వ్యగ్రుండగుచున్ 107

వ. ప్రహస్తుండు పడినంజూచి రామలక్ష్మణులు, సుగ్రీవాదులును నీలు నుచిత వాక్యములఁ గొనియాడిరి. దశగ్రీవుఁడు ప్రహస్తుని మరణమునకు శోకించి పరాజయ క్రోధముతో 108

పరిదేవేంద్రు బలమ్ము నాశమొనరింపన్ జాలువీరుండుగా
మరియాదంగొను నీ ప్రహస్తుఁ డిపు డున్మాంధమ్ముగా నీలుచే
పరిభూతుండుగ నెట్లు నిల్చెదను దుర్వారుండుగాఁ బోయినే
బరిమార్తున్ రణమందు రాఘవుల నా పత్తిన్ నివారించెదన్ 109

ఎవఁడీ నీలుఁడు-ఆతదంత మొనగాడే ? నాదుసైన్యాధిపున్
బవరంబందుఁ బ్రహస్తుఁజంపగల దుర్వారోగ్రయోధుండె, నా
కవగాహమ్మొనరింప నేరికినిలేవాదమ్ము లిప్పట్టునన్
దరమున్ మాన్పఁగలాడ నేనరిగి చిత్తక్షోభ పోనాడెదన్ 110

ఎండిపోయిన వనమును మెండుకొనుచు
మండఁజేసిన వడువున మామకాగ్ని
బాణముల దాశరథులను ప్లవగసేనఁ
గాల్చివైచెదనని పల్కి కదలెననికి 111

నేఁడు బలమ్ము నెల్లఁగొని నేను మహోర్పులఁబేర్చి చిచ్చుచే
మాఁడిన కాననమ్ము గతి మర్కట సైన్యము సొంపుఁదూలగా
వేఁడిమిసూపి యూథపుల భీయుడుగం దునుమాడివత్తుఁగ్రొ
వ్వాఁడిశరమ్ములంగడిమి వైశమరాజులనేపుమాపుచున్ 112

ఉరవడి దానవేశ్వరుఁడు నుత్తమజాతి హయంబులీడ్వగా
నరదము నెక్కి బయల్వెడలె నంతట నుక్కరులైన యోధులున్
గరముల నాయుధమ్ములుఁ బ్రకాశిలుచుండగ నూరుదాఁటి వా
నర పృతనంగనుంగొనెను నైకటికమ్ముగ భీతిఁగొల్పుచున్ 113

ప్లవగవీరుల చేతులఁబాదపములు
ఊయి, రప్పలుఁగలవు-శ్రీరాముఁడంత
చెంతనున్న విభీషణుఁజీరి పలికె
వచ్చుచున్న రాక్షససేన వైనములను 114

వ. దానిపై విభీషణుఁడిట్లనెను 115

"అరదంబందున సింహకేతనముతో హస్తమ్మునందున్ బురం
దరు బాపమ్మును మించు కార్ముకముతో దంతావళంబట్టులన్
గరసింపన్ జనుదెంచు వాడె యసుఁజ్మోపాలు పుత్రుండు తాఁ
బరఁగున్నింద్రజినాముఁడై రఘువరా ! ప్రజ్ఞాన్వితుండెంతయో 116

అతఁడు మేఘనాదుఁడను నాఖ్యఁజెలంగును సంగరమ్ము నన్
భీతినిఁగల్గజేయు కడువిక్రముఁడై విలసిల్లునెంతొ ప్ర
ఖ్యాతి మెలంగు వాసవుని నాహవమందు జయించి వచ్చెని
ర్భీతిఁజరించునెప్పుడుపరీప్సను మాయలమారి యాజులన్ 117

అతని నాగపాశముల నర్యమవంశప్రదీప ! మీరలీ
ఘాతుకుచేతఁగట్టువడగా గరుడుండును వచ్చి మిమ్ములన్
చేతన నొందఁజేసెను విశిష్టగుణాఢ్య ! మహోత్సుకుండుగాఁ
బ్రీతిగ దేవకార్యమునఁబెంపు వహింప రణాంగణమ్మునన్ 118

స్యందనమునందునన్ ధనుష్పాణి యగుచు
వచ్చువాఁడతికాయుడన్ వాఁడు హస్తి
పైని జీరలనేత్రాల వచ్చువాఁడు
పొదలుచుండిన వాఁడె మహోదరుండు 119

ఖడ్గహస్తుఁడై వెస తురగమ్ము పైని
తళతళల తోడఁజళిపించు దావరీఁడు
పిడుగువంటి పిశాచుఁడు బెట్టిదుండు
యుద్ధముల మేటి-బలశాలి-యోద్ధ కూడ 120

సర్పకేతన సంయుత స్యందనమున
వింటి నారిమ్రోయించుచు వెడలుచున్న
శ్యామలాంగుఁడు కుంభుఁడు స్థేముఁడెంతొ
కుంభకర్ణ తనూజుఁడు దాంభికుండు 121

ధూమధ్వజచిహ్నితమగు
భీమహేమవజ్రస్థగితపృథులపరిఘతో
ధూమయోనివలె మండుచు
భీమ యోద్ధయౌ నికుంభవీరుఁడతండే 122

ఒక మహోక్షముపై నెక్కి నుద్ధతుఁడుగ
మెఱయుచున్న శూలముఁబూని యరుగుదెంచు
వాఁడె త్రిశిరుఁడు-జ్వలనుని పగిది రథము
నందు వచ్చెడి వాఁడు నరాంతకుండు 123

జవనాశ్వసజ్జితస్యందనకింకిణుల్
రథనేమి నినదముల్ క్రందుకొనగ
కమనీయ మణిగణ కాంచనభూషణాం
బరములు నెమ్మేనఁబరిఢవిల్ల
చారుమౌక్తికసితచ్ఛంద్రిక లొలయగ
గర్వాట్టహాసముల్ పర్వుచుండ
తనువెల్ల దర్పమ్ము ధార్ష్ట్యములిరవొంద
వివిధాయుధమ్ములు విరివిఁ జెలఁగ

కాలమృత్యు సమాన రాక్షస గణమ్ము
తన్ను సేవించుచుండ మార్తాండు డటుల
శిరముపై సితచ్ఛత్రముఁ జెలఁగ మకుట
ధారియై వచ్చువాఁడె మాదశముఖుండు 124

లొట్టిపిట్టల వదనమ్ములును పులుల మొ
గములు. పాముల మొగములు, కత్తులాని
తలలు, లేడిశిరమ్ములు కలుగు భూత
గణము సేవింపవచ్చు నగ్రజుఁడు రామ ! 125

తానే వచ్చుచునుండె యుద్ధమునకున్ దార్ష్ట్యమ్ముతో యోధులున్
సేనల్ వెంట చరింప క్రోధమున రాజీవాక్ష ; విస్ఫూర్తి దు
ర్మానచ్ఛేదము సేయగావలెను ధౌరంధర్యముం జూపుచున్
వానిన్ తప్పక గెల్చితీరెదవు నీపై నుండె నా నమ్మికల్ 126

రామా ! దానవసార్వభౌముఁడన దుర్ధర్షుండు దేవేంద్రునిన్
సామర్థ్యమ్మన గుహ్యకేశ్వరుని దౌర్జన్యమ్ముతోనోర్చె సూ !
వామాచారుఁడు ధర్మశాస్త్రముల దుర్వాదమ్ముతో నడ్డుచున్
కామక్రోధపరీతచిత్తుఁడగుచున్ గావించు దుష్కార్యముల్'' 127

అనవిని రామచంద్రవిభుఁ డచ్చెరరువందుచు దానవేంద్రునిన్
గనుగొనుచున్ వచించెనిటు "కాంతియు. రూపము మిన్నయౌచు సూ
ర్యునిఁదలపించుతేజమున నోజగొనున్ సుమి-యిట్టులున్న వా
డనఘచరిత్రుఁడైన జగమంతయునేలెడివాఁడు కాఁడొకో 128

ఎంతతేజశ్శాలి యీ పంక్తిముఖుఁడు మ
ధ్యందిన సూర్యగాత్రందుకొనును
తేజస్సమావృతమై జితకాశిగా
యితని రూపము ప్రస్ఫుటించుచుండె

దేవదానవులకీ దేహసంపన్నత
కనిపించకుండె రాక్షసభటులును
పర్వతసములె దీప్తాయుధధారులె
ఆ పరివారమందసుర నేత

జమునిరీతిగఁ గన్పించు-చాలపాపి
నాకనులఁబడెనిప్పుడు నాశమౌను
నా సుదతి ప్రుచ్చిలింపగ నా కడిమిని
రణమునందున బలియౌచు-ప్రమందగలఁడు 129

వీరందఱు ధర్మమునకు
దూరులె-నిత్యమ్మొ యనతి దూరములోనన్
ప్రారంభంబగు యుద్ధము
వీరందఱు మడియువారె విద్వేష్టులుగా 130

వ॥ అనుచు సలక్ష్మణుఁడై కవచధారణముగావించి నిలిచిన తరుచరులందఱు శిలావృక్షహస్తులై మిన్నంటు సింహనాదములతో యుద్ధసన్నద్ధులైరి. 131

పరువడి రావణుండు శరవర్షము వానరసేన మీఁదటన్
గురియగ భానుసూతి యొకకొండఁబెకల్చుచు నల్కఁదానవే
శ్వరుఁబ్రహరింపగా నిశితబాణములన్ బరఁగించి దానినిన్
బిరబిర చూర్ణమున్ సలిపె వెక్కసపాటున నిర్జరారియున్ 132

కాలభుజంగకల్పవిశిఖమ్ముఁ బ్రయోగముఁజేసి యర్కజున్
కాలిచె, పార్వతీ సుతుఁడు క్రౌంచధరమ్మును జీల్చునట్టులన్
సోలుచు పృథ్విపైఁబడుచు సూర్యతనూజుఁడు మూర్ఛనందగా
నీలిగెనంచు నెంచి యవహేళనముం బొనరించి రాశరుల్ 133

వ। ఇటుల సుగ్రీవుఁడు మూర్ఛిల్లినంజూచి గవాక్షుఁడు, గవయుఁడు ఋషభుఁడు, జ్యోతిర్ముఖుఁడు, నళుఁడు, గజుఁడు సుదంష్ట్రుఁడు క్రుద్ధులై ప్రచండ గతి పర్వతమ్ములఁజేకొని దశగ్రీవునిపైఁబడగా వానిని రావణుఁడు చూర్ణము చేసి వానరవీరులను గూడ పడగొట్టెను. 134

వారి పడగొట్టుటయెకాదు ప్లవగసేన
నంతముంచెత్తె నెన్నొ తీవ్రాశుగమ్మ
లేసి, ప్లవగులు వాని సహింపలేక
శరణువేఁడిరి రఘురాముఁబరువు వాఱి 135

జాలిపడి రాఘవుఁడు ధనుష్పాణి యగుచు
భండనమ్మున కుద్యుక్తపడగఁజూచి
లక్ష్మణుండంజలి ఘటించి రామచంద్ర !
వాని వధియింప నీకెంతపని మహాత్మ ! 136

నేను వధియింతు నాతని నిశ్చయముగ
నాజ్ఞ దయసేయుమని పల్కనసుజుఁగాంచి
తమ్ముఁడా ! పొమ్ము పంక్తికంధరుఁడు మేటి
వీరుఁడగు ముజ్జగమ్ములఁగ్రూరుఁడెంతొ 137

రావణుని లోటులేమియో రహినెఱింగి
నీదు లోపములేమియో నీవు తెలిసి
జాగరూకత వర్తింప సహజ! మేలు
ఆత్మరక్షణఁ గావింప నభిలషింతు 138

అన సౌమిత్రియు నాత్మలోనలరి రామాధీశుఁబూజించి, చ
య్యన సంగ్రామము సేయఁబోవునెడ నమ్మెయ్యి తావులన్ రావణుం
డనరుందెచ్చుచు వాఁడి బాణములనేయంబూని వేధింపగా
హనుమంతుండది చూచి రావణుని దౌష్ట్యంబాప యత్నించుచున్ 139

ఆతనిమీఁదికిన్ దుమికి హస్తమునెత్తుచు " పంక్తికంధరా!
చాతురితోడ దేవతల, జక్కుల నాగులఁ జంపినావు నీ
ఘోతరమున్ ప్లవంగులు ప్రబోధకులై హరియించివైతురీ
ఘాతక మాపి రాఘవుని కాంతను దోడ్కొని పోదురాఢ్యులై 140

ఇదిగో ! నాసవ్యహస్తమె యిపుడు నీ శ
రీరమందుండి యాత్మను వేఱునేయు"
ననుచు గద్దింప కుపితుఁడై యసురనేత
"యశము నార్జించుమది చేసి హనుమ ! నీవు 141

తొలుత నీవది కానిమ్ము దోర్బలమున
నాశమొనరింతు నిన్ను వానర ! తదుపరి
కాచుకొనుమంచు నుడిమె నిశాచరవిభుఁ
డంత మారుతినిగదించె నతనిఁగాంచి 142

"అదిసరెకాని సీతనయునకు వధించిన షట్టమీవు నీ
మది(దలపోయ మంచిది ప్రమాదమువచ్చునే నీకు రావణా !
పదపడి నీవు చింతిలగ వచ్చునటంచును పేర్మి(జూపుచున్"
గదిమెనువాయుపుత్రు(డు పకాపక నవ్వుచు గేలిసేయుచున్ 143

ఆమాటవినుట తడవుగ
నామారుతి యురముపైని నభిభూతుండై
అమర్షమునన్ జఱచెను
గాముకొనగ దనుజనేత కరతలపటిమన్ 144

కపివరుండూ(గి పోయెను కాని కొంత
వడికి తేఱుచు నఱచేత ప్రహరణమ్మ
సలుప రావణు(డూ(గ(గ చదల దేవ
తలు మహర్షులు సిద్ధులు( దనివి చెంది 145

ఆనందధ్వానమ్మ ల
నూనముగాచేసినారు నూలుకొనుచునా
దానవపతి తేఱుకొనుచు
మానుషముగ( బలికెనిట్లు మారుతి(గనుచున్ 146

వానరులుగేలిసేయగ "పవనపుత్ర !
బాగు బాగు ! హసాదు-నావైరివైన
నీ పరాక్రమ మద్భుతమ్మై పర(గును
శ్లాఘనీయము నీదు విక్రమ"మటంచు 147

అనఁబవమాన నందనుఁడు నాశరనేతకుఁ బల్కెనిట్టులో
దనుజనరేశ ! తాడనకుఁ దాళుచు జీవముతో మెలంగుచే
ఘనమగు నా—పరాక్రమము ఘర్షణతో మఱియొండు దెబ్బతో
ననిపెదనిన్ను ప్రేతపురి కభ్యుదయమ్మను గోరువాఁడనై 148

అని పలుక దశాస్యుండును
పవిగొని పిడికిలి బిగించి పావని వక్షం
బునఁ బ్రహరింపగఁ గినియుచు
హనుమంతుండూగిపోయె నఱిముఱి పడుచున్ 149

డంబములు చాలునింక మదంబడఁచెద
నచుచు వాక్రువ్వ పావని యాశరపతి
పిడికిలి బిగించి యొకపెట్టుపెట్టె మరల
శ్వసనసూతి గుండెలపైని వ్యాహతముగ 150

ఉదిరపడుచును హనుమంతుఁ డూఁగిపోయి
విహ్వలుండయి తోడ్తోడ పృథ్విఁబడగ
నట్టి రోషముతోడనే యసురవిభుఁడు
నీలసేనానిపై దూఁకె నెట్టనముగ 151

ఉఱికి యసురుఁడు కాలసర్పోపములగు
విశిఖములవైచి నీలునొప్పింప నతఁడు
శైలశిఖరము నొకటినిశాచరపతి
పైకి విసరెను సంకటపడుచు నెంతొ 152

ఏఁడు బాణమ్ములం బ్రయోగించి నిర్జ
రారి తత్పర్వతమును చూర్ణమ్మొనర్చె
తెలివి నందియు మారుతి దితిజనృపతి
పై కిపోలేదు రణనీతిఁ బ్రాజ్ఞుఁడగుట 153

అన్యుతోపోరు సల్పెడి యవసరమున
అసురపతిపై కిపోవ న్యాయ్యమ్ము కాద
టంచు రణధర్మమెఱిఁగిన హనుమ మరల
తాఁకకేనిల్చె నట్టులె వీఁకయుండి 154

వివిధమహీరుహమ్ములను బెల్లుగ నీలుఁడు పెల్లగించుచున్
నివుడి నిశాచరేంద్రుపయి నివ్వెఱగందగ వైవ నాతఁడున్
మివులపరాక్రమంబున నమేయముగా శరవృష్టి పెంపునన్
గవయ, వలీముఖుండుఁ బరఁగన్ బరికించి విలోలితాత్ముఁడై 155

పంక్తిముఖుఁడు పాదపమ్ముల ఖండించి
పలుశిలీముఖముల భగ్నపఱచె
గగనమ్ము శరములఁ గప్పివేయగ నష్టు
కడుభయానకముగఁ గలనుసాగె
నీలసేనానియు నాలమ్ము సేయక
స్వీయదేహమ్ము హ్రస్వీకరించి
రావణు రథముపై లంఘించె నార్చుచు
బహువిచిత్ర గతులఁ బంక్తివదను

ధ్వజముపైఁ గిరీటమ్ముపై, ధనువుపైని
ఛత్రమున వ్రాలి రాక్షస చక్రవర్తిఁ
బలువిధమ్ములఁ జీఁకాకు పఱుపఁజూచి
దాశరథులు, మారుతియు ముదంబుఁజూప 156

వానరులసింహనాదముల్ ప్రబలుచుండ
కొంతవడి నట్టులేనిల్చెఁగుతిలపడుచు
తేఱుకొనె నొక్కక్షణమున దితిజనాథుఁ
డెంతొ క్రోధతామ్రాక్షుడై పంతగించి 157

కీనాశుండును వింట సంధిలుచు నాగ్నేయాస్త్రమున్ వీడుచున్
కోనల్ ద్రిమ్మరి మాయలెన్నిటినొ వాకోరాని మార్గమ్ములో
నానందమ్ముగఁ జేసియింతవఱకున్ వ్యాకూతి వేధింపఁగా
"నీనారాచము నిన్ను మన్నిగొను సుమ్మీ నీల! రక్షించుకో 158

నీపని నేటితో సరియె నీలవనేచర! కాచుకొమ్ము నీ
పాపముపండి నాయెదుటఁబ్రజ్ఞవెలార్పగ నెంతువే మహా
టోపముఁజూపుచుంటివె పటుత్వములేకయె క్రోఁతిచేష్టలన్
నైపక నిన్ను నేను పరుషమ్ముగఁ జంపెద నిల్వరించుచున్ 159

అది తగిలి నీలసేనాని యవనిఁ బడియె
వహ్నిపుత్రుడు స్వయముగా బలియుఁడౌట
సంచుకంతయు నెడరు గావింపలేదు
ప్రాణభయమేమి లేకుండ బ్రతికిపోయె 160

పుడమిందూలిన నీలవృక్షచరుఁడున్ మూర్ఛిల్లఁగాఁజూచియా
తఁడుగర్జిల్లుచు దూఁకె లక్ష్మణునిపై దర్పమ్ము మీఱంగ నా
నడుమన్ మార్కొను భానుజాదులను సైన్య స్తోమమున్ ముంచుచున్
కడిమింజూపుచు బాణముల్ విడిచె వీక్ష్యన్మూర్తిఁగల్గించుచున్ 161

దనుజేంద్రుండును శింజినీభయదనిధ్వానమ్ముతో రోషియై
చనుచుండన్ బలశాలి లక్ష్మణుఁడు "ఖూజానీ ! ప్లవంగుల్ పయిన్
ననినేయంబనిలేదు నా పయికి రమ్మా ! యంచు జ్యానాదమున్
బొనరించాతని మార్కొనంగ పిలువన్ బ్రోద్దాముఁడై క్రోధియై 162

ఆమంత్రింపగ దశముఖుఁ
డాముకొనగ నాగి యెంతొ యాటోపమ్మున్
సామంతమ్మను జూపుచు
"సౌమిత్రీ ! వచ్చినాడ సమరమొనర్పన్ 163

నా కనులఁబడితి విప్పుడు
నా కాండ ప్రహరణముల నజ్జు నజ్జుగాఁ
బోకార్చి నిన్ను యమపురి
కేకాగ్రుఁడనౌచుఁబంపి యెదరు మాన్పెదన్" 164

సరగంజేసె సుమిత్ర సూతియు ధనుష్టంకారమున్, దానవే
శ్వరుఁడున్ గ్రోధపరీతమానసుఁడు విశ్వాసమ్ముతో కండ్ల ముం
దరికిన్ రాఁగ "మదీయ బాణముల చేతన్ గాల్పురిం జేర్చెదన్
మరణంబిప్పుడు మూఁడె లక్ష్మణ ! యిదే మార్కొందు నిన్నిప్పుడున్ 165

నావుడు సుమిత్ర తనయుఁడు
రావణుతోఁబల్కె నిటుల రద్దిసేయుచున్
"నీ విక్రమ వీర్యమ్ముల
నీవేల గణించి చెప్పనియతి యగునొకో 166

నీవాత్మస్తుతిఁజేయకు
రావణ ! నీ పరాక్రమము రణశాలితయున్
చేవయు నెఱిఁగితి మున్నె
కావున తలపడుము చేవగలిగిన నాతో 167

ఏ ప్రభావ సంపన్నుఁడు నెపుడుఁగూడ
నిటుల గర్జింపఁడెంతయో యిత్వరుఁడవు
కనుక డంబముల్ కొట్టెద వనుచితముగ
లేదు నీ మాటలంబస లేశమైన" 168

అనుచుఁబలుకుచు సౌమిత్రి యసురనాథు
పైని సప్త బాణమ్ములఁ బరఁగజేసె
నతని తలపైని యాశరుఁడందుపైని
ముక్కలుగజేసె వానిని కక్కసించి 169

వేసెను రావణుండు సరవిన్ విశిఖమ్ములఁబెక్కు వైరిపై
వేసిన బాణముల్ విఱిచి వేసెను లక్ష్మణుఁడందుపైని రా
కాసి విభుండు ముక్కలుగ గ్రక్కున జేయుచు వెండి లక్ష్మణున్
గాసిలఁజేసె ఫాలమున-కాశ్యపివ్రాలె సుమిత్ర పుత్రుఁడున్ 170

తేఱెను కొంతసేపటికి ధీరుఁడు లక్ష్మణుఁడెంతొరుష్టుఁడై
గోరణముంబొనర్చి పడఁగొట్టెను రావణు విల్లు పేర్మిమై
వారక మూఁడు బాణములు వైచి నసాళమునంటఁగొట్టగా
వైరియు మూర్ఛలో మునిఁగె వైళమ-తేఱెఁగ్రమక్రమమ్మగా 171

జలజభవుండు రావణుకొసంగిన శక్తి సుమిత్ర సూతిపై
నలుకఁబ్రయోగమున్ సలిపె నద్దియురమ్మునఁదాఁక పెల్లుగా
విలవిలలాడి లక్ష్మణుఁడు విహ్వలుఁడై ధరవ్రాలె-వ్రాలఁగా
నలుపుఁడటంచు రావణుఁడు నాతని నెత్తగఁబూని వ్యర్థుఁడై 172

హిమగిరి మందరాచలములెత్తగ వచ్చుఁద్రిలోకముల్ వెసన్
క్రమముగనెత్త సాధ్యమగుఁగాని రణాంగణమందు నుండుచో
విమలిమఁగల్గు లక్ష్మణుని వేయి విధమ్ములనెత్తఁగాదు వి
క్రమమును గల్గు రావణుఁడుఁ గాల్పడె నెంతగఁ బట్టుపట్టినన్ 173

కమలభవు శక్తి స్వీయవక్షస్థ్సలమును
గాఢగా తాను విష్ణ్వంశ కలిగియుండు
నటుఁదలంచెను సౌమిత్రి యందు వలన
నతని నెత్తగ రానవుం డటమటించె 174

అది గమనించి వాయుజుఁడు నారటమందుచుఁ గ్రుద్ధుఁడై యరుం
తుదముగ వజ్రముష్టిఁబగతున్ బ్రహరింపగ దాన నాతఁడున్
వదలగ లక్ష్మణున్-గనులు పచ్చపడంగను నూఁగిపోవుచున్
కొదలి వసుంధరన్ బడియె ఘూర్ణిలి కన్నుల రక్తమోడఁగా 175

దేవతలు, పరమర్షులు దితిజవిభుని
హటునకుఁబరమాశ్చర్యభరితులై రి
కపులు పవమాననందను కడిమిఁగాంచి
సింహనాదముల్ సలిపిరి చెలఁగి ప్రీతి 176

చేతులనెత్తి లక్ష్మణునిఁజెన్నుగఁజేకొని యాంజనేయుఁడున్
ప్రీతిఁదలిర్ప రాముని సవేశమునన్ శయనింపఁజేయగా
వాతతనూజుఁడున్ పరమభక్తుఁడు, స్నేహితుఁడౌట తేలికై
యాతని సాధ్యమయ్యెననిలాత్మజుఁడీశ్వరునంశఁబుట్టుటన్ 177

అంతబ్రహ్మశక్తియరిగి లక్ష్మణువీడి
చేరెఁబంక్తిముఖుని చిత్రమగను
మాయమయ్యె నతని గాయములన్నియు
కాయమెల్ల వజ్రకాయమయ్యె 178

దితిజనాథుఁడంతతేఱుచు ధనువందు
కొనుచు నిశిత శరములనుఁ బ్లవగులఁ
గొట్టసాగదాన కొందఱు మొనగాండ్రు
పడిరి కొంతమంది పాఱిరెటకొ 179

అంత శ్రీరామచంద్రుఁడు నసురనేత
పైని విఱుచుక పడసాగఁ బావనియనె
విష్ణువు సుపర్ణుపై బోవువిధముగ మహ
నీయ మద్భుజముల నెక్కి నిగ్రహించు ! 180

అరదమున దశాస్యుండును ననిలసూతి
భుజములను రామచంద్రుఁడు పోరొనర్ప
మొదలిడగ దాశరథి దానవునిగఁనుఁగొని
రుష్టుఁడై నిగదించె సంక్లిష్టుఁడగుచు 181

నాకు మహాపకారము నొనర్చి మనమ్మున శంకలేక ము
ల్లోకములెత్తి వచ్చినవిరోధి నిమన్ ధ్వజినిన్ వధించెదన్
నాకొనరాని చైదముల వర్తిలుచుంటివి గర్వివౌచు న
ష్టాకలఁబెట్టుచున్ మిగుల రావణ। మాన్పెద। తద్ద్రయత్నమున్ 182

మానుగనొక్క చేతిపయి మారణ హోమముఁజేసినాఁడ దు
ర్మానఖరాది రాక్షసులనేఁ బదునాలుగువేల సేనతో
హీనుఁడ। నిన్నుఁగూడనటులే దుమమాడెద నంచుఁబల్కగా
దానవనేత విల్లునినదం బొనరించెను రోషియై వెసన్ 183

సరగ దేవేంద్రుపాలికిఁ జనిన దండ
ధరుని పాలికిఁ బోయిన తపన మండ
లమునకేఁగినఁ బ్రహ్మలోకమున కరుగ
నెచటికేఁగినఁబొలియింతు నిత్వరుండ 184

తొందరపడకు దశాస్యా
కొందలపడఁజేసి సహజుఁగూల్చితి వనుచున్
గ్రుందింతు నిను సపుత్ర
బాంధవముగ మగుడి వచ్చి ప్రధనము నందున్ 185

అంత రఘువీరశేఖరుం డక్షులందుఁ
గెంపునిగుడంగ నెఱ పరికించి కదిసె
వారువమ్ములఁ బ్రక్కలువాపి సూతు
కసిమసంగెను శితపృషత్కములనేసి 186

రథము విఱిగె పతాకము వ్రాలె ధరకు
చామరములు, ఛత్రమ్మును క్షమ కొరిగెను
అశనికల్పబాణమ్ముల నసురవిభుని
వక్షమునఁబ్రహరించె నృపాలుఁడలుక 187

పాలసుండును కాలాగ్నివంటి విశిఖ
ములఁ బ్రయోగించి హనుమంతుఁగలఁచె కాని
యినుమడించె నాతని తేజ మిమ్ముకొనుచు
తెల్లబాఱెదశాస్యుఁడీ తీరుఁగాంచి 188

రామధరాధిపుండటుల రావణుఁ గొట్టగ వక్షమందునన్
భీమశరాసనమ్మువిడి వెన్కకుఁ దిర్గుచుఁబాఱుఁబోవగన్
రాముఁడు నర్ధచంద్ర ప్రదరమ్మున వాని కిరీటమూడ్చుచున్
ధీమసమున్ వెలార్చి నిగదించె నిశాచర నేతఁగాంచుచున్ 189

ధైర్యముతోడ భయంకర
కార్యము లొనరించినావు కలుషించుచు ఘోరం
ధర్యముతో నా వీరుల
శౌర్యమ్మును బాపి కసిమసంగితి వౌరా ! 190

పిడుగువడిన, దేవేంద్రుని భిదురఘాత
మునను రావణుఁడెప్పుడు పొనుగుపడఁడు
కాని రాముని దెబ్బతో కలఁగివేగ
కార్ముకమువీడె గిరగిర కనులు తిరిగి 191

అలసియున్నావు కావున నపుడె నిన్ను
సంహరింపక విడుతు రాక్షస నృపాల !
లంకకుంబోయి కొంత విశ్రాంతిఁ గొనుచు
నరుగుదెంచుము నాబలమ్మరయమగుడి 192

జనపతి రామచంద్రుఁడు విశల్యులఁజేసె సుమిత్రనందనున్
వనచరనేత భానుజుని వానరులందఱి స్వీయశక్తితో
దనుజ విభుండు లంకకు వితర్కపరాజయభిన్నచిత్తుఁడై
చనెవడి రామ భూవిభుని శౌర్యము ముందఱ తాళజాలకే 193

పురికింజేరి నిశాచరప్రభువు ముప్పున్ భావమందెంచి వం
దురె సింహమ్మను గాంచు సామజమటుల్ దుర్ధర్షుఁడౌ రామభూ
వరు దుర్వార శరమ్ములన్ దలఁచి కంపంబందు గాత్రమ్ముతో
జరిపెన్ నిద్రకుదూరమై నిశను నిశ్వాసమ్ములన్ వీడుచున్ 194

ఎన్ని రణమ్ములన్ సలిపి తెన్ని జయమ్ములఁ బొందినాఁడ ము
న్నెన్నడు నిట్టి భీతియుదయింపదు నేఁటి దురమ్ములోవలెన్
ఖిన్నుఁడనైతి నోటమి లగింపగ పెల్లుగ రాము చేతిలో
బన్నమునెట్లు సైపుదు విపక్షునితైక్ష్ణ్యము మిన్నయౌటచే 195

కొలువుందీర్చుచు రాక్షసేశ్వరుఁడు నాక్రోశించుచున్ బల్కె మం
త్రుల వీక్షించుచు రామచంద్రవిభుఁడస్తోకుండె నేనెంతగా
బలశౌర్యమ్ములఁజూపినన్ గెలిచె-దుర్భాగ్యుండుగా నిల్చితిన్
తలవంపుల్ గొని తెచ్చితిన్ దురములో దైతేయలోకమ్మునన్ 196

నేనొనరించిన తపమది
హీనమగుచుఁ బదటఁగలిసె నేకతముననో
మానవుని చేత నోడితి
మానుగ వాసవుని గెల్చి మానోజ్ఞముఁగన్ 197

మనుజులవల్ల భయంబగు
దనుజేశ్వర నీకునని విధాత వచించెన్
కనిపించునది నిజమ్ముగ
పనివడునని సచివులార ! ప్రధనమునందున్ 198

ఎప్పుడో వేదవతిని వేధించినపుడు
నను శపించెను కినిసి తద్వనిత తాను
జనకునింటను సీతగా జననమంది
యుండునని తోఁచు నాయూహ మెండుకొనుచు 199

వ। పార్వతి, నందీశ్వరుఁడు, రంభ, పుంజికస్థలల తపః ప్రభావము వలన నేమనినారోయది యిప్పుడు జరుగుచున్నట్లున్నది. 200

అనరణ్యుం డిక్ష్వాకుఁడు
చనిపోవుచుఁదెలిపె నో నిశాచర ! నావంశం
బున పుట్టు మహాపురుషుఁడు
నినుఁజంపు సపుత్రబంధుస్నేహగణముతో 201

వారల తపః ప్రభావము చేత పా
పమ్మనన్నిట్టుల పట్టికుడుపు
కాన తపోధనులైన వారల మాట
లెప్పుడు వృథయగునే ? మనీష
లోనుంచి కొనుచు విలోలితచిత్తులు
కాకుండ జాగరూకత మెలఁగుడు
రాక్షస వీరులారా ! శీఘ్రముగ మీరు
కుంభకర్ణుని మేలుకొలుపుఁడింక

బ్రహ్మశాపాన వాఁడు నిద్రకుఁగడంగె
దైవవశుఁడౌచు తెలివి వ్యర్థమ్మ కాఁగ
సుఖముగా నుండె నిపుడు సుషుప్తి యందు
కొన్ని మాసములుండి మేల్కాను నతండె 202

రేఁగి దేవజాతుల సంహరింపఁగలఁడు
బహుపరాక్రమశాలి నిబ్బరము తోడ
వ్యవహరించును రణములఁ బటిమఁగలిగి
కడుగభీరుఁడు పెక్కువ కడిమి వాఁడు 203

ద్వారములలోన సర్వప్రాకారములను
కాచుకొనుఁడప్రమత్తులై కడిఁది గడవ
దనుజులందరిలోన ప్రధానుఁడతఁడు
క్షత్రియులఁ బ్లవంగులవాఁడు సంహరించు 204

కొన్ని దినముల క్రిందట కుంభకర్ణుఁ
డొక్కయాలోచనముఁజెప్పి యూరడించి
నిద్రకు గడంగె వానిని నిద్రలేపుఁ
డతఁడు మేల్కొన నా చింత యడఁగిపోవు 205

ఏమిలాభము నిజము దేవేంద్రు మించు
వాఁడె కాని ప్రసుప్తిలోఁ బరఁగుకతన
నాకు వచ్చిన చిక్కు కీనాశులార !
సాయ మొనరించు స్థితిలేని సమయము కద ! 206

వ॥ వెంటనే మంత్రులు, భృత్యులు కొందఱు కుంభకర్ణుని భవనమునకు గంధము, పుష్పమాలికలు, వివిధ భక్ష్యములు, మాంసరాసులు అన్నరాసులు, రక్తపు కడవలు, మద్యభాండములఁ దీసికొని శంఖభేరీ పటహనినాదములు మ్రోయ నరిగిరి 207

కుంభకర్ణుని భవనము గొప్పగా వి
శాలమై రమ్యముగను యోజనము మేర
నమరి యుండెను సురభిళమై చెలంగి
లంకలో నున్న సౌధములకు కడిఁదిగ 208

అతని నిట్టూర్పుగాలిచే నటకు నిటకు
త్రోయఁబడుచును భవనములోని కరిగి
రెంతొ కష్టము పైని-నిద్రించు నతఁడు
అచలమటులుండె నెంతొ భయంకరముగ 209

వ్యాత్తవదనము పాతాళప్రతిమమగును
గరిపడుచునుండె నాతని కాయమపుడు
గుప్పుమనుచుండె రక్తము, క్రొవ్వు వాస
నల శరీరము భూషణవిలసితముగ 210

మస్తకమ్మున వాఁడు మకుటమ్ము ధరియించి
యుండెను నిద్రలో నుండి కూడ
పట్టుక వెళ్ళిన భక్ష్యముల్ రక్త మాం
సమ్ములు, మద్యమ్ములిమ్ము కొనగ
వాని సముఖమందు వరుసగా నుంచిరి
పనిగొని వాని తల్పమ్ము దరిసి
గంధమ్ముఁబూసిరి కాయమ్మునకుఁబుష్ప
మాలికల్ వైచి సుమములుఁజల్లి

రగరు ధూపము వేసిరి మొగులు లుఱుము
పగిది నుఱిమిరి శంఖముల్ పట్టి యూది
రందఱును పెడబొబ్బల నఱచినారు
గాఢముగఁబ్రహరించిరి కళలఁబూని 211

బాకాలూదిరి భేరీల్
వీఁకన్ మ్రోగించినారు విటతాటముగా
నేకాగ్రులగుచుఁ బెల్లుగ
నేకోద్దిష్టముగ గోల నెంతయొ సేయన్ 212

ఊరులాస్ఫాలనముఁజేయ దారుణముగ
చుట్టుపట్టుల నున్నట్టి పిట్టలన్ని
యెగిరిపోయెను కాని తానింత కూడ
కనులు తెఱచి లేవకపోవగా విసుగుచు 213

గుదియలతో, రోకళ్లను
గదలు, ముద్గరములతోడ ఘనముగ మోదన్
వదలిన నిశ్వాసముతో
చెదరిపడిరి దూరమ్ముగఁజిల్లుపొల్లుగన్ 214

చివరికి వారలశ్వములచే ద్విరదమ్ములఁదెచ్చి వానిపై
గవియగఁజేయఁ ద్రొక్కినను కాని తలంకక నిద్రమేల్కొనన్
చెవిఁజొరవయ్యె నాతనికి చేతనకందదు కుంభకర్ణుఁడున్
మివుల సుషుప్తి నుండెను ప్రమేయము లేనటు నిర్వికారుఁడై 215

వారి కోలాహలము చేతఁబట్టణమ్ము
దద్దరిల్లెను కాని నిద్రను వదలఁడు
ఇదియుపాయము కాదని యెంచి వేయి
దుందుభుల మొరయించిరి దుర్భరముగ 216

చెవులు నులిమిరి కొందఱు చెవులలోన
నూరుకడవల జలము వినోదభరిత
ముగను పోసిరి వేయి యేనుగుల నడప
కుంభకర్ణుఁడు మేల్కొని కూరుచుండె 217

అతఁడు నిద్రాకషాయితమైన కనులు
పట్టు బలవంతముగ విప్ప వారు తన్ను
లేపినందుకు తొలుత నిర్లిప్తుఁడగుచు
నబ్బురంపడి పరికించె నసురుల వెస 218

దైత్యుఁడంతట దేహము తడుముకొనెను
శైలశిఖరసమాన భుజములఁజాపి
క్రూరబడబాముఖము వంటి నోరుఁదెఱచి
లేచెనెట్టకేలకు నావులించె పెలుచ 219

ఆభరణ భూషితమ్మగు నతని మేను
సారసమ్ములతో నీలజలధరమటు
లుండె వాని నేత్రమ్ములు నుజ్జ్వలముగ
నిప్పులం గ్రక్కు గ్రహముల చొప్పు మిగిలె 220

వెంటనే దనుజులు వివిధాన్నరాసులు
పలలపాత్రల, మద్య భాండములను
రక్తపు కడవల రమణఁజూపగఁగుంభ
కర్ణుండుఁదిని, త్రావి గట్టుమనుచు

త్రేఁచెను దాని గుర్తించుచు సచివులు
మన్ననఁజూపి నమస్కరించి
సాష్టాంగపడగను "సంగతియేమని
ప్రశ్నించి కడుబలవంతముగను

కనులు విప్పి "క్షేమమె యన్నగారి కనుచు
కలదె భయకారణమ్మని. క్షణములోనఁ
బాపువాఁడ రావణునేత భయము నేను
విన్నవింపుడు శత్రులమన్నిగొనెద 221

కూలఁగొట్టెద నింద్రునిఁ గోపకలన
నగ్నినైనను జీల్చెద నన్న స్వల్ప
కారణమ్మవ నను లేపఁ డారటించు
నేదియో పెద్ద కారణమే యెసఁగును" 222

అంతయూపాక్షుఁడను మంత్రి యసురనేత
సోదరుని గాంచి వివరించె "సురలవలన
భయములేకుండె మనుజుల వలన భయము
సంభవించెను కావున సంభ్రమించె 223

రామునిపత్ని సీతఁగొని రా దశకంఠుఁడు, కోపగించి తా
భీమబలాఢ్యులౌ ప్లవగ వీరులతోఁ జనుదెంచె లంకకున్
రామనుబొందు కోర్కెమెయి రావణుతోడ రణమ్మునేయగా
దీమసబుద్ధితోడ నవధీరణముంబొనరింప నెంచుచున్ 224

ప్లవగుఁడొక్కఁడు మొన మొన్న వార్ధి దాఁటి
లంకను దహించిపోయెను, రణములోన
నక్షవధియించె-రాముఁడు నన్నునోర్చి
నుసుఱు దక్కించుకొని వచ్చె మిసిమిఁదూల 225

చెలఁగి విబుధులు, దైత్యులు చేయలేని
పని నొనర్చుచు రాముండుఁ బనిచె నన్ను
దయతలఁచి వీడి యెంతొ వదాన్యుఁడగుచు
ననగ కుంభకర్ణుండనె నాగ్రహమున 226

తొలుత వానరులందఱి దునిమి దాశ
రథులఁ జిక్కఁడి వచ్చెద రాజుకడకు
వానరుల రక్తమాంసముల్ పంచి మీకు
స్వయముగ్రావెద రామలక్ష్మణులనెత్రు 227

దానిపై మహోదరుఁడను దానవుండు
నుడివె నిట్టులఁ గుంభకర్ణుం గనుఁగొని
"ప్రభువ ! ముందుగ రాజదర్శన మొనర్చి
రేఁగి శత్రువులను సంహరింపవచ్చు 228

"వల్లె" యని కుంభకర్ణుఁడు బైలుదేఱ
పరుగుఁదీసి భృత్యులు దశవదనుకడకు
పోయి "తమ్ముఁడు లేచెను పోరుకరుగు
మనెదొ యిటకు రమ్మనెదవో"యని యడుగఁగ 229

పంక్తిపదనుఁడు వచియించె వారిఁజూచి
"అతని నిచ్చటఁ జూచెద నందువలన
గౌరవమ్ముగఁ గొనుచు నాకడకు రండ"
టన్నఁదద్వార్త తెలిపిరి యనుజునకును 230

అది విని రావణుననుజుఁడు స్నానించి
మండనమ్ములఁ దాల్చి మద్యపాన
మత్తుఁడై తృప్తితో మహిపుసందర్శింప
సంభ్రమచిత్తుఁడై సాగుచుండ

నాతని యడుగుల నచల కంపించెను
ధగధగలాడెను దారి సర్వ
మతని తేజస్సుతో నపనీధరము వోలె
నడయాడుచుండ వానరులు చూచి

కడు భయభ్రాంతులై రాముకడకుపోయి
శరణువేఁడిరి కొందఱు పరుగుఁదీసి
రెందఱో నేల వ్రాలుచు నివతళించి
చెట్టు పుట్టలఁబట్టిరి చెదరి బెదరి 231

కుంభకర్ణునిఁ గాంచి కోదండపాణి త్రి
విక్రముఁడైనట్టి విష్ణువవలెఁ
గానిపింపగ భీతికపిసేన పాఱిపో
వగఁ జూచి దశముఖభ్రాతఁ బిలిచి

"వీఁడెవ్వఁడయ్య విభీషణ ! మకుటమ్ము
ధరియించి కాలాంబుదము పగిదిగ
చరియించుచున్నాఁడు క్ష్మామండలమునకు
తలపించుచుండె పతాకవోలె

వానరులు వీనిఁజూచుచు పాఱిపోవు
చుండి రసురుఁడ ? వీనిని చూడనెపుడు
వీని సంగతి నివరింపవే"యనగను
ఆ విభీషణుఁడిటు పల్కె నంజలించి 232

విశ్రవోబ్రహ్మకు వీఁడు తనూజుఁడు
కుంభకర్ణాఖ్యుఁడు గుఱకపోతు
ఇంద్రుని శమను జయించె-నింత ప్రమాణ
ముండినవాఁడు వేఱొండు లేఁడు
అతఁడు దానవులను యక్షుల నాగుల
గంధర్వులను సిద్ధగణమునోర్చె
శూలమ్ముఁబట్టుచు నాలమ్ము సేయగ
నరుగుచో మృత్యువే యనెదరంత

సహజ వర్చస్వి-తక్కు-రాక్షసులు వరము
లంది గొప్పవారైనచో నతఁడు జన్మ
మెత్తుచునె మేరమీఱిన క్షుత్తు ప్రబల
భుక్తికై ప్రాణులను దినమొదలు పెట్టె 233

ప్రజలపుడు భయభ్రాంతులై పాఱిపోయి
శరణు వేఁడగ వాసవు- జంభవైరి
కినిసి వజ్రాయుధముఁ బ్రయోగింప కుంభ
కర్ణుఁడఱచెను బాధతో గజిబిజించి 234

ప్రాణికోటి తద్ధ్వని విని భయమునందె
కుతలమెంతొ కంపించెను-కుంభకర్ణుఁ
డింద్రునైరావతము దంతమిట్టి పెరికి
మఘవు గుండెలపైఁ గొట్టె మండిపడుచు 235

దేవతలున్ మహర్షులును తెప్పునఁ బోవుచు బ్రహ్మపాలికిన్
దేవ! దశాస్య సోదరుని దెప్పరమున్ వివరించి చెప్పుచున్
ద్రావకు బాధ మాన్పుమని ధాతను వేఁడగ నాతఁడంతటన్
దావరిఁగాంచి భీతిలుచు దానవునిట్లు శపించె బ్రేల్మిడిన్ 236

లోకనాశనార్థము నిను
భీకరుఁగనె కుంభకర్ణ! విశ్రవసుఁడు-జగ
చ్ఛోకము మాన్పెద నిది మొద
లాకలితో నిదురనుందు వవగణితుఁడవై 237

శాపంబందుచు కుంభకర్ణుఁడును నిశ్వాసించుచున్ క్షోణిపై
స్వాపంబున్‌గొని వ్రాలిపోవగ భయభ్రాంతుండుగా రావణుం
డాపత్తిన్ గనుచున్ బితామహుని "దేవా! యిద్దిన్యాయంబె! నీ
కోపావేశమునన్ బ్రపౌత్రు కిటులెగ్గుం గూర్తువే నిర్దయన్ 238

ప్రభువ ! నీ మాట చొప్పునఁబరఁగు కాని
ఎపుడు నిద్రింప వలయునో యెపుడు మేలు
కొనవలెనొ నిశ్చయింపుము ఘనతఁజూపు"
మనుచుఁ బ్రార్థించె రావణుఁడజునిఁగాంచి 239

ఆఱుమాసముల్ నిద్రలో నాతఁడుండి
ఒకదినము మేలుకొని యుఁడి హుతవహుఁవలె
వదనగుహలోనఁ గనబడుప్రాణి నెల్ల
మెసవునని జాలితో పరమేష్ఠి పలికె 240

సంకుల రణమున నోడఁగ
లంకేశుఁడు సిగ్గుపడుచు లావరి సహజున్
సంకటము మాన్పునను నా
శంకను లేపించె రామచంద్ర ! సమితికై 241

అ కారణమున నీతఁడు
వీఁకబయలుదేఱ కపుల భీకరవృత్తిన్
జీఁకాకు పఱుపవచ్చును
కాకుత్స్థకులాబ్ధిశీతకర ! కోపనుఁడై 242

ఈతనిఁజూచుచున్ మెసవునేమొ యటంచును సందియమ్ముతో
భీతినిపొంది వానరులు వేరిమికాఁడనిపాఱిపోదు రీ
హేతువుతోడ యుద్ధమొనరించుట కష్టమెయౌను గావునన్
పోతరమున్ననున్ గుఱకపోతని చెప్పినఁ జాలు వారికిన్ 243

ఈ యొకరోజు యుద్ధమున నెవ్వరుఁజిక్కక జాగరూకులై
పాయుచు నున్న క్షేమమగు వానిని వారలు సంహరించినన్
ధ్యేయము పూర్తియౌను-చనుదెంచుఁడటంచును నీలుఁగోరినన్
మాయయడంగిపోవును సుమా రఘునాయక వాని చావుతో 244

"అతఁడొక యంత్రమే! భయమునందకుఁ డాశరుఁడైనకాని ప్ర
స్తుత మతఁడందినన్ మెసవు సూనరియై కదనమ్ము సేయుచున్
పతితునిఁజేయుఁడాతనిని పాదపముల్ శిలలన్ ధరించుచున్
హతమొనరింతు రాప్లవగు లాతని ఘాతకువై ప్రతీపులై 245

అటుల వివరింప నగచరుల్ పటిమఁగలిగి
నిర్భయమ్ముగ నుండుచు నిగ్రహింపఁ
గలరు-కుంభకర్ణుండీల్గు కదనమందు
నీలునకుఁజెప్పుఁడీనీతి-నెగడు జయము" 246

రాముఁడు నీలునింబిలిచి రావణుతమ్ముఁడు కుంభకర్ణుఁడన్
భీమబలుండు వచ్చెడిని భీకరుఁడైనను యంత్రమే యతం
డేమి యొనర్పఁడశ్మముల వృక్షములన్ గొని యాక్రమించుఁడీ
గోముగ లంక ద్వారముల, కూల్తును వానిని నేను వ్రేల్మిడిన్ 247

వ। నీలుఁడు సెలవివ్వగా గవాక్షుఁడు, శరభుఁడు, హనుమంతుఁడు తారేయుఁడు పర్వత శృంగములతో ద్వారముల నడ్డుకొనగా వానరయోధులు జాలు, రప్పలతో, వృక్షములతో రాక్షసుల మర్దింపసాగిరి. అప్పుడు లంకను ముట్టడించిన వానర వాహిని పర్వతము చుట్టుఁజేరిన మేఘమాలికవలె నున్నది. 248

పెక్కురు దనుజులు వెంటరా కుంభక
ర్ణుండు దశాస్యుని నిండు సభను
దర్శించి, యన్నపాదమ్ములకున్ మ్రొక్కి
యాతని యనుమతి నర్హపీఠ
మందు నివిష్టుడై "యసురేంద్ర! నన్ను లే
పించితివేల నీకెవవి వలన
భయముకలిగె నెవ్వండుచావ
సిద్ధమగుచుండె నంచు బ్రశ్నింప నన్న
దశముఖుడు పల్కె "సహజ! నిద్రకుగడంగి
యిప్పటికె బహుకాలమయ్యెను గదయ్య! 249

కనుక లేపించితిని భయకారణమ్ము
రాము మూలాన కలిగె నర్కజునిగూడి
ప్లవగసేనతో రత్నాకరమ్ము దాటి
వచ్చి లంకను ముట్టడి వైచినాడు 250

వనము, లుపవనమ్ములు కూడ ప్లవగసేన
తోడ నిండిపోయెను చూడు-దురమునందు
రాక్షసుల ముఖ్యులెందఱో మ్రందినారు
వానరుల చేత నిప్పటి వఱకు ననుజ! 251

చావఁడొక్కఁడు తరుచర చమువు నందు
చివ్వలందెన్నడును బరాజితులుకారు
అందుచే నాకు నింత భయమ్ముఁగలిగె
ఓ మహాబల : దనుజుల నోముమిపుడు 252

నాశనముఁజేయవలెను సూ ! కీశ పృతన
నిన్ను లేపించితిని దాని మన్నిగొనగ
కోశమంతయు వ్యయమయ్యె కుంభకర్ణ !
నన్ను నీ లంక రక్షింప న్యాయమగును 253

అన్న కొఱకు నీవీపని నాచరింప
వలెను-నిన్నేమి కోరను-వంతమాన్పు
నీ పయిని నాకు కలుగును స్నేహగౌర
వాదరమ్ములు మిన్నగ-కాదనకుము 254

ఊర్జితా ! దేవదానవ యుద్ధములను
నీవు గెలిచితి వన్నిట నీ పరాక్ర
మమ్మిచటఁజూపవలెను సుమా ! సహజుఁడ
ప్రాణికోటిలో నీ యంత బలియుఁగనము" 255

వ ॥ శత్రువులందఱిని సంహరించి నాకీ మహోపకారము చేయుమని ప్రార్థింపగా 256



# పంచమాశ్వాసము

వ॥ కుంభకర్ణుఁడు భ్రాత రావణునితో నిట్లనెను. 1

"సీతన్ దెచ్చిన నాఁడు సర్వులును నీ చెయ్దిన్ వితర్కించుచున్
నీతుల్ చెప్పగ లేదె తప్పనుచు ? మన్నీఁడా ! హితంబీవు దు
ర్నీతిన్ బోవగ దుష్ఫలమ్ము కలిగెన్ పేడెత్తగా నౌనె ! నీ
వాతన్విన్ గొని రామభూవిభునికీయన్ మంచిదౌ నిప్పుడున్ 2

హీనుఁడవై మహేచ్ఛ సతినెత్తుక వచ్చిన కారణమ్మునన్
మానుషమున్న రాఘవుఁడమాయికుఁడా ? తన పత్ని మ్రుచ్చిలన్
దీనునటుల్ సహించుటకు-తీవ్రశరమ్ముల నిన్నుఁదాఁకుచున్
దానవ సార్వభౌమ ! తనదారప్రతిగ్రహబుద్ధి రాఁడొకో 3

ఆతఁడు రాజెనీవలెనె-ఆతఁడు వీరుఁడు కూడ నీవలెన్
నీతియు, ధర్మమున్ గలుగు నేర్పరి, తీర్పరి కాన సంద్రమున్
కోఁతుల దండుతో జలధిఁగోపముతోఁ దరియించి వచ్చె నిన్
ఘాతుకుఁడై వధించి తన కాంతను బొందు ప్రయత్నమందునన్ 4

ముందు చేయంగదగు కార్యములు వెనుకను
తుది నొనర్పఁగనగు పనుల్ తొలుతఁజేయు
వాఁడు నీతియు దుర్నీతి వలని ఫలిత
మెన్నడును కూడఁదాను గుర్తింపలేఁడు 5

పాప కర్మలు నరకముఁబడయునటుల
నీ వొనర్చిన చెడ్డపనికి తగు విధ
ముగను ఫలితము సిద్ధించు ముమ్మరముగ
మంచి చెడ్డలనెంచ సమంజసమగు 6

కామము, మోహమున్ గనులఁగప్పగ గర్వము మిన్ను ముట్టగా
నేమములేని నీ నడత నింద్యమె నీ బలమెంత పాటిదో
రాముని, కీశసేనల బలమ్ము నెఱుంగక యుద్ధమాడగా
ధీమసమెట్లుకల్గె సొరిదిన్ గమనింపవు నీ ప్రయత్నమున్ 7

పరకాంతాగమనమ్ము దుష్టమగు నాపై రాము సైన్యమ్మునున్
పరిబర్హమ్మను నిన్ను ముంచె నదియే వారింప నీవోపమిన్
పరితాపమ్మను పొందుచుంటివిటు దుర్వారుండుగా నుండుటన్
పరిభూతుండుగ రాము హస్తముల నాపాదింపగా యోటమిన్ 8

మంత్రము సేయగ వలయును
మంత్రులతో. హితులతోడ, మహనీయులతో
తంత్రజ్ఞుల నెప్పుడు ని
యంత్రిత చిత్తమున దూరమందు నిలుపవలెన్ 9

తాను బలిష్ఠుఁడై తనరంగ శత్రువు
దుర్బలుండైనచో దురమొనర్పఁ
దగును-విద్వేష్టయు తాను సమస్థితి
లోనున్న సంధికిఁ లోఁబడవలె

తాను దుర్బలుఁడౌచు తనవైరి బలశాలి
　　యైన దానోపాయ మరయవలయు
రాజ! యీ మూఁడు కర్మారంభయుక్తియు
　　తప్పక వలయును నెప్పుడుసుమి

పరమద్రవ్యసంపద వినిపాతప్రతికృ
తియును, కార్యసిద్ధియు మఱి దేశకాల
విభజనమ్మును జతసేయ విఱియబాఱు
నిశ్చయముఁజేసికొనిన ప్రణీత మగును　　10

ధర్మార్థ కామముల్ దనుజేంద్ర! ప్రతివాఁడు
　　అనుభవింపగ వచ్చు నైనకూడ
ఒక్కొకటియొ. రెండో- ఒకసారి మూడేసి
　　జంటగా సేవింప చతురుఁడగును
మూటిని యొకసారి ముగియింపవలెనన్న
　　సాయంతనమ్మొండె సరిపడుసుమి
కామయొక్కటియె ముఖ్యమ్ముగాఁ దలపోయు
　　వాని కధముఁడన్న ప్రథితి వచ్చు

భూపుఁడును, భూపసముఁడు నీ మూఁడు పక్ష
ములను విని యుత్తమంబగు పొలుపు లాశ్ర
యింపనట్టి వాని చదువు యింపు కాదు
ధర్మచింతకునకు నాపదలు పొడమవు　　11

మంచిచెడ్డ లెఱుఁగు మంత్రులతోడ నా
లోచన మొనరింపఁదోఁచు ఘనత
మంచిమార్గమ్ములో మసల నగత్యము
అభ్యుదయముఁ బొందు ననవరతము
మంచిమాటలువిని మంచిమార్గమ్ములో
నడచిన వానికి నయము కలుగు
అభ్యుదయపరంపరాభివృద్ధిగ రాజ్య
వైభవమ్మును బొంది వరల గలఁడు

శాస్త్రముల తీరు నెఱుఁగని జనుఁడుకూడ
గొప్ప యాలోచనల నెన్నొ చెప్పగలఁడు
దుష్టులైన సచివులు శత్రువుల తోడ
చేరి నాశముఁగలిగించు వారె ప్రభువ ! 12

ఎపుఁడు వైరుల సంగతి నెఱుఁగకుండ
ఆత్మరక్షణ విషయమునందు శ్రద్ధ
లేని జనపతి చెడిపోవు లేకి యగుచు
తమ్ముఁడు విభీషణునిమాట తథ్యమెనుమి 13

అనుజు మాటల నీవపుడాదరించి
ఆచరించిన నదియ శ్రేయస్కరమ్ము
నీకు తోఁచిన రీతిగా నిర్వహింపు
మింక నేనిప్డు చెప్పెడిదేమిలేదు 14

దేశము, కాలము, పాత్రము
లేశము యోజింపకయె యొనర్చిన పనులన్
నాశిల్లి చెడ్డ ఫలితము
లే, శరీరులకును గల్గు నృపతి ! యనిశమున్ 15

కక్షను సచివులు వైరుల
పక్షమునంజేరి పెక్కు పన్నాగమ్ముల్
లక్షించుచుఁ గష్టముల వి
లక్షణులై కూర్పగలరు లఘిమ కలుగఁగా 16

ఎవఁడు శత్రుల సంగతి నెఱుఁగఁబోక
స్వీయరక్షణ కశ్రద్ధ చేయువాఁడొ
ఆనృపతి కష్టభాజనుఁడగును కాన
ధర్మమార్గమునం బోవఁదగును నీకు" 17

వ। అంత రావణుఁడు నొచ్చుకొని యిట్లనెను. 18

ఆపదఁ గడవం బెట్టగ
లేపింపగ కలనుసేయ లేచియిటులన
న్నేపాపివనుచుఁ దెగడెద
వాపన్నుఁడనగుట వలన నంతచులకనా ? 19

ఇపుడు మాటలతోఁ బనియేమి ? కార్య
మాచరించుట ముఖ్యము-తోఁచలేదొ
లేద బలగర్వముననొ, తెలియమివలనొ
ఏదొ చేసితి నది చెప్పనేల మరల 20

అది యిపుడు కలిసి వచ్చెనె ?
మొదలయ్యెను యుద్ధమిపుడు మోపరినగుదున్
బదులిడకు మేదొవాకొని
కుదురుకొని యొనర్చు కార్యకుశలతయున్నన్ 21

నీకు నామీద స్నేహమే నెలవుకొనిన,
నీ బలము విక్రమమ్మును నీ వెఱిఁగిన,
అద్ది గావింప నీ మనసయ్యెనేని
పాపుమా నాకు వచ్చు నాపదను నీవు 22

అన్న యటంచు నెంచక ప్రయత్నముఁజేసెను బోధ సేయగా
నిన్ని విధాలఁబల్కె నతఁడీసునసేమొ విభీషణుండు-నా
కన్న ఘనుండె? రాముని ప్రకర్షము గొప్పది లోక భీకరం
బన్న యథార్థమున్ మఱచె నర్ధవిహీనుఁడటుల్ వచింపగా 23

కులము పెద్దవోలె గురువు రీతిగ ధర్మ
పన్నములను బల్కు పందవగుదె ?
ఏ ప్రయోజనమ్ము నెసకమెసఁగ దిద్దు
కలిసిరాదు కుంభకర్ణ ! బోధ 24

కార్యభగ్నమై దైన్యముఁ గలవరించు
నాకు సాయముఁ గావించి నన్ను తటముఁ
జేర్చువాఁడె నిజమ్మగు స్నేహితుండ
టంచుఁదీవ్రముగాఁ బల్కె ననుజునకును 25

అన్నకు కోపము వచ్చిన
దన్న విషయమెఱిఁగి మెల్లననుజుఁడు పల్కెన్
విన్నను వొప్పగ వినయము
చెన్నుపడ నమస్కరించి చేరుచు దరికిన్ 26

దనుజేంద్ర విచారింపకు
కినుక వహింపకుము-నీకు గెలుపు లభించున్
మనుజుఁడెవని మూలమున నీ
కును కష్టము వచ్చె వాని కూల్తుననుజుతో 27

నేను జీవించునందాక నీకు బెంగ
వలదు-నీకేను మిత్రుఁడ, బందుగుఁడను
సర్వకాలములందును సఖిత నెఱపి
హితముఁజెప్పెద నగ్రజ ! సతము భక్తి 28

రణముల సంహరించెదను రాముని, లక్ష్మణు, శత్రు సైన్యమున్
గొనగొని రామచంద్రు తలఁగొట్టుచుఁదెచ్చెద సంతసింపుమా
జనకజ దానిఁ గాంచుచు విషాదమునన్ దపియించు బందుగుల్
క్షణనమునొంద రామువధఁ గాంచెద రాశరులందఱప్పుడున్ 29

భూవర ! భూధరసముఁడు, సు
గ్రీవుఁడు రుధిరమ్మునందుఁ గెడపగ పడఁడే
వావిరి నేనీ యోధులు
దావరులుగ నుద్యమించి తార్కొనఁగడిమిన్ 30

ఈ పరిస్థితిలో రాముఁడెటుల నిన్నుఁ
జంపఁగలుగును-రాముండు చంపి నన్ను
మొదట-నీదాక రాఁగల్గు ముదలకించు
నా విషయమందు నాకెట్టి నష్టిలేదు 31

కనుక సెలవిమ్ము పోయెద పనియొనర్ప
నీ విరోధులనందఱి నేను చంపు
వాఁడ ! నింద్రుఁడు, శమనుఁడు, వహ్ని, వైశ్ర
వణుడు, వరుణుఁడు, వాయువు వచ్చిన సరె 32

వాఁడి శూలము ధరియించి పర్వతమటు
బయలుదేఱిన నను జూడ భయమునంది
పాఱిపోదురు సర్వదేవతలు కూడ
ఆయుధము లేకపోయిన నని మిగలరు 33

అన్న ! నేనుండ చింత నీకనవసరము
రణము సేయఁగ నేఁబోన రాముఁదలఁచి
భయపడకు మింకపై వైరి పని ముగింతు
వృక్షచరులను, హనుమంతుఁ బీఁచమడఁతు 34

రణములోఁగుంభకర్ణు పరాక్రమమును
సకల భూతముల్ వీక్షించు సమయమయ్యె
పరిమితంబైన జగముల ప్రాణికోటి
ఒక్కపూటకు సరిపోవ దోఁగిరముగ 35

రామలక్ష్మణులను జంపి రాజచంద్ర !
వానరుల మ్రింగి పైవంగ దానవేంద్ర !
క్షేమముగ నుండి మెలఁగుము క్రీడలందు
మద్యములఁద్రావి సుఖియింపుమా ! ఘనముగ 36

అందుపై మహోదరుఁడుఁదానందుకొనుచు
పలికె నో కుంభకర్ణుడా ! ప్రభవమంది
నాఁడవు కులీనుఁడుగ, కాని నాగరికము
లేదు నీ యందు నెంతొ గర్విష్టివగుదు 37

అన్నివేళలను కార్యా కార్యములు నీకు
తెలియవు-నీకెట్టిధిషణలేదు
నీ యన్న యెఱుఁగును నీతియు, నవినీతి
బాల్యచావల్యమ్ము వలన నీవు
దంభమ్ముఁజూపెదు దానరేశ్వరునకు
దేశకాలములు, వృద్ధి క్షయములు
తనవి, శత్రువులవి ఘనముగా ఁదెలియును
కేవల బలముండి తీవిలేని

వృద్ధసేవ యేమాత్రము నెఱుఁగనట్టి
చిలిపి వానికి సహితము చెడ్డదనుచు
తోఁచు పని యామహాపండితుఁడు నృపవరు
డేల చేయును తెలిసియు నిత్వరుఁడయి 38

ధర్మార్థకామముల్ ధరణీశు లక్షణ
　　ములుగను నన్నతో పలికెదేల ?
ఇది వీకు తెలియునా ? ఏ ఫలమునకైన
　　కర్మయే యగు దాని కారణమని
కర్మ మంచిదియైనఁగలుగు దుష్ఫలితమ్ము
　　శ్రేయమే కలుగును చెడ్డదైన
ఇహపరలోకాల కిరవొందు పనులఁగా
　　వింతురు పురుషులు వేఱు ఫలిత
ముండు నొక్కకప్పుడు కూడ నుల్లసమ్ము
కలుగుఁగాముకులకును సుఖమ్ముఁగాన
వీని నెఱిఁగిన రావణవిభుఁడు సీతఁ
దీసికొని వచ్చె మాసమ్మతినిఁబడయుచు 39

మానవు!డంచు నెంచితివి-మాయురె ! రాముని, మున్నుఁదా జన
స్థానములోఖరాదులను దానొకఁడే పదునాల్గువేల సే
నానివహమ్ముతో దునిమె-నాయన ! పిన్నవు కుంభకర్ణ ! దు
ర్మానముఁజూపఁబోవకుము రాముసలంతిగ నెంచి గర్వివై 40

రాముఁడు పంచాననమని
భీమబలుండనుచుఁ దెలియవే ! యింద్రునితో
దామనిధి సాటి యగునని
నామూషియె వాని బలము నాసియటన్నన్? 41

నీ వాక్కా డవా రాముని
చేవనెఱుఁగకుండఁబలుక సిగ్గగు చుండెవ్
దావరియగు రాముఁడు నీ
కావరమడఁగించు కుంభకర్ణ ! సులువుగన్ 42

నిదురించుచున్న సర్పము
నదిరా ! మేల్కొలుపఁ జిక్కులందెదవు సుమా !
కుదురుగ నుండక పోయినఁ
జిదుమఁగలఁడు నిన్ను నీదు సేన సైతమున్ 43

క్రోధమున దుర్నిరీక్ష్యుఁడై సాధకుఁడగు
మృత్యసముడును మఱియు సహింపరాని
రాము నెవఁడు సమీపించు లావు కలుగు
వీరుఁడెవ్వఁడు నీ లావు విదితము కద 44

సర్వశక్తి సంపన్నుఁడై శత్రువునెది
రించి ప్రాణముఁ గోల్పోవు రేకుఁడెవడు
నీవాకండవె పోయిన నివ్వటిలునె
నీవుకోరిన విజయము నిశ్చయముగ 45

కుంభకర్ణు నిటుల తర్జన భర్జనఁజేసి తరువాత మహోదరుఁడు రావణునితో నిట్లనెను 46

రాక్షసరాజేంద్ర ! రమణి సీతనుదెచ్చి
నీయధీనమ్మున నిలిపినావు
వట్టిమాటలతోడ పనియేమి ? నీవెప్డు
కోరిన నాముద్దుగుమ్మ నీకు
వశమగు-దీని కుపాయము చెప్పెద
నది నీకు నచ్చిన పదిలపడుము
కుంభకర్ణుఁడు నేను కొందఱి దనుజులఁ
గూడి రామునిఁజంపఁగోరితి మని
ప్రకటన మొనర్ప మేమేఁగి ప్రధనములకు
శత్రుతో రణ మొనర్తుము జయముకలిగె
నాసరియె-వైరి బ్రదికిన నాజి సలిపి
రక్త వస్త్రాలతోడ మరలెద మధిప ! 47

రామనామము చెక్కిన ప్రదరములను
మా శరీరములందుండి మరలిరాఁగ
దాశరథుల మెసవితిమంచు దానవేంద్ర
ప్రాలెదము నీచరణ సమీపమున మేము 48

మాకందఱకు నీవు మంచి సన్మానము
లిమ్ము దాశరథులు నీల్గిరంచు
పురమంత చాటించి ప్రోత్సాహకముల, భృ
త్యులకీయ వారు సంతోషపడుదు

రాపైన యోధుల కలరుదండలు వైచి
నూతన వస్త్రముల్ ప్రీతినొసఁగి

పూయించి గంధముల్ పోయించు మద్యముల్
నీవు మైరేయముల్ త్రావుమయ్య

దాశరథులీల్గిరనెడి వార్తను వినుచును
ధరణిజన్ ప్రేమతోడ నోదార్చు మధిప!

ఆశపెట్టుము వస్తువాహనము లిత్తు
ననుచు నిగదింపనామె నిన్నభిలషించు. 49

పడఁతులకు సహజమగు చాపలమువలన
ధవుఁడు మ్రందెనటన్న వార్తను వినుచును
తనకు దిక్కులేదన్న చింతను జనకజ
నీకు స్వాధీనమైపోవు నెనరుఁజూపు 50

తనమనసు మార్చుకొను సుమ్మ దనుజనాథ!
ఆమె యాశనిరాశయై కామితములు
సుఖములును దక్కనను నొకచూపుతోడ
నిన్నుప్రియపడి నింకెఱ నిష్పమగును 51

ఆమె మొన్నటిదాఁకను నఖిలసుఖము
లనుభవించెను తానిప్డవనటవీడు
నీవు ధనవస్తు వాహన నికరమునిడ
తెలివ దానితో నీకు స్వాధీన మగును 52

ఈయుపాయముతోఁచె నాకిపుడు రాజ!
యుద్ధమొనరింప కుండనే యువిద దొరకు
నీకు (గైవసమైనచో నెలఁత రాముఁ
దేవగించుచు నామెఁద్యజించు విసిగి 53

సాధింపులు, వేధింపులు
బాధకు గుఱిసేయకుండ ప్రధనములేకన్
భూధవ! సీతారమణియు
స్వాధీనంబగును నీకు సమరసబుద్ధిన్. 54

నీకోరిక యిటనుండగ
నే కుదురుచుఁ బూర్తియగును నిర్బాధముగా
శోఁకులకు నాశనముండదు
నీకు ప్రాణసంశయమ్ము నిగుడదు కూడన్ 55

సంగరము చేయకుండనె శత్రునోర్వఁ
గలుగు కీర్తియు, సంపద ఘనముగనవి
అనుభవింపగ నౌనుకదా మహేచ్ఛ!
శ్రేయమును గూర్చునట్టి యుపాయమిద్ది 56

అనుచు మహోదరుండు దనుజాధిపుతో వచియించి యాఁగగన్
వినుచును కుంభకర్ణుఁడనె "విక్లబమేల? దురాత్ముఁడైనరా
మునివలనంగలుంగు భయమున్ దొలఁగించెద నీవు హాయిగా
మునుపటిరీతినుండుము ప్రభూ! సుఖియించుచుఁ దృప్తినందుచున్ 57

నీరులేని మేఘమురీతి శూరులెపుడు
వ్యర్థముగను భాషింపరు ప్రధనమందు
నాప్రతాపముఁ జూపించియే ప్రయతుని
వలెను గర్జింతు రామునిఁబిలుకుమార్చి 58

ఇతరుడెంతగఁదమ్ముఁ దూషించినసరె
దావరులు చేయరెపుడు నాత్మస్తుతిసుమి !
గొప్పపనిఁజేసి చూపించు టొప్పు కాని
వదరుబోతుగ నుండరు-పలుకునపుడు 59

బుద్ధిలేకుండ నీవలె విఙ్ఞవీగు
పిరికిపందల మాటలు వినుటవలన
నన్నగారికి వచ్చిన యాపద యిది
ఇంతవఱకుఁదెచ్చిరి మీర లిచ్చకముల 60

చొక్కసమ్మంతఁదటిగెను-చిక్కులొదవె
సేన నాశనమయ్యెను దీనికంత
కారణము మీరు-శత్రులు కారు కాన
ఆపదనుమాన్ప నాజి కేనరుగుచుంటి 61

దరహాసమ్మొనరించి రావణుఁడు చోద్యంబౌను సుమ్మీ, మహో
దరుఁడెంతో భయమందు రాముఁడన యుద్ధంబందుచే కాదనున్
పరికింపన్ బలమందు స్నేహమున విశ్వాసమ్ము నీపట్ల సో
దర ! నీవంటె పరాక్రమంబుగల యోద్ధల్ లేదు నాదృష్టిలో 62

అనుగుందమ్ముఁడ ! వైరులన్ గెడప నభ్యామర్ధమందీవు గె
ల్పును సాధింతువు నాభయంబుడుపు వీరుండంచు లేపించితిన్
కనుకన్ శూలముఁబూని వహ్నివలె సంగ్రామమ్ముఁగావించి యా
మనుజాధీశ్వరునిఁ దమ్మునిన్ ప్లవగులన్ బ్రమందించుమా వ్రేల్మిడి 63

నీరూపమ్మును జూచియే
ఆరాటముతోడ ప్లవగు లలజడెపాఅన్
శ్రీరాముఁడు లక్ష్మణుఁడును
బోరామిన్ గుండె లదరిపోరే అనుజా ! 64

అని పల్కి ప్రోత్సహించుచుఁ
దనకుఁబునర్జన్మ వచ్చుతరముగనెంచి నె
మ్మనమున నానందించుచు
దనుజాధిపుఁడనుజు భుజముఁదట్టె గోమునన్ 65

రావణనేత తమ్ముని పరాక్రమరీతి నెఱుంగుఁగావునన్
శీవియుదర్పమునన్ వెలయ డెందమునందున నిష్కళంకుఁడౌ
రేవెలుగట్లు భాసిలి, స్ఫురించెఁబ్రమోదితచిత్తుఁడై పరీ
భావమునుజ్జగించి రణభారము సర్వము మోపెఁదమ్ముపై 66

మంచిది తమ్ముఁడా ! చనుము-మానవమాత్రులు, రాజపుత్రులన్
కించులు వానరాధములఁ గిమ్మనకుండగఁజేయ మేలుకొ
ల్పించితి-నిన్నుఁబోలు గడివీరుఁడులేఁడెట క్షోణిలోన నిన్
మించెడివాఁడు-నాకయి సమిత్తునకేఁగి జయించి రమ్మగిన్ 67

రావణరాజేంద్ర ! రణముసేయగనేనొ
కండనెపోదు నాకలి యధికము
గానుండె కనిపించు కపుల మ్రింగఁగవలె
ననగ వారించుచు నసురనేత

సైన్యములేకుండఁ జనరాదు-ప్లవగులు
సామాన్యులుగనెంచ సబబు కాదు
బలపరాక్రమవంతు లలఁతులుకారు సై
న్యమువెంటఁబెట్టుక అరుగుమయ్య

తీవ్రవేగులు కొఱుకుచు తిందురు సుమి
శత్రువులఁ జంపఁగలిగిన సైనికులను
తీసికొనిపొమ్ము-పోయి వధించిరమ్ము
గుండెగుబులును మాన్పుము కుంభకర్ణ ! 68

అనుచుఁబౌలస్త్యుడు ననుజునకుంజెప్పి
సింహాసనముడిగ్గి చెంతకరిగి
గ్రీవలో రత్నమాలికలుంచి మురుగులు
నంగుళీయకములు హస్తములకుఁ

దొడిగె, దుకూలముల్ తొడిగించె విలువైన
రవణముల్ కైసేసి రమ్యమైన
ముత్యాలహారము ముచ్చటగావైచి
గంధమ్ముఁబూసెను కాయమునకు

అంగరాగమ్ములలదె దేహమున-కుండ
లములు చెవులకుఁబ్రీతి నలంకరించె
అంగదలను కేయూరము లావటించె
పూలదండల ననుజుని ముంచివైచె 69

ఆ తతంగము పూర్తియై కుంభకర్ణుఁడు
వహ్నిచందమ్మున వరలి వెలిఁగె
అమృతమ్ముకొఱకు క్షీరాబ్ధినిఁదరియించు
సమయాన మందరాచలముచుట్టు
చుట్టిన వాసుకి యట్టుల కటిసూత్ర
ముండె తనుత్రాణమునుధరించె
సకల భూషణములు సంతరింపగమేన
శూలపాణియగుచు శోభనిలువ
అచ్యుతుండు త్రివిక్రముఁడైనరీతి
వెలిఁగిపోయెను తేజము వెలయుచుండ
అన్ననక్కున గదియించి యమితభక్తి
నగ్రజునకు ప్రదక్షిణ మాచరించె 70

రావణుఁడు కుంభకర్ణుఁ బరాక్రమించి
శత్రునాశనమొనరించి జయముఁగొనుచు
తిరిగిరమ్మని యాశీర్వదించెఁబెపిమ
నతఁడు బైలుదేఱగ సిద్ధమయ్యెనపుడు 71

దుందుభుల్ మ్రోసెను తోడనె శంఖమ్ము
లుఱిమెను దానవు లుద్ధతులయి
గదలు, ముద్గరములు, ఖడ్గముల్, ముసలముల్
శూలమ్ములును భిండివాలములును

బాణాసనమ్ముల పాణుల ధరియించి
కరులమీఁదను, తురగములపైని
గార్ధభమ్ములపైని కలనుసల్పగఁబోవు
చుండగ రాక్షసయువిదలపుడు

కుసుమ వర్షముఁ గురిసిరి కుంభకర్ణు
పైని-వానలో నడచెడి వారణమ్ము
పగిదినాతఁడు చెలఁగ కాల్బలముకూడ
వివిధ శస్త్రాస్త్రధారులై వెంటనడువ 72

అపుడు మఱియొక రూపము నతఁడుదాల్చె
నూఱుధనువుల వెడలుపు నాఱునూర్ల
ధనువుల పొడుగు దేహము దనుజుకుండె
బండిచక్రములటులుండె వానికనులు, 73

కాలిన పర్వతమట్టుల
మాలిమి ననుచరులఁగాంచి మనుజాశనుఁడున్
"జ్వాలాజిహ్వుఁడు మిడుతల
మాలుచునటు మ్రింగివైతు మర్కటకులమున్ 74

షూ తోటలలో నుండెడి
కోఁతిఁజాతి యెపుడునాకు కూర్పదు హానిన్
సీతానాథుని తమ్ముని
ఘాతించినచాలు వీరు గతియించినచే ! 75

అదివిని దానవ యోధులు
నదరగ బ్రహ్మాండ భాండమార్చిరి పెలుచన్
కుదురుకొని కుంభకర్ణుఁడు
ముదలకింపఁబోవుచుండె ముందునకు లెసన్ 76

దుర్నిమిత్తమ్ములు తోచెను-మేఘముల్
రక్తిమనుల్కల రాల్చె వనులు
సాగరసహితమై సర్వంసహ వణంకె
గ్రద్దలు వరుసలుకట్టి యెగిరె
పక్షులు మండలభ్రమణమ్ము సేయుచు
నపసవ్యముగ వ్యోమమందుఁ దిరిగె
నక్కలు వికృతనినదములఁగావించె
తపమనిలో కాంతి తగ్గిపోయె
అతని వామనేత్రమ్మంతో యదరె-వామ
భుజముఁగూడ స్ఫురించెను పోవునెడల
కాని లెక్కింపకాతఁడు కదవెముందు
నకు మహోత్సుకుఁడగుచు రణమ్మొనర్ప 77

కోటగోడను దాఁటుచు కుంభకర్ణుఁ
డరసె వానరసేన మహార్ణవమటు
చెలఁగుచుండగ సలిపెను సింహనాద
మెంతొ భీకరమ్ముగను నిశ్చింతుఁడగుచు 78

వానరులు పర్వతమ్మటువచ్చు కుంభ
కర్ణుఁగని దిక్కుతోచమి కాతరులయి
పరువు తీయగఁజూచుచు పంక్తిముఖుని
తమ్ముఁడు మరల సింహనాదమ్మొనర్చె 79

యముఁడు కింకరులను గూడి సమరమునకు
వచ్చునటుఁదోఁచ భయపడి ప్లవగుయోధు
లదరిపడి దిక్కుకొకఁడుగా చెదరి పాఱ
కుంభకర్ణుఁడు యుద్ధోన్ముఖుండు కాఁగ 80

తలపడె వానరధ్వజిని దానవసైన్యముకుంభకర్ణునిన్
శిలలను బాదపమ్ములను జేకొనికొట్టి వలీముఖుల్ వెసన్
తలఁకడు వాని వక్షమునఁదాఁకిన నన్నియు పిండి పిండియై
నలినలియౌచు నేలపడినన్ బెగడొందుచుఁగాంచి రాతనిన్ 81

శూలముతో దశాననుని సోదరుఁడున్ జెలరేఁగ శక్తితో
నాలము సేయుచున్ మిపులనాకలిమై కనపడ్డ కోఁతులన్
లీలగ మ్రింగుచుండగ వలీముఖ వీరులు తల్లడిల్లుచున్
కూలిరి వాని వాతఁబడి కొందల మందుచు విస్తుపోవుచున్ 82

విలయము వచ్చినట్లు కనిపింప ప్లవంగుల వాఁడు మ్రింగఁగా
వెలుపలకేఁగు దెంచిరి ప్రవిష్టులు పెల్లుగ కర్ణనాసికా
బిలముల నుండియే తిరిగి పేరలుకన్ కదనమ్ము సేయగా
నిలుచుచు నుండి రాళరుల నిల్వరమున్ బొనరించు దృష్టితో 83

కడలి పొంగినటుల పిడుగు లుఱుము నట్టు
అద్రిచయము బ్రద్దలైన రీతి
నఱవగా దశాస్యననుజుండు వనచరు
లదరిపడుచు పాఱిరటకు నిటకు 84

కొండగుహలలోన బండరాళ్ల వెనుక
వనధి తీరమందు వారిధిపయి
దాఁగికొనగ వాలితనయుఁడు వెనుకకుఁ
బిలిచి పలికె నిటుల పేర పేర 85

నిలిచిపొండు మీరు నీలుఁడా ! నళుఁడ ! గ
వాక్ష ! కుముద ! శరభ ! పరుగులేల ?
మిమ్ము మీరు మఱచి మీ ప్రతాపమ్ములు.
గౌరవప్రతిష్ఠఁ గాలఁదన్ని 86

క్షుద్రులటులపాఱ శోభయా ! వెనుకకు
మరలిరండు మీరు మాన్యులార !
కదలు పర్వతమ్ము కరణినరుగుదెంచు
వాఁడు యంత్రమగును ప్రాణికాఁడు 87

ఆయంత్రమును గూల్పనగుగాన నందఱు
యుద్ధభూమికి రండు యోధులార !
అనుచుఁదారేయుఁడు నభ్యర్థనము సేయ
కొంత వడికి ప్లవగులు మరలుచు

సంగ్రామ మొనరింప సంసిద్ధులై మహీ
ధరశిఖరమ్ములు ధరణిజనులుఁ
బూని పౌలస్త్యుని వానితోఁ బ్రహరింప
చలియింపకయె నిల్చె క్ష్మాధరమటు

అతని దేహముపైఁబడ్డ యశ్మచయము
వృక్షములు పిప్పి పిప్పియై విపులరాలె
క్రుద్ధుఁడై కుంభకర్ణుఁడు కోఁతిమూఁక
సంహరింపగఁ దొడఁగెఁ బ్రసవ్యముగను 88

మేనులును రక్తసిక్తమై వానరు లపు
డవనిఁబడుచుండి రెట్టనియలరులటుల
చెట్టుపుట్టలఁగొందఱు పట్టుచుండ
మింటికెగిరిరి కొందఱు మిట్టిపడుచు 89

కొండగుహలలో దూరిరి కొంతమంది
చచ్చిన శవమ్ములట్టుల క్షమను కూలి
రింక కొందఱు మిట్టలకెక్కినారు
కొందఱేమొ మౌనమ్ముగ డిందుపడిరి 90

అంగదుఁడు వారినాపు ప్రయత్నమందు
నిలుడు పరువెత్త కాగుడు నేల నెచటి
కరిగినను భద్రమగుచోటు నరయలేరు
భార్యలందురు మిమ్ములఁ బందలనుచు 91

అంతకన్నను చావున్నదా ! తెలుపుడు
అందఱము కులీనులముగదా ! హా యనార్యు
లటుల పదిమంది దగ్గర ననగ లేదె
అంతవారమింతటి వారమనుచుఁ దొల్లి 92

ఎక్కడకు పోయె నాడాబు లిపుడు, పాఱి
పోయి బ్రదికిన వానిని రోయుజగతి
భండనమ్మునఁ జచ్చిన బ్రహ్మలోక
మరుగుదురు—గెల్చి చిర కీర్తినందగలరు 93

కుంభకర్ణుఁడు రాము నక్షలను బడిన
బ్రదుక దతఁడొక్కనింజూచి పాఱిపోవ
నింతవఱకును జేకూర్చు నీయశమ్ము
సురిగిపోవునటంచు నిష్ఠురములాడె 94

అదివిని పలికిరి యగచరుల్ మము కుంభ
 కర్ణుండు చూడుము కసిమసంగు
చుండె—తారేయ ! యేముండెడి సమయము
 కాదు—జీవితమన్న స్వాదువగు న

టంచన నంగదుఁడందఱి బతిమాలి
　　బామాలి మరలించె పవనపుత్రుఁ
గలియగను వార లర్కజునాజ్ఞకై ప్రతీ
　　క్షించుచు నిలువ సుషేణ శరభ

మైందకుముదద్వివిదగంధమాదనహను
మంతఋషభతార పనసు లనికి సిద్ధ
మగుచు ముందునకుఱికిరి బిగువుకొసుచు
కుంభకర్ణునిపై కేఁగు కోర్కెతోడ　　95

ఒక్కుమ్మడిగా వనచరు
లుక్కరులై కుంభకర్ణునుకుచుఁగదియన్
లెక్కగొనక నాతఁడు కెం
పెక్కు కనుల వారిఁజంపివేయదొడంగెన్　　96

గదచేఁబూనుచు కుంభకర్ణుఁడు ఖలీకారమ్ముఁగావింపగా
పదులున్, వందలు, వేలసంఖ్యలుగఁ గూల్పన్ సాగ నుద్వృత్తిమై
దకనంబందున పెక్కు వానరుల మ్రింగన్ వానరానీకమున్
పదిలింపన్ ద్వివిదుండు పర్వతము నా పౌలస్త్యుపై వేయగన్　　97

ద్వివిదుఁడొక గండశైలముఁబెఱికి తెచ్చి
కుంభకర్ణునిపై వైవ గుఱి తొలంగి
యసుర సేనపై పడిపోవ స్యందనములు
హర్యులు, కరులును దెగటారె నద్భుతముగ　　98

క్రవ్యాదరథికులు కాలసర్పసమాన
బాణముల్ పఱపిరి ప్లవగులపయి
అగచరుల్ కూడ ప్రత్యామ్నాయముగ పాద
పమ్ములు, శిలలును పాణులందు
ధరియించి హరులను, దంతులఁదేరుల
కాలిబంటులఁ జంపిరాలమందు
హనుమంతుఁడంతట నాకాశమున వచ్చి
కుంభకర్ణుని పైని కురిసెఁజెక్కు
క్షితిజముల మఱి పర్వత శిఖరములను
కాని పౌలస్త్యుఁడన్నిటి కరమున గల
శూలమున నాశనముఁజేసి తాఁకొనుచు
మరల వానరసేనపై విఱుచుకపడె 99

అద్దిగమనించి పావని యచలశిఖర
మొండుఁజేకొని దనుజుని గుండెలపయి
కొట్ట, నాతఁడు నోటముక్కుల రుధిరముఁ
గ్రక్కె దేహము సర్వము రక్తమయమె 100

మూర్ఛకూడను తలసూపె పొనుగుపడగ
నిలువరించుక శూలాన నిశిచరుండు
పొడిచె హనుమంతు వక్షాన స్ఫూర్తి మిగుల
దానితోనూఁగి యతఁడు రక్తమును గ్రక్కె 101

రాక్షసులు విజృంభించిరి-ప్లవగులపుడు
తో(కముడిచిరి నీలు(డు ధూర్వహు(డయి
వానరులనాపు(జేసి పర్వత శిఖరము(
బూని ప్రహరించె పెల్లుగ వానినపుడు 102

కుంభకర్ణు(డు దానిని గ్రుద్దు గ్రుద్ది
పిండి పిండగ(జేసెను మొండరియయి
తక్కు వానరయూథపుల్ దనుజనేత
సోదరుని మీ(ది కే(గి రస్తోకముగను 103

అఱచేతులతో చఱచిరి
చరణమ్ముల(దన్నినారు సాహసి ఋషభు
న్నిఱియు( గౌ(గిటనొక్కగ
ధరపై(బడెవా(డు రక్తధారల తోడన్ 104

శరభుని(గ్రుద్దెను-నీలుని
కఱకఱి మోకాటిపోటు కరముగ(బొడిచెన్
చఱచె గవాక్షుని కరముల,
మరగి తాపు తన్నెగంధమాదను బలిమిన్ 105

తక్కిన ప్లవగులు పర్వత
మెక్కినటుల యెఱచి(దిండి నెక్కెరి కసితో
రక్కరి, కొఱికిరి, గ్రుద్దిరి
ప్రక్కలలో(బొడిచినారు ప్రతికారముతో 106

వానరతతితో దైత్యుఁడు
కానిపించె వృక్షసహితక్ష్మాధర మటులన్
సూనరి గరుడుఁడు పాముల
మానుగఁదినునట్లు మ్రింగె మనుజాశనుఁడున్ 107

కుంభకర్ణుఁడు మ్రింగిన కోఁతులెల్ల
శ్రవణముల నుండి ముక్కురంధ్రముల నుండి
వెలికిరాఁగ పిశాచము వలె దనుజుఁడు
నృత్యమాడుచు హరుల వధించెఁబెలుచ 108

రక్తమోడికల్ కట్టె సంగ్రామ సీమ
అశని పట్టిన దేవేంద్రుడనటుల కాల
పాశహస్తుఁడు జమురీతి వనులఁగాల్చు
పెద్ద దావాగ్నివోలెఁ గన్పించెనతఁడు 109

ప్లవగులు గోలపెట్టుచు నృపాలుఁడు రాఘవు నాశ్రయించుచున్
రవులుచు నొక్కశైలశిఖరమ్మును జేకొని సింహనాదమున్
మివులనొనర్చి యంగదుఁడు మిట్టుచు మీఁదికి మీఁదికేఁగి దా
నవు ప్రహరించె రాక్షసుల నాశముఁజేసెమహోద్ధతిన్ ద్వరన్ 110

అందుపై కుంభకర్ణుఁడు నంగదుపయి
విసర శూలము దాని తప్పించుకొనుచు
నసురు గుండెలపై మోదె నసహనుఁడుగ
దానితో మూర్ఛ మునిఁగెను దానవుండు 111

కొంతవడి కాశరుడు తేఱుకొనుచు వామ
ముష్టి నొక పోటు పొడవగ మూర్ఛపోయె
నంగదుఁడు-దశాస్య సహజుఁ డర్కజుపయి
కరిగె శూలముఁజేకొని యలుక మీఱ 112

అంగదుఁడుపడి పోవగ నాగ్రహించి
రవిజుఁడొక పర్వతముఁబూని రగిలి పలికె
"పెక్కు వానరులను మ్రింగివేసినావు
మెసవితివి పెక్కు మందిని మిట్టి పడుచు 113

క్షుద్ర వానరులను వీడి శూరుఁడవుగ
రమ్ము నాపైకి-యిదిగో పర్వతము విసరు
చుంటి లే-కాచుకొనవలె దంటవైన
ననుచుఁబ్రకటింప నవ్వి మాఱాడె నతఁడు 114

అజుని మనుమఁడవగుదును-అక్షరజుని
తనయుఁడవు నీవు చాల ప్రతాపశాలి
వేలయిటు ప్రేలుచుంటివి యిత్వరుఁడుగ
ననగ విసరెను రవిజుఁడాహార్యము వెస 115

గుఱికొని భానునందనుఁడు కోపముతో విసరంగ నా మహీ
ధరమును కుంభకర్ణునెడఁదన్ బిడుగుంబలె పోయి తాఁకగన్
పఱియలు వాఱె రాతిపయిపడ్డ విధమ్మున ముక్క ముక్కలై
వెఱచిరి వానరుల్ పెలుచ-విస్మయమందిరి యామినీచరుల్ 116

దనుజుఁడుఁదత్ప్రహారమునఁ దాపమునందుచు సూర్యపుత్రుపై
కినుకను శూలమున్ విసరె కేసరిసూనుఁడు దారిలోననే
ఘనునుగఁబట్టి జానువున ఘర్షణమందున వంచి త్రుంచగన్
పనివడివేయి బారువుల భారముఁగల్గిన దానిశక్తిమై 117

అది గమనించి కీశగణమార్చెను పెల్చన గంతువెట్టుచున్
గొదగొని మాతరిశ్వసుతు గొబ్బున నెంతయొ ప్రస్తుతించుచున్
పదపడి గౌరవించుచుఁ బ్రపత్తిని జూపిరి పూజ సల్పుచున్
పదిలుని-కుంభకర్ణుని ప్రభావము తగ్గగ మండె దిగ్గనన్ 118

మత్తుఁడొడలు మండి మలయపర్వతశిఖ
    రమ్మునూడఁబెఱికి రవిజుఁగొట్టె
ఆప్రహారమున నహస్కరతనయుఁడు
    స్మృతినిఁ గోలుపోయి స్థిరను బడెను 119

పెల్లునఁగొట్టగా దనుజవీరుఁడు భానుతనూజుడంత మూ
ర్ఛిల్లగ వాని నెత్తుకొని రేఁగుచు మూపున లంక కేఁగ రం
జిల్లిరి రాక్షసుల్ పరవశించిరి-మేడలనున్న యోషితల్
చల్లిరి లాజలున్, పువులు సత్కృతి సేయుచుఁగుంభకర్ణుపై 120

రవిజుఁడు మూర్ఛిల్ల రాక్షస వీరులు
    సింహనాదమ్ములఁ జేసిరపుడు
వాత్యమేషమునటు పౌలస్త్యుఁడర్కజు
    నెత్తుకొనుచు లంక కేఁగువేళ

సున్నతశిఖర సంయుతమేరు శైలము
　　వలెనొప్పె నాతఁడు-పరుగుఁదీసి
రగచరుల్ భయమున నాకసమందున
　　దివిజులబ్బురపడి దితిజుఁగాంచి
రంత దశముఖు సోదరుఁడాత్మ నెంచె
నిపుడు సుగ్రీవుని హరింప నిద్దిరాము
నను జు వానర సైన్యమునడఁచినటులె
యౌనటంచును గర్వితుఁడై పెలుచన　　121

కుంభకర్ణుఁడు సుగ్రీవుఁ గొంచుపోవ
భయమునందుచు వానరుల్ పరుగుతీయ
చూచి హనుమంతుఁడెంతయో గ్రుక్కి-తలఁచె
పట్టుబడిపోయె వానర వల్లభుడని　　122

ఇపుడు నేనేది మంచిదో, యేమి చేయ
వలెనొ యది చేయగా వలె పాలసువధి
యించి సుగ్రీవు నే విడిపించిన యెడ
ప్లవగు లానంద పడుదురు రంజిలుచును　　123

భానునందనుఁడు దేవతలు, నాగులు పట్టు
　　కొనినను విడిపించు కొనగలుగును
శిలలతోఁగొట్టి మూర్ఛిల్లిన కతమున
　　జరుగుచున్న దెదియు నెఱుగఁబోఁడు

అతఁడు తేఱుకొనిన నతనికి ప్లవగుల
కును మేలు జరుగు నకుంఠితముగ
కెలయుచు నేను సుగ్రీవుని విడిపింప
నతనికి దుర్యశమబ్బు పైగ
నన్ను కోపించు దానితో నట్టువడును
భారమంత సుగ్రీవుని బలము మీఁద
నుంచి పరుగిడు కపులనేనుత్సహించి
ధైర్యమును గూర్చి వెనుకకు తరలఁజేతు 124

వ। లంకలో కుంభకర్ణునిఁజూచి రాక్షసులు, రాక్షసాంగనలతని నెంతయో మెచ్చుకొనుచు. 125

గౌరవమున్ బొనర్చుచు సుగంధ జలమ్ములఁజల్లి హారతుల్
కూరిమిపట్టి రాక్షసుల గొప్పగ నెంచుచుఁగుంభకర్ణునిన్
జీరుచు మేటి వీరునిగ-చేతన వచ్చి ప్లవంగనేతయున్
గేఱుచు గోళ్లతో చెవులు గిల్లి ననన్ దునియించెఁబేర్మిమై 126

కడుపు మీఁదనుఁ బ్రక్కలఁ గఱవఁనొచ్చి
రవిజుఁగుంభకర్ణుఁడు నేలరాయ నసుర
లతని మర్దించి రెంతయో-ఐనఁగూడ
కడకుఁదప్పించుకొని రాము కడతుఁజేరె 127

ఘ్రాణ కర్ణములన్ తునియగ రక్తఝరులు
నిండు భూధరముంబలె మెండుకొనుచు
కొాటికి రవిజుఁడు తప్పించుకొనుటఁ జూచి
కనలి రణభూమి కరిగె రాక్షసుఁడు మరల 128

అయ్యొ? ఆయుధంబొయెననుచుఁగినిసి
ముద్గరంబొండు చేకొని ముదలకింప
కుంభకర్ణుఁడు చని ప్లవగుల ననురలఁ
దినగ మొదలిడె నెవరొ గుర్తించలేక 129

అద్ది గమనించి క్రుద్ధుఁడై యని నొనర్పఁ
బూనె సౌమిత్రి-పఱగించె వాని మేన
పెక్కు-శరముల-లక్ష్మణు విడిచి యసుర
రామచంద్రునిపైకేఁగె రభసవృత్తి 130

అనఘుండప్పుడు కుంభకర్ణుపయి రౌద్రాస్త్రమ్ము సంధించి వే
సెను వక్షమ్మున దానితో వెలువడెన్ జ్వాల్ గీలలుత్పన్నమై
దనుజుండాపయి వానర ప్రముఖులన్ ధార్ష్ట్యమ్ముతోఁజంపగాఁ
దునిమెన్ రాక్షసు చేతిలోని గదనుద్భాసిల్లుచున్ రాముఁడున్ 131

అతని చేతను గల కొన్ని యాయుధములు
దానితోపాటు పడెను క్రిందకు నిరాయు
ధుండగుచుఁ గాళ్ల చేతుల తోడ పెనఁగ
సాగె కుంభకర్ణుండును సమరభూమి 132

క్రోధఘూర్ణితుఁడై ప్లవగుల, దనుజుల
మెసవ మొదలిడ నసురుఁడమేయముగను
చేతులన్ దాల్చి భూధర శిఖరమొండు
విసరె రామచంద్రునిపయి విప్రియముగ 133

రాముఁడా పర్వతమ్ము నభ్రమున నుండ
సప్తబాణమ్ములేసి యాశ్చర్యముగను
కుంభకర్ణునిఁబడగొట్టె కుతలముపయి
లక్ష్మణుఁడు నిగదించెను రామునికిటు 134

రక్తగంధము వల్ల రావణానుజుఁడిప్డు
దనుజ వానరుల భేదం బెఱుఁగక
దొరకిన వారిని దునుమాడు చుండెను
కాఁబట్టి యిప్పుడు కపులువీని
పైకెక్క మంచిది-వానరులీతని
కదలకుండగఁ జేయఁగలిగిన యెడ
మఱియు మంచిది వీఁడు మహిపైని పడిపోవ
రక్షణ కలుగును ప్లవగులకును
అద్ది వినుటయె తడవుగ నద్రిచరులు
కిచకిచల తోడ వేగనెక్కిరి దనుజుని
పైని-ఏనుగు మావటి వాని నెటు వి
దల్చునోయట్లె వారి విదల్చె నసుర 135

వ॥ అపుడు కుంభకర్ణునితో రాముఁడిట్లనెను. 136

ఆ దిక్కునకేఁగక మఱి
నా దిక్కున కరుగుదెమ్ము నక్తంచర ! పో
రాదు నను విడిచి ముందుకు
వాదాడకు నిన్నుఁదునుమ వాంఛింతు సుమీ ! 137

రావణానుజ ! కుంభకర్ణా ! వెఱవకు
రమ్ము ! నేసిద్ధముగ నుంటి రణమొనర్ప
నేనె రాముఁడ ! క్షణములో నిన్నుఁజంపు
వాఁడనని పల్క నాతఁడు ఫక్కున నగె 138

వీఁడు దుర్మాత్ముఁ డెంతగనో వీని వధింతును నేను వెంటనే
చూడుము లక్ష్మణా ! యనుచు సొంపుగ కార్ముక హస్తుఁడై వెసన్
వాఁడి శరమ్ములందొడిఁగి వైరిని గాంచుచు పల్కె నిట్టులన్
వీడగ సిద్ధమై మహిత విక్రమమున్ వెలయించు బుద్ధితో 139

వ॥ అపుడు కుంభకర్ణుడు రామునికిట్లనెను 140

నేను కుంభకర్ణుండను కాని ఖరుఁడఁ
గాను, మారీచుఁడను గాను వానరేశుఁ
డైన వాలిని సహితముగాను మఱి వి
రాధుఁడనుగాను తెలియుమో రామచంద్ర ! 141

ఇదిగో! చూడుము నేను ముద్గరముతో నెంతెంత హంవీరులన్
తుదముట్టించితి చండ విక్రమముతో దుర్ధర్షుఁడన్ బోరులన్
ప్రిదులన్ నాసిక శ్రోత్రముల్ వనచయేలేశముల్ లేదు నిన్
వదలన్ మ్రింగెద నాకు నీ బలము చూపన్ మెత్తునిక్ష్వాకుఁడా! 142

అనరాముండును గుంభకర్ణుపయి ఘోరాస్త్రమ్ములన్ మున్ను వా
లిని జక్కాడిన, సప్తతాళములఁదూలింపంగఁదోడ్పడ్డ వా
నిని ప్రాఖర్యముతో ప్రయోగచణుఁడై నిర్మూలముం జేయ పై
చెను కానీ దనుజుండు జంకకయె నిల్చెన్ మందరాద్రింబలె 143

పౌలస్త్యుండొక ముద్గరమ్ము గొనుచున్ భగ్నమ్ముఁ గావించెనా
కోలల్ సర్వము వానర ప్రముఖులన్ గూలార్పగా దానితో
నోలిన్ రాఘవుఁడల్కతో విడిచె వాయువ్యాస్త్రమున్ వానిపై
కూలెన్ సవ్యకరమ్ము ముద్గరముతో కుట్టొకముం జేసినన్ 144

తునిగినచేయి ముద్గరముతో పడిపోవగ నద్దిపైబడన్
వనచరలెందఱో నలిగి పచ్చడియైరి తదీయభారమున్
ఘనమయి పాఱిపోవగను ఘాతము నందగఁదక్కు వానరుల్
కనుగొనసాగి రచ్చెరువుగా నరరాక్షస ద్వంద్వయుద్ధమున్ 145

కుంభకర్ణుఁడు కుడిచేయిఁగోలుపోయి
వికటముగ పెడబొబ్బలు పెట్టసాగె
నాతఁతంతట రెండవ చేతితోడ
పెఱికి యొకచెట్టు రాముపై విసరఁబూనె 146

అనఘుండంతట కుంభకర్ణుపయి నైంద్రాస్త్ర ప్రయోగమ్మునన్
దునిమెన్ రెండవ హస్తమున్ సహితమున్ దోర్దండదోరమ్ముగా
దనుజుండార్చెను భీకరమ్ముగను బాధాతప్తుండై చేతి క్రిం
దను సాలమ్ములు బండరాళ్లు ప్లవగుల్ నాశమ్ముగా పప్పడై 147

కనుగొని యర్ధచంద్ర విశిఖమ్ముల రెంటను కాళ్లు రెండిటిన్
దునిమెను రాఘవుండు బలితుండుగనప్పుడు గొప్పరావ మ
య్యెను గిరికందరమ్ములు ధ్వనించెను సాగరమున్ గలంగె భో
దన ధరపిక్కటిల్లె మఱి రోదసి పెల్లుగ బొబ్బరింపఁగా 148

పాదముల్ హస్తముల్ పరిపంధి ఖండింప
వదనమ్ముఁదెఱచుక బైలుదేఱ
రాహువుకై వడి-రాముఁడు వాని వ
క్త్రమునిండ బాణముల్ క్రమగతిని
గుప్పించె దానితో కుంభకర్ణుని నోరు
తిరుగక వెనువెంట తెలివి తప్ప
మఱియొక బాణము మహితుఁడు సంధించి
బ్రహ్మదండమునకు పాటి బ్రభున్న
దీప్తి గలదియు జమునకు దీటువచ్చు
ప్రదరమయ్యది-వృత్తుని వాసవుండు
సంహరించిన రీతిగ సరసిజాక్షు
డసురు శిరమును నఱకె వియాతుఁడగుచు 149

శరము దెబ్బను పౌలస్త్యు శిరమువ్యోమ
మునకు నెగురుచు శశిబింబమువలె మెఱసి
కుతులమున బడి ప్రహరుల గోపురముల
కుట్టిమమ్ముల లంకలోఁ గూల్చివైచె 150

కుంభకర్ణుని మొండెము కొండవిఱిగి
పడిన రీతిగ పడిపోయె వసుధ సగము
సంద్రమునఁదక్కు- సగమును-చచ్చిరపుడు
వానరులు, వానరులు కోటి దానిక్రింద 151

కాలు సేతుల యుద్ధరంగమ్ము నిండె
పురము వాకిలిఁగప్పెను శిరము ప్రిదిలి
ముద్దయై పోయె రఘునాథములుకులకును
సమసిపోయెను రాము తేజమ్ము కతన 152

అమరగంధర్వనాగగుహ్యకులు కుంభ
కర్ణు మృతికి నందింప రాక్షసులడలిరి
రాహువదన విముక్తుఁడౌ రవి విధముగ
రామవిభుఁడు ప్రకాశించె రమ్యముగను 153

వానరులు సంతసించుచుఁ బ్రస్తుతిలచి
పూజసేసిరి రాముని-పౌలసుదిండు
లరిగి దశముఖునకుఁదెల్పిరనుజు మృతివి
షయము గగ్గోలుపడుచు దృష్టము సకలము 154

వ. అది విని దశగ్రీవుఁడు మూర్ఛిల్లఁ బినతండ్రి మృతివార్తవిని నరాంతకుఁడు, త్రిశిరుఁడు, అతికాయుఁడు మిక్కిలి దుఃఖించిరి. సోదరుఁడు గతించినందుకు మహోదరుఁడు, మహాపార్శ్వుఁడు కూడ శోకాక్రాంతులైరి. తరువాత చాల కష్టముమీఁద తేఱుకొని దశాననుఁడు కుంభకర్ణునిఁ దలఁచుకొని యిట్లు విలపించెను. 155

వీరాగ్రేసర ! శత్రుదర్పహర ! నీవే నన్ను రక్షించు స
చ్ఛూరుండంచుఁ దలంచుచుండ నిటులన్ చోద్యమ్ముగా రాముచే
ఘోరంబౌ మరణమ్ము నొందితివె గగ్గోల్ పుట్టెగా లంకలో
నేరిం జూచుచు నేను నిల్వగలనోయీ కుంభకర్ణా ! ధరన్ 156

నిన్ను సురాసురుల్ గెలువ నేరకపోయిరి-వజ్రి వజ్రమున్
మున్ను భవచ్ఛరీరమును ముట్టుచు దండిగ మొక్కవోయె, నీ
కెన్నడుగెల్పె కాని మఱియేరు జయింపగలేదు నిన్ను, నా
పెన్నిధిగా దలంతును-తపించుచునుంటిని నీవు లేమిచే 157

ఇది యనుకోని దుర్ఘటనయే ప్రియసోదర ! నిన్నుఁబట్టి, యే
బెదరు నెఱుంగకే దనుజవీరులు జీవితమున్ గమింపగా
కుదిరెనుకాదె నిన్ను నొక కొండగ, నండగనెంచు దానవుల్
కొదుకుపడంగనయ్యె నినుఁగోల్పడి యిప్పుడు కుంభకర్ణుఁడా ! 158

ననువీడి కుంభకర్ణా ! పోయినాఁడవె
నామనఃపీడను నాశనమ్ముఁ
గావింపకయె శత్రుగణముల పీడించి
రఘునాథుశరముల గ్రుందినావె ?

నా కుడిభుజమైన నీకు దుర్మరణమా !
ఇంక నేనుండిన నేమి ఫలము ?
దేవతల్ ఋషులును దివినుండి నీప్రథ
నమున కానంద ధ్వానములొనర్తు

రత్రిచరులు పురివాకిళ్ళ నాక్రమించు
కొనుచు నుండిరికాబోలు ఘనతమీఱ
రాజ్యమెందులకిఁకనాకు రమణి సీత
మాత్రమెందుకు తమ్ముఁడు మరణమొంద

నాతమ్మున్ వధియించినట్టి మనుజున్ నాశమ్ముఁగావింపకే
భీతిన్ బొందుచు జీవితమ్ముగడపన్ విద్వేషమేయౌను సూ !
ఆతండెక్కడ నుండెనో యచటికే న్యాయ్యమ్ముగాఁబోదు నా
చేతంబిప్పుడు మేల్కొనెన్ సహజునే చేరంగ వాంఛించెదన్

నీవు పోయిన నే నింద్రు నింక నెటు జ
యింపఁగలుగుదు పినతమ్ముఁడెంత చెప్పి
నను వినకపోతి వింటిని నయవచనము
లిపుడు సిగ్గుచుండె నేనేమి సేతు !

ధార్మికుండైన నా పినతమ్మ నేను
వెడల నడచితిఁబురినుండి యెదురువచ్చె
నిద్దిదానికి ఫలితమే యేమనెద న
టంచు వగచుచు మూర్ఛిల్లె నసురవిభుఁడు

తమ్ముఁడు కుంభకర్ణుని హితమ్మను మంత్రి ప్రహస్తు మాటకున్
సమ్మతిఁజూపి జానకి నొసంగిన రాముని కిన్నిపాట్లు రా
విమ్మయి తెల్వి మాలి వెడలించ విభీషణువాఁడు రాముపా
దమ్ముల నాశ్రయించె బహుధావిలపింపగనయ్యె నేనిటుల్ 163

అయ్యో! తమ్ముఁడ! కుంభకర్ణ! రణమందారాముని ర్జింపగా
నెయ్యంబారగ లేపిపంపితిని కానీ నీవు శ్రీరాముచే
కయ్యంబందున ప్రాణముల్ విడిచితే కానున్నదేమో యిఁకన్
తియ్యంబుల్ విని ప్రాలుమాలితినికాదే! స్వర్గముంజొచ్చితే 164

వ. రావణుఁడటుల దుఃఖించుచుండ నాతని కుమారుఁడగు త్రిశిరుఁడు తండ్రితో నిట్లనెను. 165

జనక! మాపినతండ్రి సాహసి బలవంతుఁ
డయ్యును మరణించెనది నిజమ్మె
చాలుదువీవు ముజ్జగముల కిట్టుల
ప్రాకృతువలె దుఃఖపడుట మేల?
పరమేష్ఠినీకిచ్చె బలమును, గవచము
ధనువు, బాణములు, రథమ్ముఁగూడ
అస్త్రమ్ములేకుండ నమృతాంధసులఁబెక్కు-
మారులు రణముల జయముఁగొనవె?

సర్వశస్త్రాస్త్రములఁబూని సమరమందు
రేఁగ రఘురాముఁడునుగూడ లేకపోవు
నీవిచట నిశ్చలమ్ముగ నిలువ నేన
ఏపుగా శత్రువుల రూపుమాపువాఁడ 166

వ॥ త్రిశిరుని మాటవిని రావణుఁడు తాను చచ్చి మరల బ్రదికినటు భావించెను. దేవాంతకుఁడు, నరాంతకుఁడు, అతికాయుఁడు నేను నేననుచు గర్జించుచు యుద్ధమునకు సిద్ధపడిరి. వీరందఱు రావణుని పుత్రులు. అందఱు నాకాశయానము చేయగలరు. అందఱు గొప్ప గొప్ప మాయలు చేయగలరు. అదివఱకు దేవతలను జయించిన వారు. అందఱు దుర్జయులు. ఎప్పుడు పరాజయము నెఱుఁగనివారు. సకల శస్త్రాస్త్రప్రవీణులు. విజ్ఞాన వేత్తలు. వరములఁబడసినవారు. రావణుఁడు వారిని కౌఁగిలించి, భూషణములతో నలంకరించి, ఆశీర్వదించి తన పుత్రుల రక్షణకై మహావీరులైన తన తమ్ములు మహోదరుని, మహాపార్శ్వునిఁగూడ పంపెను. ఏనుగులవంటి యామహావీరు లందఱు రావణునకు ప్రదక్షిణ నమస్కారము లాచరించి బయలుదేఱిరి. మహోదరుఁడు నీల జీమూతవిభమగు సుదర్శన సామజము పైని వివిధాయుధములతోను, త్రిశిరుఁడు మహాశ్వసంయోజితమగు రథము పైని, తన మూడు శిరస్సులకు మూడు కిరీటములు ధరించి మూడు శిఖరములుకల హిమాద్రివలె నుండెను. నరాంతకుఁడు మనోజవముకల యశ్వముపై ప్రాసము, శక్తి ధరించెను. దేవాంతకుఁడు వజ్రములు పొదిగిన పరిఘతో మహాపార్శ్వుఁడు గదతో రథము నారోహించిరి. వారివెంట వివిధవాహనములపై లెక్కలేనంతమంది పదాతులుకూడ బైలు దేఱిరి. 167

రాజపుత్రుల వెంబడి రథములందు
వారువమ్ములమీఁదను వారణముల
పైని లెక్కఁకుమించిన దానవయువ
లేఁగిరా యోధనమునకు వీఁగిపెలుచ 168

శత్రువులఁ జంపనైనను చంపెదమని
కాని యెడలను మరణింపఁగలమటంచు
నొక్క స్థిరనిశ్చయముతోడ నురవడించి
తరలిపోయిరి చెలఁగి యుద్ధమ్మునర్ప 169

కడు పరాక్రమవంతులు గర్వితులుగ
సింహనాదముల్ సలిపి గర్జించి యుద్ధ
దుర్మదులు బైలుదేఱిరి దురమొనర్ప
శత్రువులఁదూలనాడుచు సరకుగొనక 170

వారు వెడలుచు శస్త్రాస్త్రప్రతతితోడ
సిద్ధముగవచ్చు రాక్షససేనఁగాంచి
రద్రిచరు లాయుధములతో నసురయోధ
వితతిఁగాంచుచు చెలఁగిరి విక్రమమున 171

వానరులు రాక్షసులు పరవళ్లు త్రొక్కు
కొనుచు పెడబొబ్బలన్ బెట్టి కుపితులగుచు
తలపడిరి యుద్ధభూమిలో తారసిల్లి
కసిపెరిగి యిరువాగు ప్రగల్భులగుచు 172

రాక్షసులు ప్రయోగించెడి ప్రదరహతులఁ
దాళుకొనుచు ప్లవంగులు ధరణిజములు
పెద్ద పాషాణములఁబూని బెట్టిదముగ
నాశరులఁ బ్రహరించుచు క్లేశపఱుప 173

వానరులఁగొంతమంది యభ్రమమున కెగుర,
కుప్పిగంతులు వైచిరి కొంతమంది
కుతలమున నిలుచుండియే కొంతమంది
సమర మొనరించినారు రాక్షసుల తోడ 174

కొంతమంది ప్లవంగులు కుంజరముల
పైని, కొందఱు రథికులపైని, కొంత
మంది యాశ్విక యోధుల మార్కొనంగ
జరిగె సంకుల సమరము జయపరీప్స 175

కాల్బలములోన కొందఱు కపులు కలిసి
దితిజవీరుల పెల్లు మర్దింప శిలల
తోడ, ప్రహరింప ముష్టులతో పొడవగ
రక్తమును గ్రక్కుకొనినారు రాక్షసతతి 176

ఉభయ బలములు తలపడి యుద్యమించి
సమర మొనరింప రక్తమాంసముల తోడ
విఱిగి పోయిన నాయుధవితతి తోడ
నిండిపోయెను రణభూమి నెట్టుకొనుచు 177

ఆశరుల నాశరుల తోడ నద్రిచరులు
కొట్టసాగిరి-రాక్షసుల్ కొంచెపడక
వానరుల వానరులతోడ వ్రయ్యఁజేసి
రూహకందని రీతిగా నురవడింప 178

రాక్షసుల కవచమ్ములు వ్రచ్చి పాలు
కారు వృక్షమ్ములట్టుల కానఁబడుచు
రక్తము స్రవించుచుండ పోరాడినారు
పొనుగుపడి శత్రువుల ధాటి యినుమడింప 179

రణములో వానరుల్ రథముఁజేకొని స్యంద
  నము మీఁద వైచుచు నాశనమ్ము
చేసిరి-హస్తినిఁజేకొని హస్తిని
  ప్రహరించి రశ్వముఁబట్టుకొనుచు
నశ్వముం గొట్టిరి యమిత రోషమ్ముతో
  భీషణ సమరము బెగ్గలించు
రీతిఁగావించిరి రెచ్చుచు ఘాతింప
  రాక్షసుల్ క్షీణించి ప్లవగ బలము
ద్విగుణమగుటను చూచి యాదిత్య నాగ
యక్ష గంధర్వ గణము వియత్తునందు
హర్షమాణులై జయవెట్టి రద్రిచరుల
పౌరుష బలమ్ము లగ్గించి ఖండనమున 180

వ। అంతట 181

వాయువేగముఁగల్గు వార్వమ్ము పైని
నంతక సమానుఁడైన నరాంతకుండు
ప్రాసమును, శక్తి ధరియించి ప్లవగసేన
లో ప్రవేశించె లయకాల రుద్రుఁడటుల 182

ఏడువందల ప్లవగుల నేపుమాపె
నొక్క క్షణమున ద్రఢిమతో నూర్జితుఁడయి
వాఁడు చనుత్రోవ ప్లవగ శవముల తోడ
నింపుచున్ బోవసాగె క్షీణింప పృతన 183

వానరులు మీఁద పడుటకుఁబూనుకొనెడి
తఱికి సంహార కాండయే జరుగుచుండె
వారు విసరిన ద్రుమముల వాఁడడిదము
తోడ ఖండించుచుండె నితోధికముగ 184

వానకాలపు ఝంఝగా వాఁడు సమర
భూమినంతటఁ దిరుగుచుఁ బోరుచుండ
పాఱిపోలేక నిలువగఁ బాలుపోక
పైకెగరలేక ప్లవగులు బాధపడిరి 185

మునుకుంభకర్ణు ఘాటినిఁ
గనుగొని మూర్ఛిల్లి లేచి కపులు భయం
బునఁబాఱుచు సుగ్రీవుని
వెనుకకు జననరాంతకుఁడు వెంటందగులన్ 186

అంతట భానునందనుఁడు నంగదుఁగాంచి వచించె నిట్లు "నీ
వంతయుఁజూచుచుంటివికదా మనసైన్యము పర్వతీయ క్రౌ
వ్వంతయు మాపి రాక్షసుని నంతము సేయు" మటంచుఁజెప్పుచు
న్నంతటిలో నరాంతకుఁడు నయ్యెడకున్ జనుదెంచె నార్చుచున్ 187

అంగదుఁడాతనిన్ గని నరాంతక ! క్షుద్రులతోఁబనేమి నీ
చెంగట నిల్చితిన్ గనుక చేయగఁబూనినదేదొ చేయుమా !
వెంగలిఁగాను-నీ బలము వీసరపోవును చూడు నాయురం
బుంగవియంగఁబ్రాసమునుబూని ప్రహారము చేయఁగోరెదన్ 188

రేఁగుచు నట్టహాసమొనరించుచు బ్రాసముతోడ నంగదున్
వీఁగుచు పెన్నురమ్ముపయి బిట్టుగపైసగ నద్దితున్కలై
మాఁగుడు వాఁడి క్షోణిఁబడమర్కటవీరుఁడు గేలిసేయుచున్
కాఁగుచు ముష్టితో పిడుగుకై వడి మొత్తెనిశాటు వక్షమున్ 189

వాజిఁగూల్చెను ముందుగ వాలిసుతుఁడు
కరతలము తోడ పెల్లుగ చఱచి కడిమి
పొడువ గుండెల పైనప్డు పొలసుదిండి
అంగదునిమొత్తె శిరముపై నాగ్రహముగ 190

అంగదుఁడు తేఱి యాశరునంతకంటె
గట్టిగా ప్రహరించె వక్షమున ముష్టి
రక్తమును గ్రక్కుకొంచు నరాంతకుండు
ధరణిపైఁగూలె విలవిల తన్నుకొనుచు 191

అవని వానరవీరులు, నంతరిక్ష
మందు దేవజాతులును నానందనినద
ముల నొనర్చిరి దనుజుఁడు పుడమిఁగూల
"చాంగు భళ!" యంచు ప్లవగుఁడు చంపనపుడు 192

అటు నరాంతకుఁ డవనిపై పెటిలి కూల
సిద్ధచారణుల్ ప్లవగుల చెలఁగి పొగడ
ఆ నిశాచర శోకముల్ ఘూనఘోంత
రాళమున నిండిపోయె సంరంభమెలమి 193

పరిఘఁద్రిప్పుచు వచ్చె దేవాంతకుండు,
తేరిపైనేఁగు దెంచెను త్రిశిరుఁడు, కరి
పయి మహోదరుఁడేతెంచె వాని మరణ
వార్త వినుచుఁబౌలస్త్యులు వ్రాలిరచట 194

వాలి తనయుఁడు విసరె దేవాంతకు పయి
పెఱికి యొక భూరుహమ్మును. విసర నడుమ
తుత్తుమురుఁ జేసెఁద్రిశిరుఁ డాద్రుమమ్ము వివిధ
శరములను బ్రయోగించి విచక్షణుఁడుగ 195

తారేయుండును గోపగించుచును విస్తారమ్ముగా వృక్షముల్
మూరింబోయి శిలోచ్ఛయమ్ముఁగొనుచున్ ముగ్గాయ్య దేవాంతకున్
దౌరాత్మ్యమ్మును బాప సిద్ధపడి ప్రస్తావించి వేయన్, గ్రుధన్
వారింపన్ జతనమ్మొనర్చె పరిఘున్ వ్యయ్యల్‌జేసి చూర్ణమ్ముగా 196

సునిశిత బాణముల్ పఱపి సూడడఁగింప మహోదరుండు కో
మ్మనఁగపివీరు వక్షమునమోదగఁ దారసుతుండు క్రుద్ధుఁడై
చెనఁకఁగ నుద్యమించి యఱచేత ప్రహారము సేయ నేనుగున్
కనులు తొలంగి యూడిపడగా పెనుగేకను నేలవ్రాలగా 179

ఆ దేవాంతకుఁడంగదున్ బరిఘతో నత్యంత ఘోరమ్ముగా
మోదన్ యత్నము సేయుచున్ వెనుకకుంబోవంగఁ దారేయుఁడున్
ఆ దంతావళ దంతముల్ పెఱుకుచున్ నయ్యాతుధానున్ వెసన్
భేదింపన్ రుధిరమ్ముఁగ్రక్కుకొని నిర్వీర్యుండుగా నిల్వగన్ 198

అంతలో నిల్వరించుక యాశరుండు
పరిఘతో నంగదునిమోది బాధపెట్టె
ఆ ప్రహారము తోడ నాయంగదుండు
మోఁకటిలి తొ త్తరువాత కూఁకపెట్టె 199

అంగదుఁడు లేచుచుండగ నతనిమీద
మూఁడు శరముల త్రిశిరుఁడు పూన్కి విడిచి
ఫాలమునఁ బ్రహరించెను - వారు ముగురు
పెలుచఁగపివీరుపై విజృంభించి రొకట 200

ముర్వురు రాక్షసులంగదుఁ
గవ్వించుచు నుండఁగాంచి గాడ్పుచూలియున్,
విర్వచ్చముగా నీలుఁడు
రువ్విరి పాదపములు, శిలలు క్రోధాళువులై 201

భూధర శిఖరముఁబూని నీలుఁడుఁద్రిశి
 రుని మీఁద విసరగ రుష్టుఁడగుచు
ఖండించె నతఁడు మార్గమునందె నద్దాని,
 పరిఘను విసరె దేవాంతకుండు
పవమానసూనునిపై భగ్నమొనరించి
 ముష్టితో నెత్తిపై మొట్టి సింహ
నాదముఁజేసె, కీనాశుని పండ్లూడి
 కనుగ్రుడ్లు చితికి నాల్కయును వ్రేల
ప్రాణములు వీడి యవనిపై పడెనతండు
త్రిశిరుఁడును శరవర్షము, గురిసె నీలు
పై మహోదరుఁడింకొక సామజమున
వచ్చి గుప్పించె నీలుపై బాణములను 202

దానితో నీలుఁడెంతయో స్తబ్ధుఁడగుచు
నిలిచి యంతలో తేఱి యచలశిఖరము
పెఱికి రువ్వ మహోదరు శిరము పగిలి
కూలి యాతఁడు ప్రాణముఁగోలుపోయె 203

పినతండ్రి చావుఁగనుగొని
హనుమంతునిపైనిఁ ద్రిశిరుఁడస్త్రము లెన్నో
మునుకువతోఁ బఱగింపఁగ
దనుజాస్త్రములన్ని హనుమతప్పించుకొనెన్ 204

శైలశిఖరముఁ జేఁబూని శ్వసనసూతి
త్రిశిరుపై వైవ దానినిఁ ద్రుంచె నతఁడు
చెట్టుపై చెట్టు చొప్పున చెలఁగి విసర
దనుజుఁడన్నియు ఖండించె ద్రఢిమతోడ 205

విశిఖవర్షమును తప్పించుకొనుచు గాడ్పు
చూలి త్రిశిరుని పైలీల చెట్టు
పై చెట్టు చొప్పున ప్రతిభతో విసరెను
తెరపిలేకుండ వితీర్ణముగను
ఆ వృక్షముల నెల్ల నసురుఁడు నఱకుచు
సింహనాదముఁ జేసె చెలఁగి - హనుమ
ఒక గంతువైచుచు నొక్కచఱపున త్రి
శిరువాజులనుఁ జంపె వెరవుతోడ

ఆదశాస్యుని తనయుఁడు నమితకోపి
యగుచు శక్తిఁ బ్రయోగించె హనుమ మీఁద
ఉల్కవలె వచ్చు నాశక్తి నొడిసి పట్టి
పరుషముగ దాని పెళ్లున విఱచె నతఁడు 206

వానరులొక్కపెట్టునను వాయుతనూజునిశక్తి మెచ్చుచున్
ఘూనభముల్ ధ్వనింపగను ఘోరున మేఘములట్లు గర్జనన్
బూనిక సేయగా త్రిశిరపుణ్యజనుండు కృపాణధారియై
క్షోణిని నిల్చి పావనిని గుండెలపై ప్రహరించెఁ బెల్చనన్ 207

అందుకు ప్రతిగా హనుమయు
డెందముపైఁగొట్టఁ ద్రిశిరు డీల్పడి యతఁడున్
దందడి కన్నులు తిరుగగ
వందురుచున్ గత్తివీడి వసుమతిఁబడియెన్ 208

ఆతని చేతికత్తిగొని యంజనసూనుఁడు రాక్షసాధముల్
భీతినిపొంద బొబ్బరిలె వీసరపోవగ నంతలోననే
నాతఁడు లేచుచున్ బొడువ హన్మను ముష్టిని, రుష్టుఁడై యతం
డాతని మూఁడు శీర్షముల నాకరవాలము తోడఁద్రుంచగా 209

మూడు తలలు నప్పట్టున
మూఁడు తారలటులఁద్రుంగి భూస్థలిఁబడగా
వేడుకపడి ప్లవగులు గొని
యాడిరి హనుమంతు శక్తి నగ్గించి వెసన్ 210

త్రిశిరుఁజంపగ వానరుల్ క్రేళ్లుఱుకుచు
సింహనాదముల్ సలుపగ స్థిర యదరెను
రాక్షసులు పాఱిపోయిరి రమణ ముగురు
రావణతనూజు, లనుజుఁడు మ్రందనపుడు 211

అది చూచి మహాపార్శ్వుఁడు
గదతో వానరులపైనిఁ గవియుచు ఋషభున్
మదమడపగఁ బ్రహరింపఁగ
నదవదపడి నెత్రుఁగ్రక్కె నాతఁడుపెలుచన్ 212

అంతలోఁదేఱుకొనుచు నయ్యద్రిచరుఁడు
తోఁకఁద్రొక్కిన త్రాఁచైయై తురఁగలించి
ఆ మహాపార్శ్వగదలాగి యతని శిరము
పైని మోదగ ఘటమటు పగిలెనదియు 213

కుతలమునఁ బడిపోయెను గ్రుడ్లురాలి
తన్నుకొనుచును విలవిల దానవుండు
నోరుఁదెఱచుక పడిపోయె ధారుణిపయి
రజనిచరసేన పరువెత్తె లంకదెసగ 214

సేన సర్వమునప్పుడు చెల్లచెదరు
కాఁగ సహజ పితృవ్యులు క్షణనమొంద
చూచి యతికాయుఁడు సహస్ర సూర్యబింబ
చిత్రరథమెక్కి తనపేరు చెప్పుకొనుచు
నారిమ్రోగించుకొనుచు పైనమ్మొనర్చె 215

క్ష్వేళయొనరించుచును తనసేనతోడ
నామవిశ్రావమును మఱి నారియులివు
నద్రిచరులు భీతిల్లుచు నతనిఁజూచి
యనుకొనిరి కుంభకర్ణుడే యనిమనమున 216

ప్లవగులంత భయార్తులై పాఱిపోయి
రాముశరణమ్ము వేఁడగ రథముపైని
సంగరాంగణమందు విస్రంభసరణి
వచ్చునతికాయు గమనించి ముచ్చటుపడి 217

సంశయమ్మున విభీషణుఁగాంచి ప్రశ్నించె
పూజ్య విభీషణా ! భూధరమటు
సాహస్రవారువసంయోజితంబౌచు
కోటిసూర్యప్రభల్ కూర్చు మేటి
స్యందనమ్మున వచ్చు చాపియెవ్వఁడు వాని
చేతిలో కార్ముకశ్రేష్ఠముండె
నల్వురు సూతులున్నారు రథమ్మున
నందులో నిక్షిప్తమయ్యెనెన్నొ
బాణములుఁదూణములు, భిండి వాలములును
పరశువులుఁగరవాలముల్ ప్రాసములును
కాంచనాంగద ధారియై కదలివచ్చు
నతఁడు శిఖరములున్న హిమాద్రివోలె 218

కుండలమ్ముల కాంతితోఁగూడి శిరము
చంద్రబింబము కాంతికి సాటి వచ్చు
వానరులు వానిఁజూచుచు పఱచు చుండి
రితని వైనమునెఱిఁగింపవే మహాత్మ ! 219

అనఘునకున్ విభీషణుఁడు నంజలిపట్టి వచించె నీతఁడున్
తనయుఁడు పంక్తికంఠునకు-తాను చరించును వృద్ధసేవిగా
ఘనుఁడు రణమ్ములన్ గడు ప్రగల్భుఁడు, యుక్తులెఱుంగు ధాతచే
గొనుచు మహావరమ్ములను గూల్చెవిపక్షులఁబెక్కురన్ ప్రభూ ! 220

ధాన్యమాలిని యీతని తల్లి-కాచె
రాక్షసుల రక్షకుడుగ నరాతులైన
యక్షులను సంహరించెను దక్షతమెయి
శక్రుభిదురము స్తంభించె సాయకముల 221

వరుణు పాశము సహితము వ్యర్థపఱచె
దేవదానవ గణముల చావు రాద
టంచు వరమిచ్చె పరమేష్ఠి-అసురులందు
శ్రేష్ఠుఁడతికాయుఁడను పేర చెలఁగునితఁడు 222

కీశసైన్యము వీనిచే నాశనమ్ముఁ
గాక ముందె యాలోచించి ప్రాకటముగ
శ్రద్ధఁజూపుట మంచిది రామచంద్ర !
యనుచు నుండగ నతికాయుఁడటకు వచ్చె 223

వచ్చుట తడవుగా వానర వాహిని
లో ప్రవేశించుచు రూక్షితముగ
శింజినీధ్వానమ్ము సేయుచు నేతెంచు
నతికాయుఁబరికించి యంకిలిపడ
సిద్ధమై వనచరుల్ క్రుద్ధులై వృక్షముల్
పర్వత శిఖరముల్, బండరాళ్లు
విసిరిరాతనిపయి బిఱబిఱ పెలుచన
ఆశరుఁడన్నిటి నాగ్రహమున

నుగ్గు నూచముఁగావించె నూలుకొనుచు
నిశితబాణముల్ పఱపుచు భృశము ప్లవగ
వీరులందఱ నొప్పింప వారలేమి
చేయజాలక నిలిచిరి సిగ్గుపడుచు 224

అతికాయుఁడని నేయనట్టి యే సైనికుఁ
ప్రహరింపలేదు సంగ్రామ భూమి
పైగ నాతఁడు ధనుష్పాణియై రాముని
యెదుటికేఁగుచు పల్కె నివ్విధముగ
"శరచాపములఁబూని స్యందనమ్మన నిల్చి
సిద్ధమ్మగా నుంటి యుద్ధమునకు
రణ మొనర్పను నేను ప్రాకృతజనముల
తోడ యుద్ధోత్సాహ మేదఁ గలదొ
వాఁడు నాపైకి వచ్చిన నూడుకొనుచు
నాహవము నేతు వానితో'' ననుచు గర్వి
యై వచించెను-లక్ష్మణుఁడందుపైని
నారి మ్రోగించుకొనుచు బాణమ్ముఁదొడఁగె 225

ఆ ధనుష్టంకార మపురూపమై భూన
భోంతరాళమ్ముల బూరటిల్లి
కదలించె శైలముల్ కడలిని సైతము
రాక్షసులను భయభ్రాంతులుగను

సలుప రావణియు నాశ్చర్యముఁబొందెను
తొలుదొల్త-తరువాత దుడుకు హెచ్చ
సౌమిత్రిఁజూచి లక్ష్మణ నీవు చిన్నవు
విక్రమమ్మును జూపు బిగువులేదు

జమునిఁబోలిన నా తోడ సమరమేల ?
పొమ్ము ! నా బాణవేగము భూమి, నభము
హిమధరమ్మును గూడ సహింపలేవు
సుప్త ప్రళయాగ్ని మేల్కొల్పఁజూతువేల ? 226

ధనువు పడవైచి వెడలిపో ! ధరణిపైని
ప్రాణములఁగోలుపోకుము ఖండనమున
చిక్కదనమున్న పోరికి సిద్ధపడుము
క్షణములో నిన్నుఁబంపెద జమునికడకు 227

ఇవిగో ! నా బాణములుచూడు మెన్నొసారు
లరుల గర్వముఁబోకార్చె నాహవముల
ఇవి త్రిశూలముతో సాటి-ఈ విశిఖము
సర్పమై నీదు రక్తము చప్పరించు 228

అనుచు గద్దించి యతికాయుఁడమ్ముఁదొడఁగె
నతని మాటల, రుషను రామానుజుండు
"భూపణములతో నెటు గొప్పవాఁడవౌదు
మాటలెందుకు నెదుట లక్ష్మణుఁడు నిలువ 229

నే ధనుష్పాణినై నిలిచితి నీ ముందు
బలము చూపించి నీ పౌరుషమది
యేపాటిదో నాకుఁజూపించు పనిఁజేసి
శూరుఁడవైనచోఁ దేరిపైన
సకలాయుధమ్ములు సంతపడంగను
వచ్చితివిప్పుడు బాణములను
విసరి పరాక్రమవిభవమ్ముఁ దెలుపుము
తాళఫలమ్మును కాలమెటుల

రాల్చునో యట్లె నిశితశరమ్ము లేసి
ఎగురగొట్టెద నీ తల గగనమునకు
త్రావివైచు నీ మేని రక్తమ్ము చుల్కఁ
జేయకుము కుఱ్ఱవానిగా చింతిలుచును 230

ఏను బాలుఁడనైనను, వృద్ధునైన
నీకు మృత్యువుగా నెంచి నిలువుమయ్య
విష్ణు వతిబాల్యమందుఁద్రివిక్రముఁడయి
ఆక్రమించె లోకమ్ముల నసుర! వినవె 231

అతికాయుఁడంతట నమితకోపమ్ముతో
బాణమ్ముఁదీయ నంబరమునందు
దేవతల్, దైత్యులు, దేవర్షులును, గుహ్య
కులును, విద్యాధరుల్ కుతుకముగను

పరికింప నిలువ రావణి విశిఖమ్మును
దొడగి లక్ష్మణునిపై విడువ నతఁడు
నర్ధచంద్ర శరము నపురూపముగఁ బ్రయో
గించి యద్దాని ఖండించివైచె
పఱప నతికాయుఁడును పంచప్రదరములను
మార్గమున వానిఁద్రుంచె లక్ష్మణుఁడు-విడిచె
నిశితశరమొండు నొసటిపై నెళవరియయి
కొట్ట వణఁకెను రావణు కొమరుఁడదరి 232

మానవా ! బాగు ! బాగు ! నీ మార్గణమ్మ
టంచు మెచ్చుచు నతికాయుఁడరదమందు
చిత్రముగ రణభూమిలో చెరలి తిరిగి
పురిమె శరములఁ బుంఖానుపుంఖములుగ 233

అవి సూర్యబింబములటుల నాకాశము
సలిపె తేజస్స్వంతచారిమముగ
కాని సౌమిత్రి ముక్కలు, ముక్కలుగఁజేసి
తనదాఁక రాకుండ ధాటి నెఱపె
అతికాయుఁడది చూచి యతికోపమునను ల
క్ష్మణుని గుండెలపైనిఁ గడిమిఁగొట్టె
దాన సౌమిత్రి రక్తము స్రవియింపగ
దానధారలతోడి దంతివోలె

నుండి విశిఖముఁదీయుచు నుద్ధృతముగ
పఱప నాగ్నేయ శరము నా పాలసుపయి
నతఁడు సౌరాస్త్రమేసెను ప్రతికృతముగ
అవ్వి రెండును దలపడి యంతమయ్యె 234

దోషాచరుఁడాతనిపై
నైషికబాణమ్ము వేయ నైంద్రాస్త్రమునన్
రోషాకులుఁడౌచు మహా
భీషణగతి లక్ష్మణుండు పెలుచం ద్రుంచెన్ 235

తనకోలపాటును దనుజుండు పరికించి
యామ్యాస్త్రమేయ రామానుజుండు
వారించె దానిని దారిలో వాయవ్య
శరముఁ బ్రయోగించి శక్తిశాలి
బాణవర్షమ్మును బగతుపై గురిసె ల
క్ష్మణుఁడవ్విరిత్తయై కవచమునకు
తగిలి మొద్దు వడగ తదుపరి సౌమిత్రి
వేయిబాణములేసె విబుధలైరి

పై-దశానను తనయుఁడు బాధపడక
కొండచందముగా నిల్చె దండి మగఁడు
మొక్కవోవక రథముపై మొగ్గతిలక
చెక్కుచెదరక, బెదరక, చిక్కుపడక 236

వ। అట్లు కవచము భేదింపంజాలక విస్మితుండగుచుండ వాయుదేవుఁడరు దెంచి యిది యనన్యాస్త్రభేద్యంబు, బ్రహ్మాస్త్ర ప్రయోగంబున వీని వధింతువుగాకనుచు నుపదేశించినంత సుమిత్రానందనుండును. 237

పవమానుండటుఁదెల్ప లక్ష్మణుఁడు నాపాదించి బ్రహ్మాస్త్రమున్
జవముంజూపుచు వీడ లోకములనుత్పాటించు చున్నట్లు భీ
రవముంజేయుచు సంభ్రమున్ గలఁచి దుర్వారమ్ముగానేఁగి యా
ర్జవమున్ వెల్లడి సేయ శీఘ్రగతి దుర్జాతిన్ సమీపింపగా 238

గ్రహములును దారకలు భయభ్రాంతమయ్యె
దిక్కు, లంబరమున్, భూమి స్రుక్కివణఁకె
దీని గమనించి యతికాయ దితిజుఁడంత
పెక్కు బాణములంగొట్టె పెనుపరిగను 239

కాని బ్రహ్మాస్త్రమును, వాని కాండములను
లెక్కసేయక దానవు ప్రక్క కరుగ
గొడ్డలిన్, శక్తిఁబూనుచుఁగొట్టె కాని
యొత్తుకొని చని శీర్షము నుత్తరించె 240

మకుటసహిత దశాస్యకుమారు శిరము
హిమధరశిఖరము వలె మహింబడియెను
రాక్షసులుదానిఁగని భయభ్రాంతులగుచు
పసవుచున్ లంకలోనికి పాఱిరపుడు 241

ఆనందోత్సాహములన్
వానరులు సుమిత్ర సూతి పై యాత్యమ్మన్
మానుషమున్ దలఁచుచు నభి
మానముతో పూజఁజేసి మల్లాడి రటన్ 242

అతికాయుఁడు లక్ష్మణుచే
హతుఁడగుటన్ బంక్తిముఖుండాక్రోశముతో
సతమతమై హంవీరులు
హతులగుటందలఁచిమిడికె హోవడి ఘనమై 243

అనిలో ధూమ్రాక్షాదులు
చనిపోయిరి వీరులైన, సాహసులైనన్
ఘనులైన రామలక్ష్మణు
లనితర సాధ్యులుగనుండ నాశ్చర్యపడెన్ 244

అపజయ మెన్నండెఱుఁగని
నృపసూనులు, తమ్ములంత నిధనమునందన్
చపలులతో యుద్ధమ్మన
విపరీతముకాదె దనుజవీరులుమ్రందన్ 245

పోరులన పొంగిపోయెడి
వీరులు శస్త్రాస్త్రవిదులు బిట్టుబిళ్లగా
నా రఘువరు హస్తమ్ముల
లోరణముల మ్రందిరెంత రూఢిగలిగియున్ 246

నాకొడుఁకింద్రజిత్తు రఘునాయకు, లక్ష్మణుఁగట్టివైచె పెన్
వీఁకను దేవదానవులు విడ్వరమున్ దొలఁగింపరైరి కా
నీ కడకెట్లొ బంధములు నిల్వకడుల్లెను హేతువెద్దియో
నాకు స్ఫురింపదెంతకును నా పరితాపము మానుటెట్టులో 247

అతఁడు వరప్రసాదమున నస్త్రములెన్నియొ పొందె బ్రహ్మచే,
చతురుఁడు సంగరమ్ముల, నిశాచర జాతికి రక్షకుండగున్
పృతనకు నాయకుండుగ నపేక్ష మెలంగును శక్రునోర్చె సం
తతమును నాకు నిష్టుఁడును తత్పరతన్ జరియించు భక్తితో 248

ఆ రఘువీరులన్ గెలువ నాత్మజుఁడింద్రజి తప్ప వేఱొకం
డీ రణమందు నోపగలఁడే-భయమందుచు వారిఁగాంచుచున్
మారణహోమమున్ దలఁచి మార్గాన నెంచరు కాన నింద్రజిన్
పోరొనరింపఁబంపెద నపూర్వబలాధికుఁడైన వానినే 249

వానరసేనతో ప్లవగవల్లభుఁడౌ రవిసూను తోడుతన్
మానుగ నిల్చు రాఘవుని మాటఁదలంచిన కంపరమ్ముతో
నేను జయింపఁగల్గుదునె ? నేరుపుచాలదు లాతివారికిన్
వాని పరాక్రమమ్ముఁగని ప్రాయిడిగా నిలువంగ నయ్యెగా ! 250

ఆయన పత్నిఁదెచ్చితిని-ఆహవమున్ గొనితెచ్చుకొంటి నే
నే యొక దోషిగా నిలిచి నీచునిగా చరియించినాఁడ ! నా
రాయణుఁడేమొ లేక యిటు రాయిడి వచ్చునె దానవేశ్వరున్
గాయగఁజాలు సత్త్వము వికావికలయ్యెనె దైవికమ్ముగా 25

'ఛీ' యని లోకమెల్ల నిరసించెను నా ప్రతికృత్య, మెన్నడున్
మూయని ద్వారముల్ సరగ మూయగనయ్యెను నేఁడు, నేన యీ
మాయని మచ్చఁదెచ్చితిని మామక వంశప్రతిష్ఠ సర్వమున్
మాయముఁజేసితిన్ నిలుచు మార్గములన్నియు మూసివైవగా 252

రాక్షసయోధులారా ! మీరు మీస్థాన
ముల నప్రమత్తులై మెలఁగి లంక
రక్షింపవలెనుండి రమణి సీతాదేవి
కల యశోకవనము గాయవలెను
జాగ్రత్తగా నుండి జనులెవ్వరింగూడ
నందు ప్రవేశింప నడ్డుపెట్టుఁ
డది ప్రదోషమ్మైన నర్ధరాత్రంబైన
ప్రాభాతమైనను పనికిరాదు
పురము రక్షింపవలెమీరు పూన్కితోడ
వానరులఁ జక్కవగ నెంచవలదు మీరు
శత్రుసైన్యము నిలుచునో సమరమునకు
వచ్చునో గమనించుచు వార్తఁదెండు 253

అనుచు నాజ్ఞ లిడుచు తనయులనిధనముఁ
దలఁచుకొనుచు నేఁగె దనుజనేత
అంతిపురికిని విశ్రాంతికై యింద్రజి
పొగులు తండ్రిఁగనగ పోయెనపుడు 254

# షష్ఠాశ్వాసము

జనకుఁడు పొగులుటఁగాంచిన
తనయుండగు నింద్రజిత్తు దానవపతితో
ననెనిట్టుల "నేనుండగ
బనియేటికి మీకు దుఃఖవనధిమునుంగన్ 1

జనకా ! శూరుఁడు పుత్రుఁడుండ నిటులన్ స్థైర్యమ్ముఁబోనాడుచున్
వనటంజెంపగనేల ? నాద్రధిమ నిల్వంబోవఁడేవీరుఁడున్
రణభూమిన్ ధృతి రామలక్ష్మణులఁ బోరాటమ్ములోఁ జంపెదన్
చనెదన్ దీవనలిచ్చి పంపుడు ప్రతిజ్ఞన్ జేయుచుంటిన్ సుమీ ! 2

రవిచంద్రుల్, శుచి, యశ్వనుల్ యముఁడు నారాయణుండున్ గనన్
బవరంబందున నా పరాక్రమముఁజూపన్ బోవుదున్ నేను దా
నవరాజేంద్ర" ! యటంచుఁదేరిపయి జ్యానాదంబుతో గ్రక్కునన్
గవయన్ వానరసేనపైకరిగె ప్రజ్ఞాప్రాభవోపేతుఁడై 3

భేరీశంఖ నినాదముల్ చెలఁగ హంవీరుల్ విజృంభించుచున్
మూరింబోవుచు నద్వితీయులుగ బొమ్మల్ పొంగ సర్వాయుధా
సారంబున్ గురియించు కోర్కెమెయి వైశారద్యముంజూపుచున్
మేరల్మీఱుచు మేఘనాదువెనుకన్ మిట్టాడుచున్బోవగా 4

వెల్లగొడుగు పట్టి భృత్యుండు నిలువగ
చామరమ్ములఁబరిజనులు వీవ
స్తుతివాక్యముల రాక్షసులు పల్కుచుండగ
నింగిలో శీతాంశునే స్ఫురించె

రాజమార్గమ్ములో రావణి చనుచుండ
తలపించె మధ్యాహ్నతరణి నతఁడు
రాణువతో తాను రణభూమికింజేరి
యట యథావిధి హోమమతఁడొనర్ప
గంధమాల్యముల్ లాజ సంస్కారములను
శరములను వస్త్రములఁగూడ సమిధలటుల
కుదర సాధన సంపత్తిఁగూర్చుకొనుచు
మకిలభాగమునఁ అకి హోమమ్మొనర్చె 5

కనకన జ్వలియింపగా పొగలేకుండ
దహనుఁడు మండి ప్రదక్షిణార్చు
లను స్వయమ్ముగవచ్చి రమ్యమ్ముగా హవి
స్సులనందుకొనియెను చూచుచుండ
బ్రహ్మాస్త్రమంత్రము రావణి పఠియించి
యభిమంత్రణము సేయ నరదము, విలు
ఆ విధమ్ముగ హోమమతఁడు నిర్వర్తింప
గ్రహతారకల తోడ గగన మదరె
పురికొనుచు హోమమట్టుల పూర్తియగుడు
మేఘనాదుఁడు వడివడి మింటికెగిరి
కార్ముకశరస్యందన సూతఖడ్గతురగ
బృంద సహితుఁడై మాయమయ్యెను నభమున 6

అంతట సింహనాదముల నాశరసైన్యము బైలుదేఱుచున్
వంతుల మీఁద వానరుల బాణములన్ బ్రహరింపఁబూనర
వ్వంత భయమ్మునందకయె వానరులన్ వధియింపుఁడంచు తా
నెంతయొ ప్రోత్సహింపగను నింద్రజి సేనయు నప్రమత్తమై 7

శరవర్షమ్మును రాక్షసుల్ గురియ విశ్వాసమ్మునన్ తోన నా
శరనాథాత్మజుఁడున్ మఱింత తమితో శస్త్రాస్త్ర సంపన్నుఁడై
కురిసెన్ దానును బాణవర్షమును నుగ్రుండౌచు రోషాన వా
నరసైన్యమ్మును వందలాదిగను దున్మాడంగ యత్నించుచున్ 8

ఱాలున్ వృక్షములున్ ధరించి హరులున్ లావొప్పగా పెల్చనన్
నాళీకమ్ములఁ గొండలన్ విసరి భగ్నంబొందఁజేయంగ రో
షాలబ్ధమ్ముగ రావణాత్మజుఁడు శౌర్యప్రాభవోపేతుఁడై
తూలంజేసెఁబ్లవంగ యూథపుల నస్తోకమ్ముగా పోరిలో 9

ఒక్కొక నారాచమ్మున
నక్కజముగ పదులు వందలాది ప్లవగులన్
జక్కాడ మేఘనాథుఁడు
దిక్కులకుంబాఱిరపుడు దీనాస్యములన్ 10

ప్రాస, శూల, శక్తి పరిఘాపరశ్వధ
చక్ర బిండివాల శస్త్రచయము
దనుజ వీరగణము తాముఁగూడను వలీ
ముఖుల సంహరింపఁబూనిరపుడు 11

వానరుల్ కొందఱు పంక్తిముఖాత్మజు
మీఁదికి వెడలిరి మెండుకొనుచు
తమ ప్రాణములకంటె దశరథసుతు కార్య
మే ఘనంబనుచు భావించి హృదుల
సింహనాదమ్ముల సేయుచు వృక్షముల్
శైలశిఖరముల సంతరించి
ఏపున వాని ధారాపాతముగను వ
ర్షించిరి-జడియక యింద్రజిత్తు
వానిఁదునియలు గావించి బాణవితతి
గంధమాదను, నళు, మైందు, గజుని, ఋషభు
జాంబవంతుని, నీలుని, సవితృ సూతి
ద్వివిదుఁదారేయు నొప్పించెఁ దేఁకువమెయి 12

కాలాగ్నివోలె, క్రుద్ధుఁడు
గా లక్షించుచును దక్కు కపిసైన్యముపై
లీల వివిధాయుధమ్ములఁ
దూలింపగ నింద్రజిత్తు దొరకొనె మఱియున్ 13

దశముఖసూతి కొంత వడికి సైన్యము
నకు దూరముగనిల్చి నభము నుండి
అదృశ్యుఁడౌచు నీలాంబుద మట్టుల
శరవర్షమును వనచరులపైని

కురియుచుండగఁ బ్లవగులకు బాణమ్ములు
కనఁబడుచుండె రాక్షసుని జాడ
కనపట్టకుండెను-కపులు బాణాహతి
పూచిన మోదుగుల్ పోలె నిలుచ

గగనమును జూడ కొందఱి కనులు పోయె
మేఘనాదుఁడు తరుచరుల్ మీఁదఁబఱపె
ప్రాసములు, శూలములు, వాఁడి బాణములను
పైచి ప్రహరించె వానర ప్రముఖ ప్రతతి 14

రావణి బ్రహ్మాస్త్రమ్మున
వేవిధములఁ బ్లవగసేనవేధించి తుదన్
కైవడిని దాశరథులను
నోవిపడంజేసెఁగడిమి నులిగొనఁబెలుచన్ 15

వ। అప్పుడు సుగ్రీవాంగద గంధమాదన జాంబవదాంజనేయ సుషేణ మైంద ద్వివిద గజ గవయ గవాక్ష, కుముద, హరిలోమ, కేసరి వేగదర్శి విద్యుద్దంష్ట్ర సూర్యాననపావకాక్ష నళ కుముద జ్యోతిర్ముఖ ప్రముఖులైన వలీముఖవీరుల నభిమంత్రిత గదాశూల ప్రాసాది ప్రహరణంబులఁదూల నేయుచుఁదరణి కిరణ సంకాశములగు మహాశుగంబులఁ దమ్ముఁగప్పి నొప్పింపఁదదీయ శరవేగంబు సహింప కచ్చెరువందుచు రఘువరుండు లక్ష్మణునింగనుంగొని "నేఁడు శాత్రవుఁడు బ్రహ్మాస్త్రంబు నాశ్రయించుటంజేసి నజేయుఁడయ్యె నయ్యస్త్రంబు మనకు మాననీయంబగు" గాక యని యుపదేశించెను. 16

"బ్రహ్మవర గర్వితుండయి పంక్తిముఖుని
తనయుఁడప్పుడు నాకసమ్మున నడఁగుచు
అంపవానను గురియుచు నగచరులను
అమిత వేగముతోఁ దెగటార్చఁ గంటె ! 17

ఈతఁడు నంపవానఁ గురియింపగ వానరసేన సర్వమున్
భీతిని పల్లటిల్లుచును బెట్టిదుధాటికి నాగజాలకే
చేతనఁదక్కుచున్ రణము సేయకయే మనమిట్టులుండగన్
భూతలసీమఁబండుకొని పోవును దానవుఁడద్ది కాంచుచున్ 18

ఆ మహనీయాస్త్రమునకు
ధాముఁడజుంటగును గాన తమ్ముఁడ ! మనమున్
ధీమనముతోడఁ దాళుచు
భూమిపయిన్ శయింపంగఁబోలు క్షమముతో 19

మహితుఁడచింత్య సామర్థ్యమ్ము గలవాఁడు
మాననీయమ్ము బ్రహ్మాస్త్రము కద ! .
అసురేంద్ర సుతుఁడు బ్రహ్మాస్త్ర ప్రయోగముఁ
జేసి వానరుల నిశ్చేష్టితులుగ
నొనరించె మాయమై వ్యోమమ్మునందుండి
బాణవర్షమ్ముతో ఖండనమున
దితిజుని చేతతో దెసలన్ని కప్పెను
ముఖ్యులందఱు కూడ మూర్ఛపోవ

బుగులు తోడను వెలవెల బోవుచుండె
మనము కూడను మూర్ఛిల్లి రణమొనర్ప
కుండ రోషహర్షములు లేకుండ నిలువ
వెడలిపోవును రావణి పీడమాని 20

వెంటనె వారు మూర్ఛిలిరి విస్మయమందుచు మేఘనాదుఁడున్
గెంటరి కాన వారిఁబరికించుచు సల్పుచు సింహనాదమున్
గొంటుతనమ్ముతోడ జనకుందరిసించుచుఁదెల్ప సంగతిన్
దంట తొలంగు నింకను నిదానముగా చరియింపఁగోరగా 21

వ। రామలక్ష్మణులు మూర్ఛిల్లుటఁజూచి వానరసైన్యము మూర్ఛిల్లెను తాము కూడ మూర్ఛిల్లి యుండుట వలన సుగ్రీవుఁడు, నీలుఁడు, పావని తారేయుఁడు, జాంబవంతుఁడు నీ సంగతి లేశము నెఱుంగమి బుద్ధిమద గ్రేసరుఁడగు విభీషణుఁడు వానరుల నూఱడించుచు నిట్లనెను. 22

భయపడ నేలను ప్లవగులార! యిది వి
చారింపవలసిన సమయమౌనె?
రామలక్ష్మణులును బ్రహ్మ వాక్యము దాఁలు
కూడనిదగులుచేఁగుతలముపయి
శయనించి రటుల మూర్ఛలనందగా లేదు
బ్రహ్మాస్త్ర మొసఁగెను బ్రహ్మ మేఘ
నాదున కెవరైన నయముగా గౌరవిం
చక తప్పదందుచే క్షత్రియులటు

పండుకొనిరని తెల్పగఁబవనసూతి
పలికెనిట్టుల వానర ప్రముఖులెంత
మందియో మృతినందిరి మందనట్టి
వారి కూఱటగొల్పుట భావ్యమగును 23

'సరె' యని వారలిద్దఱు విషాదము మిక్కిలఁజేతులందునన్
గొఱవులతో నిశీధమునఁ గోవిదతన్ రణభూమిఁజూడ వా
నరుల శవమ్ములెల్లెడల నాపకులై పడియుండఁగాంచి రు
క్కరులగు వారి నేస్తులటు క్రాలెడి వారిని, మందభాగ్యులన్ 24

కొందఱి వాలముల్ తునిగెఁగొందఱి మస్తకముల్ తొలంగఁగా
కొందఱి హస్తముల్ సురిగెఁగొందఱికాళ్లను ద్రుంగిపోవఁగా
కొందఱి మేను లస్రములఁ గూరుకొనంగను యుద్ధభూమిలో
నెందఱొ మట్టిలోఁగలిసి రేమియుఁదోఁచక సంశయాత్ములై 25

ఎంతకు జాంబవంతు పొడయే కనిపింపకపోవ ఖిన్నులై
వంతను గుందుచున్ వెదక బాణప్రహారములున్న మేనితో
ప్రాంతమునందుఁ గంఠగతప్రాణముతోఁ బడియున్నవాని వి
భ్రాంతిమెయిన్ గనుంగొనిరి బ్రహ్మతనూజుని, జాంబవంతునిన్ 26

మన వారలు పదికోటులు
చనిపోయిరి మేఘనాదు శరముల తోడన్
అనఘా! నినుఁజూడంగను
చనుదెంచితి విభీషణుఁడ స్రష్టతనూజా! 27

ఎట్టకేలకు కనుగొంటి నిచట నిన్ను
పూజ్య భల్లూక నాయకా! మొదమొదవె
రావణాత్మజుఁడెంత దురాగతమ్ముఁ
జేసెనో కూలు యుద్ధముచేత పెలుచ

అదివిని జాంబవంతుఁడు మహాత్మ! విభీషణ! మేఘనాదుఁడున్
వదలిన బాణముల్ వలని బాధను గన్నులు విప్పలేను సూ!
ముదుకను పైగ స్పర్శనుని పుత్రుఁడు పావని యెట్టులుండె నో
విదితము సేయుమంచు నిను వేఁడెదనంచు వచింప నాతఁడున్

అంతట విభీషణుఁడు జాంబవంత! నీవు
సకల మెఱిఁగిన వాఁడ వాశ్చర్యమగును
చావ సిద్ధముగా నుండి శ్వసన పుత్రు
సేమమడుగుచు నుంటివి చిత్రముగను

అనఘులు రాఘవులుండగ
వనచరపతి, వాలిసూతి వరలుచు నుండన్
హనుమంతునడుగ హేతువు
వినుచుము భల్లూకవిభుఁడ! వివరింపు మనన్

వ। అందుకు జాంబవంతుఁడిట్లనెను

పంక్తికంధరు తనయుని బాణ వృష్టి
ప్లవగులందఱు మడిసిన వాయుసూతి
బ్రదికి యుండిన వారెల్ల బ్రదికినటులె
హనుమ మరణింప మేమంతఁదునిసినటులె

ప్రాణికోటిని బ్రదికించు పవను నటుల
ప్లవగులకు రక్షకుండుగఁబఱఁగు హనుమ
వాయువేగి పరాక్రమ వహ్నియైన
హనుమ జీవించుటే జీవితాశ మాకు 34

వ। అని పలుక నాఁజనేయుఁడు తన గోత్రనామంబులు నుడివి జాంబవంతుని పాదములు పట్టుకొని యథావిధి నమస్కరింపగా నతని నభినందించుచుఁదన్ను పునర్జీవితుంగా దలంచుకొని జాంబవంతుఁడిట్లనెను. 35

వాయుదేవాత్మజా ! వానరశార్దూల !
రక్షింపవలెఁజుమ్మి ప్లవగ జాతి
నీ వొక్కడవె వారినింబ్రోవఁ గల్గుదు
నితరులకిది సాధ్యమెపుడు కాదు
పరమపరాక్రమవంతుఁడ వొకఁడవే
చిరజీవి ! ప్లవగుల స్నేహితుఁడవు
నీ పరాక్రమమంతఁజూపింపవలసిన
తరుణమే తెంచె నెవ్వరికి లేదు
మాకు హర్షముఁ గలిగింపుమా ! కృపాళు !
తేర్చుమా దాశరథులకు కూర్చి సుఖము
ఓషధీ పర్వతమునకు నున్న రీతి
పోయి, యోషధుల్ గొనిరమ్మి ! భూరిభుజుడ ! 36

వ। ఓషధీ పర్వతమునకుఁ దెరువెఱిఁగించెద వినుము. సాగరముఁ దరించి, ఆకాశమార్గాన నీవు హిమవత్పర్వతము దగ్గరకు పోవలెను. అక్కడ ఋషభాచలమను స్వర్ణమయమగు పర్వతము, హిమవత్పర్వత శిఖరము నున్నవి. ఆ రెండింటికి మధ్యగా నోషధీ పర్వతమున్నది. దానిపై నోషధులెన్నో యున్నవి. అవి యన్ని దశదిశలఁ బ్రకాశమానముఁజేయుచు మెఱసిపోవుచుండును. అచ్చట ముఖ్యముగా మృత సంజీవిని, విశల్య కరణి, సావర్ణ్యకరణి, సంధానకరణి యున్నవి. నీవు వానినిఁదెచ్చి విగత ప్రాణులైన వానరులను సప్రాణులఁ గావింపవలెనని చెప్పుచు జాంబ వంతుఁడు హనుమంతునకు మార్గనిర్దేశమొనర్చెను. 37

జలవేగమ్మున సాగరమ్ము కరణిన్ సామీరి యుప్పొంగుచున్
మలపై దూఁకుచు పాదఘాతముల ప్రామాణ్యమ్ములంజూడకే
చలియింపంగనుజేసి తానె మలయై జాక్కొల్ప లంకాపురిన్
తలుపుల్ సర్వము తోడనే విఱిగె సౌధవ్రాతమున్ గూలగా 38

అంజనాసూనుఁడు హనుమంతుఁడప్పుడు
శ్రీరామునకు మ్రొక్కి చెచ్చెర మల
యాద్రిపై కెగురుచు నందుండి వినువీధి
కెగిరి సాగరముఁదరించి తన ప
యనము సాగింపగ నధ్వమందున భూధ
రమ్ములు, నదులు, పురములుఁబల్లె
లెన్నియో గడచుచు హిమగిరి దరిచేరి
నిర్ఝరిణుల్ కందర నినదములను

పర్ణశాలలు, ఋషభపర్వతము, హేమ
కూటమును బరికించెను కోరికిపడి
ఓషధీ పర్వతముఁగాంచె నుత్సుకుఁడయి
జాంబవంతుఁడు వివరించు సరణి నరిగి 39

ఓషధీ పర్వతము మీఁది యోషధులను
సేకరింపఁ బ్రయత్నము సేయుచుండ
తమ్ము గొనిపోవ వచ్చె నాతండనుచును
వానిఁబరికించి యవి తిరోధానమయ్యె 40

అది గ్రహించిన హనుమంతుఁడాగ్రహించి
దిక్కులదరగ అంకిడి తీవ్రముగను
పర్వతమ ! రాముపై నీకు పగయ ; అద్ది
నిశ్చయంబైనఁ బెకలింతు నిన్నుఁగడిమి 41

అనుచున్ ధిక్కృతుఁడై కపీంద్రుఁడును బాహాశక్తి నా పర్వత
మ్మును బల్మిన్ బెకలించి బాహువులపై మోయంగ నుంకించుచున్
వినువీధిం జనుచుండ ఖేచరులు నుద్విగ్నులైఁ జూడ సూ
ర్యుని వోలెన్ హనుమంతుఁడా సమయమందోర్మిన్ బ్రదర్శించుచున్ 42

అర్కమండల మటులుండె నాయచలము
అర్కునకు దగ్గఱగ సాగె నా పయనము
అంబరమునందు మఱియొక యర్కబింబ
ముదితమైనట్లు కనిపించె చదలనపుడు 43

హనుమయును సుదర్శనచక్రమును ధరించు
శ్రీమహావిష్ణువటుల భాసించె-చూచి
సింహనాదముల్ వానరుల్ చేయనతఁడు
తాను సింహనాదముఁజేసె తమకమెసఁగ 44

తత్ ధ్వనికి లంకలోనున్న దనుజులంత
కడు భయభ్రాంతులౌచును బెదఁద నఱవ
హనుమ తత్పర్వతము తోడ నగచరులకు
మధ్య నుఱుకుచు భక్తి నమస్కరించె 45

కౌఁగిలించె విభీషణుఁ గపివరుండు
ధరమటకుఁజేరుకొనిన నుత్తరక్షణమున
దాశరథులాసువాసన తగిలి తేఱి
తదుపరిని సర్వ వానరుల్ బ్రదికిరెలమి 46

చచ్చిపోయిన ప్లవగులు సైతమపుడు
కరము బ్రదుకుచు సింహవిక్రములైయేరి
అచట పడియున్న యగచరులంత నిద్ర
పోయి లేచినరీతి పెంపుగ రహింప 47

కదనమారంభమైనది మొదలుగ వన
చరులచేతిలో మ్రందు రాక్షసశవముల
వెంట వెంటనె కడలిలో విసిరివైచి
రాదశాననునాజ్ఞపై-నది తెలిసిన
శత్రువుకు లోకువగునను సంజ్ఞతోడ 48

ధరముఁగొని పావనియు యథాస్థానమందు
దానిఁ బ్రతిష్ఠఁజేయుచు దాశరథికి
వచ్చి మ్రొక్కఁగ నాతఁడు పవనసూతి
మెచ్చుకొని సంతసించెను మేదురముగ 49

హనుమంతునింబిల్చి యర్కజుఁడిట్లనె
కుంభకర్ణుఁడు చచ్చె కొడుకు లంత
మొందిరి కావున యుద్ధము రావణుం
డింక సాగింపఁడు శంకతోడ
బలము వేగమ్ములు కలవారు కొఱవుల
చేతఁబూనుచు ప్రవేశింపవలయు
లంకలోనని పల్కఁ లావరుల్ సూర్యాస్త
మయమైన వెంటనే మార్కొనంగ

లంకనిండగ, కాపున్న రాక్షసులును
భయముతో పాఱిపోయిరి ప్లవగులపుడు
పురిని గవనులకుం గోటబురుజులకును
వహ్ని ముట్టింప జృంభించెఁ బ్రళయకీల 50

తలుపుల్ దగ్ధముకాఁగ ద్వారములు ఛిద్రంబౌడు దౌవారికుల్
తల లూడంగను బ్రాంతభూమిఁబడి రక్తంబందుదోగాఁడగా
పొలతుల్ తాము భర్తృహీనలగుచున్ మూర్ఛిల్లగా పట్టణం
బలికాశాగ్నిని భస్మమైనటుల గుయ్యాలించె రోదించుచున్ 51

బిడ్డలు పోయి తల్లులును వేదనఁబొంద నసూహ్యామైన యీ
పొద్దును దాపురింప మనసుల్ వికలంబయి రాక్షసాంగనల్
సద్దకు దుఃఖితాత్మలయి సంగరముందలపోసి రావణుం
డుద్దును దెచ్చిపెట్టెనని యూర్చిరిపెల్లుగ నెంతొదీనతన్

మేడలుఁగూడ కూలిపడ మీటుచు వీణెలు చంద్రశాలలన్
చేడియలుండగా శుచియు చేడ్పడి ధ్వంసము సేయుచుండ న
ట్టాడుచు చుట్టుముట్టి విలయంబుగ నెంచుచు పాఱిపోవగా
వీడున రోదన ధ్వనులు విహ్వాలమై వినిపించె నయ్యెడన్

ఆకాశమును దాఁకు హర్మ్యముల్ వేలాది
వహ్నికాహతియయ్యె వానిలోన
వజ్ర సువర్ణ ప్రవాళమౌక్తిక హార
ములు వహ్నిలో పడి బుగ్గియయ్యె
నాయుధశాలలు నశ్వసామజముల
కుపయుక్త భూషలు నుట్టిపడెను
విలువైన వస్త్రముల్ తులఁదూగు సంపదల్
రూపఱిపోయి నిర్ధూతమయ్యె

విహగములు, మయూరమ్ములు వీణ వ్రతతి
ధ్వనులతో ముఖరితమయ్యె ధామచయము
ఆ నివేశములన్నియు నద్రిసమము
లగుచు నున్నతమ్ముగ నుండియవనిఁగలిసె

బంగారు కవచముల్ వపువుల ధరియించి
కొందఱు రాక్షసుల్ పొందుపడిరి
మేలివస్త్రమ్ముల మేనులఁదాల్చుచు
కొందఱు దానవుల్ కులుకుచుండి
రసురులు కొందఱు హారముల్ మెడవైచు
కొనుచు సంతోషాబ్ధి మునుఁగి యుండ్రి
మధువునాస్వాదించి మత్తెక్కి కొందఱు
క్రవ్యాదులుండిరి క్రమముఁదప్పి

కొందఱు నితంబినులు కట్టుకొనిన యుడుపు
లూడ్చు చుండిరి కొందఱు యోధవరులు
అచట వైరులదలఁచుచు నాగ్రహమున
దంతముల గీటుచుండిరి వంతకొలఁది

గదలు, శూలమ్ములు, ఖడ్గముల్ కొందఱు
చేతులఁబట్టుక చెలఁగు చుండ
తుత్తుక బంటిగా కొందఱు పలలమ్ము
భక్షించుచుండ నబాధముగను
ప్రియురాండ్రతోఁగూడి వెలలేని శయ్యల
కొందఱు నిద్రలఁగునుకు చుండ
భయపడి కొందఱు భార్యాసుతుల తోడ
నటు నిటు పరువెత్తనలఁత కొలఁది

ఇట్టి దానవుల్ మంటల నీల్గిరపుడు
పర్వతమ్ములవలె నున్న భవనచయము
బూడిదగ మాఱిపోయెను పురము సర్వ
మగ్నికాహుతియైపోయె నంతలోనె 56

పురహార్మ్యమ్ముల నిద్రపోవు తరుణుల్ పోరామిచే ఖిన్నలై
దురపిల్లంగను భూషణ ప్రకరమున్ దూలించి వస్త్రమ్ములన్
త్వరమాణమ్ముగ వీడుచున్ భవన సోపానాధ్వమందేఁగుచున్
పరుగుల్ తీయుచుఁ గ్రిందికిన్ జనిరి స్వాపంబెల్లఁబోనాడుచున్ 57

ఒసపరి సౌధములోషధీయుత హిమ
గిరి శిఖరమ్ములఁగేరి తోఁచె
దరికొని మేడలంతస్తులు కాలుచు
విరియుకింశుక వృక్షవితతివోలెఁ
గనిపించుచుండె లంకాపురమ్మంతయు
కరులు నశ్వమ్ములు కట్లుత్రెంచు
కొనుచుఁబురిన్ పరుగులు పెట్టుచుండగ
విలయకాలమ్మున వివిధ జలచ
రములతో కలఁగెడి సముద్రమ్ముఁబోలె
కరులు, గుఱ్ఱమ్ములటు నిటు పరుగుఁదీయ
పావకజ్వాల కడలిలో ప్రతిఫలించి
జలములెఱ్ఱగ భాసించె కళవళపడి 58

వ। ఈ ప్రకారముగా లంక సర్వము వానరుల చేతిలో నొక్క క్షణములో దగ్ధమైపోయెను, పొగలో నిరుకుకొని, మంటలలో మాడిపోవుచు రాక్షసాంగనలు చేసిన రోదనములు పదియామడల దూరము వఱకు వినిపించుచుండెను. కొందఱు రాక్షసులు మంటలలో కాలిపోవుచుండ వానరులు వారిపై పడుచుండిరి. రాక్షసుల రోదన ధ్వనులు, వానరుల హర్షధ్వానములు భూనభోంతరాళములు, సముద్రమును నిండిపోవు చుండెను. 59

స్వస్థులై రాఘవుల్ సమరభూమిని ధను
 ష్పాణులై నిలిచిరి సరసిజాక్షుఁ
డా రఘురాముండు నంతట త్వర ధను
 ష్టంకార మొనరించె లంకలోని
రజనీచరులు భయభ్రాంతులై పోవగ
 ననఘుండు వేదమయమ్మయిన శ
రాసనధ్వని చేసినట్టి పరమశివుఁ
 బురుడించె వానరుల్ పుంజుకొనుచు

సింహనాదముల్ సల్పగ చేష్టఁదక్కి
యామినీచరులేడ్వగ, రాము ధ్వనియు
మూఁడు ధ్వనులును దిక్కులు కూడి మాడె
కపులకోలాహలము మీఱెఁగదనభూమి 60

రామప్రయోగభీకరశరమ్ములు తాఁకిన లంక గోపురం
బాముకొనంగఁ గూలిపడెనప్పుడు మేడలు మిద్దెలందునన్
దీమసమందుచున్ నిలుచు తెంపరులౌదితిజుల్ రణమ్మకై
తామును సిద్ధమై నెగడ ధ్వాంతము మారెను కాళరాత్రిగా 61

వ। అంత సుగ్రీవుఁడు లంకాపుర ద్వారములు కాచి, యుద్ధమొనర్పుఁడని యాజ్ఞాపించి వానరులలో నెవఁడు దీని కంగీకరింపఁడో వానిని నఱికి వేయుఁడని కఠినముగా శాసించెను. 62

అంకా పొంకములందుచు
లంకా ద్వారములఁగాయు ప్లవగుల కొఱవుల్
జంకుచు కనుగొని దశముఖుఁ
డంకిలిపడ నుద్యమించె, నలుక గాఢమై 63

వ। కుంభకర్ణుని సుతులు కుంభనికుంభులను రాక్షస యోధులెందఱినో జతపఱచి యుద్ధమునకుఁబంపెను. రావణుని యాజ్ఞ చొప్పున యూపాక్షుఁడు. శోణితాక్షుఁడు, ప్రజంఘుఁడు, కంపనుఁడు కూడ వారి వెంట వెడలిరి. 64

సింహనాదమ్ములు సేయుచు రాక్షస
యోధులేగిరి వేగ యుద్ధమునకు
వారు ధరించు యాభరణ కాంతులు మర్క-
టుల చేతులం గొఱవుల వెలుంగు
గగనమంతటి ధగద్ధగిత మొనర్చెను
ఉదితశశాంకమయూఖ పటలి
మఱికొంత వెలుఁగిచ్చె మంటల వెలుఁగులు
కౌముదుల్ రాక్షస కపిప్రవరులు

నెంతొ మిలమిలలాడిరి యిరవుకొలిపి
మంటలాకాశమంటె హర్మ్యములు రగిలి
అర్ణవమునందు కీలలట్టడుగు వఱను
ప్రతిఫలించెను విరివి నప్పాటనపుడు 65

దానవులంతఁ బతాకమ్ములూపుచు
స్యందనమ్ముల పయి సామజముల
మీఁద గుఱ్ఱమ్ముల మీఁద ఖడ్గమ్ముల
దూయుచుఁ బరవళ్లఁ ద్రొక్కుకొనుచు
తొడల నాస్ఫాలించి పెడబొబ్బలేయుచు
ఖండనభూమికి వచ్చి పడిరి
మిడుతలు వహ్నిలోఁబడు రీతి వానర
సేనలోఁబడగను శివము పుట్టె

వృక్షముల తోడ శిలలతో పెనుగులాడి
రాక్షసులఁ జావబాదిరి రగిలి వారు
తఱిగి వైచిరి ప్లవగుల తలలు కడిమి
కపులు కొఱికిరి కినిసి రాక్షసుల చెవులు

పిడికిళ్ల పొడిచి ప్లవగులు
చిడిముడిపడి రజనిచరుల శీర్షము లగలన్
బడఁగొట్టిరి-దానవులున్
కడిఁది సంహారించినారు కపులెందఱినో

వానరులు దానవులలోని ప్రముఖుల మఱి
రాక్షసులు వానరులలోని ప్రముఖుల వధి
యించి రిరువాగు పంతము లిరవుకొనగ
ఒకరినొకరు జయించుటకుద్యమించి

ఇతని కొట్టెదనని యాతఁడెంచుచు నుండ
　　ఆతఁడే యితని ప్రహతముఁజేసె
వానిని పడఁగొట్ట వాంఛింప నీతఁడే
　　వానిని పడఁగొట్టె పగ యడఁగఁగ
ఇతనిని వంచింప నెంచగ నాతఁడు
　　అతనిని వంచించె నితఁడు బలిమి
అతనిని కొఱకగ నితఁడెంతొ తలపోయ
　　నితనిని కొఱుకుచు నేర్చె నతఁడు

ఇటుల వానరుల్ రాక్షసుల్ పటుతరముగ
ఘోరయుద్ధమొనర్చిరి కుపితులగుచు
వారు వీరిని వీరలు వారి గేలి
చేసికొనుచును సమరము చేసినారు　　69

ఇదిగో ! కొట్టెద చూడుము గొదగొనుమని
యొకఁడు డాబులు కొట్టగ నొప్పుకొనక
తానె ముందుగ ప్రహరించె త్రాణ కొలఁది
వానరులు రాక్షసులు నటు వాదడచుచు　　70

కొందఱి వసనము లూడెను
కొందఱి కవచములు జాఱె కొందఱి ధనువుల్
పొందుపడక పడిపోవగ
వందురు పడఁబోక తుములప్రధనము జరిగెన్　　71

జుట్టు విడిపోవఁదాల్చిన కట్టుబట్ట
లూడిపోవగ కవచముల్ పాడఱంగ
కేతనమ్ములు విఱుగుచు క్రిందఁబడగ
పాలసులఁజుట్టుముట్టెను ప్లవగసేన 72

సంకుల సమరమ్మటుల వి
శంకటముగ జరుగుచుండ శత్రుమనుమఁడున్
లంకించె కంపనునిపై
జంకించుచుఁబడగవాఁడు క్షమఁగోల్పడుచున్ 73

గదతో కొట్టగనంగదు
డదవదపడి మూర్ఛనంది యటుపై తేఱెన్
బదులుగ ధరశిఖరముఁగొని
వదలగఁగంపనునిపైని వాడుంజచ్చెన్ 74

అది చూచి శోణితాక్షుం
డెదిరించెను రథము మీఁద నేతెంచి క్రుధన్
ప్రదరవృష్టిఁ గురియగ నం
గదుఁడాతని విల్లుఁ దేరుఁగడిమిన్ విఱచెన్ 75

వెంటనె ఖడ్గభేటముల వేగ ధరించుచు శోణితాక్షుఁడున్
మింటికి శీఘ్రమే యెగుర మేటరియౌ కపివీరుఁడంగదుం
డొంటరి-వాని కన్న మును నొంటుకొనెన్ గగనమ్మ-లాగుచున్
గెంటరి చేతి ఖడ్గమున గేలి యొనర్చుచుఁదున్మెఁబేర్మిమై 76

ఆ కరవాలున నంగదుఁ
డా కొన్న విధాన రోషియై దానవులన్
బోకార్చె పెక్కుమందిని
కాకాక్షి న్యాయముగఁగకావిక పఱచెన్ 77

శోణితాక్షుని మరణమ్ముఁజూచి కినిసి
యరదమున ప్రజంఘుండు, యూపాక్షమేటి
బలియునిన్ వెంటఁదీసుక వచ్చి పడెను
వాలినందనుపై నప్డు పార్శ్వదుఁడుగ 78

అంతట బలియుతుండైన యూపాక్షుఁడు
తన వెంటరాఁగ స్యందనము మీఁద
సాహసియైన ప్రజంఘుఁడు చనుదెంచి
వాలితనూజునిపైఁ గవయగ
ఆ రాక్షసుల మధ్య నంగదుండపుడు వి
శాఖ తారల మధ్య చంద్రుమాడ్కి
దీపించె మైందుఁడు ద్వివిదుఁడు నతనికి
బాసటగా నిల్వ ప్రధనమెంతొ

ఘోరముగ సాగె ప్లవగులు క్రోధనులయి
వృక్షములఁబెకలించుచు విసర కత్తి
తో ప్రజంఘుఁడు వానిని దునిమెఁగడిమి
మార్గమధ్యమ్మననె యప్రమత్తుఁడగుచు 79

కోపో(ద్రేకముతో వలీముఖులు సంక్షోభించుచున్ శౌర్యమున్
జూపన్ సాగిరి పాదపమ్ములను రజ్జుల్ పల్కుచున్ వేయగా
యూపాక్షుండును స్వీయబాణముల నత్యుగ్రుండుగా వానినిన్
మాపంజేసెను చండవిక్రమముతో మార్గమ్మునందేపునన్ 80

ద్వివిద మైందులు ద్రుమములు విసర శోణి
తాక్షుఁడన్నిటి గదతోడ నలుక పెఱుగ
చెలఁగి చిందఱవందఱఁజేసి సింహ
నాదమొనరించె గర్వి, వానరులు క్రుంగ 81

అటుగా ముగ్గురు దానవు
లిటు ముగ్గురు ప్లవగులుండి యెకిరింతలతో
పటుతరముగ ఖండనమును
కటువుగఁగావించిరెంతొ కార్పణ్యమ్ముతో 82

ఒక భయంకర ఖడ్గమ్ము నొయ్యగొనుచు
నంగదునిపై ప్రజంఘుఁడుఁజెంగలించి
యుఱుక నొకసాల వృక్షము నూడఁబెఱికి
అసురుఁబ్రహరించె నంగదుండధికశక్తి 83

మఱియు పిడికిటఁబ్రహరించె మానుషాశి
తెక్కగూటిపై తారేయుఁడక్కసుఁగొని
ఆశరుఁడు ఖడ్గమును జార్చె నవనిపైని
కాని యంగదు నొసటిపై కసినిఁగొట్టె 84

క్రిందబడియున్న కరవాలుఁగేలఁబూని
ఎగురగొట్టె నాశరుతల గగనమునకు
నాతికడపు పుచ్చె వడువునంగడిమిని
వాలినందనుఁడధిక కోపమ్ముతోడ 85

పినతండ్రి చావుఁగని స్యం
దనమవరోహణముఁజేసి తటుకున వచ్చెన్
పనుకుచు యూపాక్షుఁడు వెస
దునుమ తారసుతుని స్వీయదోర్బల గరిమన్ 86

తనకడంగల శరములు తఱఁగిపోవ
చంద్రహాసముఁజేగొని స్యందనమ్ము
డిగ్గివచ్చు యూపాక్ష గుండియల పైని
ద్వివిదుఁడల్కమై గ్రుద్దు గ్రుద్దెను బలముగ 87

శోణితాక్షుఁడు యూపాక్షుజూచి రుషను
గదనుఁజేపట్టి ద్వివిదు వక్షమ్ముపైని
బాద నా ప్రహారమ్మున వానరుండు
కాలఁదిగానూఁగి గదలాగుకొని యుఱుకుచు 88

మైందుండు యూపాక్షు మార్కొని యురముపై
బలముగా ప్రహరించె నలుక మిగుల
అటుశోణితాక్ష యూపాక్షులు నిటు ద్వివి
దుఁడు మైందుండును ఛండనమ్ము

కోపోద్రేకముతో వలీముఖులు సంక్షోభించుచున్ శౌర్యమున్
జూపన్ సాగిరి పాదపమ్ములను రజ్జుల్ పల్కుచున్ వేయగా
యూపాక్షుండును స్వీయబాణముల నత్యుగ్రుండుగా వానినిన్
మాపంజేసెను చండవిక్రమముతో మార్గమ్మునందేపునన్ 80

ద్వివిదమైందులు ద్రుమములు విసర శోణి
తాక్షుడన్నిటి గదతోడ నలుక పెఱుగ
చెలగి చిందఱవందఱఁజేసి సింహ
నాదమొనరించె గర్వి, వానరులు క్రుంగ 81

అటుగా ముగ్గురు దానవు
లిటు ముగ్గురు ప్లవగులుండి యెకిరింతలతో
పటుతరముగ ఖండనమును
కటువుగఁగావించిరెంతొ కార్పణ్యమ్ముతో 82

ఒక భయంకర ఖడ్గమ్ము నొయ్యగొనుచు
నంగదునిపై ప్రజంఘుఁడుఁజెంగలించి
యుఱుక నొకసాల వృక్షము నూడఁబెఱికి
అసురుఁబ్రహరించె నంగదుండధికశక్తి 83

మఱియు పిడికిటఁబ్రహరించె మానుషాశి
ఱెక్కగూటిపై తారేయుఁడక్కసుఁగొని
ఆశరుఁడు ఖడ్గమును జార్చె నవనిపైని
కాని యంగదు నొసటిపైఁ కసినిఁగొట్టె 84

క్రిందబడియున్న కరవాలుఁగేలఁబూని
ఎగురగొట్టె నాశరుతల గగనమునకు
నాతికడపు పుచ్చె వడువునంగడిమిని
వాలినందనుఁడధిక కోపమ్ముతోడ 85

పినతండ్రి చావుఁగని స్యం
దనమవరోహణముఁజేసి తటుకున వచ్చెన్
పనుకుచు యూపాక్షుఁడు వెస
దునుమ తారసుతుని స్వీయదోర్బల గరిమన్ 86

తనకడంగల శరములు తఱిఁగిపోవ
చంద్రహాసముఁజేగొని స్యందనమ్ము
డిగ్గివచ్చు యూపాక్ష గుండియల పైని
ద్వివిదుఁడల్కమై గ్రుద్దు గ్రుద్దెను బలముగ 87

శోణితాక్షుడుఁ యూపాక్షుజూచి రుషను
గదనుఁజేపట్టి ద్వివిదు వక్షమ్ముపైని
బాద నా ప్రహారమ్మున వానరుండు
కొలఁదిగానూఁగి గదలాగుకొని యుఱుకుచు 88

మైందుండు యూపాక్షు మార్కొని యురముపై
బలముగా ప్రహరించె నలుక మిగుల
అటుశోణితాక్ష యూపాక్షులు నిటు ద్వివి
దుఁడు మైందుండును భండనమ్ము

కడిమి హోరాహోరిగా సల్ప శోణితా
క్షుని వదనమ్మును గోళ్లతోడ
బఱుకుచు ద్వివిదుండు పడవైచి ధరణిపై
చరణాహతిన్ రాయ చచ్చెనతఁడు

రెండుచేతుల మైందుండు దండసిల్లఁ
జేసి యూపాక్షు బలముగా చేష్టఁదక్క
నొక్కిపెట్టగ ధరఁబడి క్రిక్కిఱియుచు
నూపిరాడక తోడ్తోడ నుసుఱు వీడె 89

ఇద్ది గమనించి రాక్షస పృతన వెఱచి
కుంభుపైపుగఁ బరువెత్తఁ గుదుట పఱచి
యాపి దానను రోషమ్మునంది ధనువు
పట్టి కాలాహి సమబాణ వ్రతతి వీడె 90

రెండవ శక్రచాపమటులే తలపించెను కుంభుచేతిలో
నుండు శరాసనమ్మపుడ యుత్కటుఁడై చెవిదాఁకశింజినిన్
దండిగ లాగి గుప్పెనరుదారగ నాశుకవృష్టి పెల్లుగా
చెండెను వానరవ్రతతి చీఁదఱవోవగఁజేద్పడన్ త్వరన్ 91

కడువిక్రమమున కుంభుఁడు
విడిచిన బాణములతో ద్వివిదుఁబ్రహరింపన్
తడబడి భూధర శిఖరము
పడువున నాతండు ధరకువ్రాలె వణఁకుచున్ 92

ద్వివిదుఁడు పడగా మైందుఁడుఁ
గవియఁగుంభుపైనిఁ బెక్కుకర్కశశిలలతో
ననిదునిమి పంచశరముల
ప్లవగుని ప్రహరించె గుండెపై కుంభుండున్ 93

అంగదుఁడు మేనమామల
భంగపాటుఁగనుచు కుంభుపై కుఱక నతం
డంగదుని నష్ట ప్రదరము
లం గురియుచు మార్కొనంగ లక్ష్యముఁగొనకే 94

పాదపమ్ముల, శిలలతో మూదలింప
వాలి తనయుఁడు-కుంభుండు వాని నిశిత
విశిఖములఁజించి చెండాడె విక్రముఁడయి
మున్కపై గ్రుద్ది తారేయు ముడుగ జేసె 95

దానితో వాలిసూతి నేత్రముల నుండి
రక్తము స్రవింపఁదొడఁగె ధారలుగ నైన
కనుల నొకచేతమూసి చెంతను గలిగిన
సాలమొక దానిఁబెఱికి నిశాచరుపయి 96

వేయ నుంకింప కుంభుండు విశిఖములను
వేసి ప్రహరించి తారేయు గాసిపఱుప
నఱచి యాతఁడు మూర్ఛిల్లె నఱిమఱిపడి
వానరులు రామచంద్రుని పాలికరిగి 97

విషయ మెఱిఁగింప రాముండు వేగఁబంపె
జాంబవంతుఁడు మొదలగు సాహసులను
వారుద్రుమములు, జాలతో వాలిసుతుని
రక్షణకుఁబూన దనుజుఁడు రూక్షితుఁడయి 98

శిలలను, పాదపమ్ములను జేతులఁబట్టుచు కుంభుపై పడన్
జెలఁగుచు జాంబవంతుని, సుషేణుని, రంభుని, వేగదర్శినిన్
పలలుఁడు నిల్వరింపగను వారును వీరులెయయ్యు ముందుకున్
వెలలగఁజాలరయ్యె సరవిన్ రవిసూతి పరాక్రమించుచున్ 99

ఏనుగు మీఁదికిన్ పడు మృగేంద్రము కైవడి భానుసూతి యా
దానవుపైకి దూఁకి వివిధమ్ముల నాతనిపైకి వృక్షముల్
మానుగ గుప్పగా కినిసి మానిసిదిండియు బాణవృష్టితో
వానిని సర్వమున్ దునిమి భగ్నమొనర్చెఁదదీయ యత్నమున్ 100

క్రుద్ధుఁడౌచు సుగ్రీవుడు కుంభు మీఁద
కుటికి ధనువూడలాగుక విఱచివైచి
నతని శరవేగమును శక్తి నభినుతించి
పలికెనిట్టుల వానిని నిలువరించి 101

ఆశరవీర ! దశాస్యుని బాణ వే
గము, విక్రమము, ప్రభావమును, ధాటి
నీలోన మిన్నగ నెలకొను-బలితోడ
ప్రహ్లాదుతో వృత్తవైరి తోడ

వైశ్రవణునితోడ పాటియౌదువు నీవు
నీ తండ్రి తరువాత నీ వొకఁడవె
వీరుఁడవగుదువు-విజతేంద్రియుని రోగ
మేమి చేయని రీతి యేమిచేయఁ

జాలరే దేవతలు ధనుష్పాణివైన
కనెదనొకపరి నీ పరాక్రమముఁజూపు
వరబలమువల్ల మేటి రావణుఁడు-నీవొ
నిజబలమువల్ల దశముఖునికి సముఁడవు

ఇఁక ధనుర్విద్యలోన నీ వింద్రజిత్తు
తో సమానుఁడవగుదు నింద్రునకు శంబ
రునకు యుద్ధము జరుగు మాడ్కి-ని మనపృథు
కదనమును సర్వభూతముల్ కాంచవలయు

ఇప్పటికి మేటి ప్లవగుల నెంతమంది
నో-వధించుచు నలసితి వూరకొనెద
నేదఁగొని రమ్ము నా బలమేదొ చూపఁ
గల నటంచును నిష్కర్షగా వచింప

అలిగి కుంభుఁడు హస్తద్వయమ్ము తోడ
భానుజుని పట్టుకొన మదవారణముల
కరణి నిప్పులనుమియుచు దురము సేయ
మొదలిడిరి గెంటుకొనుచును పొడుచుకొనుచు

వారలు బాహాబాహిన్
ఘోరానరింపంగ(గ్రాంతభూమి వడంకెన్
పారావారము కల(గెను
ఘోరుకొానెను సకల దిశలు ప్రోద్దామముగా 106

పవవడి కుంభదానవు విభాకరనందను(డూర్జితుండుగా
చొవలుచు, విక్రమించుచు సముద్రమునందున ముంచివైవగా
గ్రావగాని వారి రాశియుప్రకోపముగా వెసలేచె నెత్తుగా
పదరులు పల్కుచువ్ మరల(బాలసు(డంబుధి నుండి వేచుచున్ 107

రవిజువక్షముపై మోదె రాక్షసుండు
దాన చర్మము చిట్లి రక్తము స్రవింప
క్రుద్ధు(డై భానుసూతియు కుంభునురము
నందు(బ్రహరింప నాశరు(డంతమొందె. 108

యుద్ధకాండ ప్రథమభాగము సంపూర్ణం



# సవరింతలు

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 30 | 110 | 4 | రాముఁడెంత బలుఁడు | రాముఁడంతబలుఁడు |
| 31 | 113 | 6 | ఁదురఁగవించె | ఁదురఁగలించెఁ |
| 44 | 155 | 12 | వేఁడెద దనుజపతిని | వేఁడె దనుజపతిని |
| 61 | 217 | 4 | పయంకర్వము | భయంకరత్వము |
| 69 | 254 | 2 | మిక్కిలను | మిక్కిళం |
| 71 | 267 | 4 | నడుచుకొన మేలు | నడచుకొన మేలు |
| 75 | 2 | 12 | మిద్య | మిథ్య ! |
| 81 | 36 | 4 | ఆనరు | అనరు |
| 89 | 58 | 3 | నఘుఘుడేయ | డనఘుఁడేయ |
| 112 | 166 | 8 | ద్వివిధ | ద్వివిద |
| 122 | 177 | 2 | శుభ, మశుభమొ తెలియు ఁజుంభితముగ | శుభమొ, యశుభమొ తెలియును జుంబితముగ |
| 123 | 178 | 3 | రాజాగ్రహామునకు | రాజాగ్రహామునకు |
| 131 | 212 | 4 | పొలయించి | పొలియించి |
| 133 | 216 | 11 | పవనుఁడును | పనసుఁడును |
| 142 | 247 | 4 | దిట్టవై | దిట్టలై |
| 155 | 41 | 2 | చిత్తమ్ములో | చిత్తమ్మునన్ |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 171 | 103 | 8 | మోహితలయి | మోహితులయి |
| 188 | 155 | 4 | సేయువు | సేయుము |
| 193 | 177 | 1 | నీఱయిపోవుచు | నీఱయిపోయెను |
| 211 | 14 | 1 | కొందఱిని | కొందఱినిన్ |
| 212 | 19 | 2 | పడగవైచిన | పడగవైవగ |
| 215 | 31 | 4 | శంఖభేరీరావ స్వానములును | శంఖభేరీ ప్రతిధ్వానములును |
| 234 | 113 | 3 | ప్రతాసిలుచు | ప్రకాశిలుచు |
| 235 | 118 | 4 | దేవకార్యమున | దైత్యకార్యమున |
| 237 | 127 | 1 | ధుర్ధర్షుండు | దుర్ధర్షుండు |
| 244 | 156 | 4 | దాశరధులు | దాశరథులు |
| 247 | 174 | 2 | గాఢగా | గాడగా |
| 247 | 174 | 4 | దానవుం | రావణుం |
| 248 | 176 | 2 | హాటునకు | పాటునకు |
| 249 | 182 | 2 | నొనర్చి | నొనర్ప |
| 256 | 215 | 3 | కుంధకర్ణుఁడున్ | కుంభకర్ణుఁడున్ |
| 265 | 249 | 5 | భయము కలిగె నెవ్వండు చావ | భయము కలిగె నాచేత నెవ్వండుచావ |
| 267 | 2 | 2 | హితంబీవుదు | వినంబోవడు |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 277 | 44 | 2 | మృత్యసముడును | మృత్యుసముఁడును |
| 281 | 58 | 4 | వరె | వలెను |
| 286 | 77 | 11 | కదవె | కదలె |
| 290 | 95 | 3 | యేముండెడి | మేముండెడి |
| 291 | 96 | 2 | నుకుచుఁగడియన్ | నూఁకుచుఁగదియన్ |
| 291 | 97 | 2 | దనకం | కదనం |
| 296 | 117 | 3 | ఘననుగ | ఘనముగ |
| 298 | 126 | 4 | గేఱుచు | గేరుచు |
| 298 | 127 | 4 | కడతు | కడకు |
| 299 | 129 | 1 | ఆయుధంబొయె | ఆయుధముంబోయె |
| 299 | 130 | 2 | పఱగించె | పఱఁగించె |
| 299 | 131 | 4 | నుద్భాసిల్లుచున్ | నుద్యోగించుచున్ |
| 301 | 139 | 2 | సాంపుగ | సొంపుగ |
| 302 | 144 | 4 | కుట్టీకముం | కుట్టాకముం |
| 311 | 180 | 11 | హర్షమాణుపై | హర్షమాణులై |
| 316 | 204 | 3 | బఱగింపగ | బఱఁగింపగ |
| 319 | 215 | 1 | సేవ | సేన |
| 323 | 229 | 3 | భూషణ | భాషణ |
| 325 | 233 | 4 | పురిమె | పులిమె |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 327 | 238 | 2 | నుత్బాటించు | నుత్పాటించు |
| 331 | 3 | 1 | యశ్వనులు | యశ్వినులు |
| 333 | 10 | 3 | మేఘనాధుడు | మేఘనాదుడు |
| 337 | 23 | 3 | దాఁలు | దాఁటు |
| 339 | 28 | 2 | మొదమెదవె | ముదమొదవె |
| 339 | 28 | 4 | కూలుయుద్ధము | కూటయుద్ధము |
| 347 | 57 | 1 | ఖిన్నులై | ఖిన్నలై |
| 348 | 59 | 4 | కాలిపోవుచుంద | కాలిపోవుచుంత |
| 352 | 76 | 4 | చునెమ్మె | చూసె |
| 353 | 78 | 2 | మరణమ్మె | రోషమ్మె |
| 356 | ·91 | 3 | నాశుక | నాశుగ |
| 357 | 93 | 2 | శిలలతో | శిలలన్ |



—o—